# మమత - మానవత



(న వ ల)

క మ లా కాం త్

జ యం తి ప బ్లి కే ష న్స్,
గోపాలరెడ్డి రోడ్ : : విజయవాడ-2.

# అంకితం

ఆశలు పేకమేడలరీతి అయి, కంటకావృత
మైన ఆశయాల బాటలో ప్రయాణించలేక,
ఆదర్శాల నిచ్చెన నధిరోహించి గమ్యానికి
చేరలేక, సాధన, కార్యదీక్ష, ఆలోచనలు
గాలిలో తృణకణాల చందమై, జీవన్మృతు
డైన మూర్తి, మానవరక్కసుల కఠోరాంత
రాత్మలకు బలిఅయిన శారదపాత్రలలాంటి
నిర్భాగ్యులకు, మేరీ, లూసీలాంటి అమృత
హృదయాలకు...

రచయిత

కమలా కాంత్.

# మమత - మానవత

రాత్రంతా చిక్కని కారుచీకటి నిరంకుశంగా రాజ్యం చేస్తూనేఉంది. చీకటి తెరలు అప్పుడప్పుడే విడి పోయి పలుచబడుతున్నాయి. విడీవిడని ఇరుల తెరలను ఛేదించుకొంటూ రైలు ముందుకు దూసుకుపోతోంది ఆత్రంగా...కిరాతుని వాడి శరంలా...గమ్యస్థానం ఎప్పుడు చేరుదామా అని ఆతృత పడే బాటసారిలా...

రైల్లో రెండవతరగతి పెట్టెలో మెత్తని బెర్త్‌మీద మురళి నవలా పఠనంలో మునిగిపోయి ఉన్నాడు...ప్రఫుల్లిత ప్రత్యూషపు చల్లని పిల్లతెమ్మెర అతని శరీరాన్ని తాకి గిలిగింతలు పెట్తోంది. మురళి అప్పుడే 'జోలా' 'జర్మినల్' పూర్తిచేసి ప్రక్కన పెట్టాడు. కంపార్ట్‌మెంట్‌లో మురళి తప్ప యింకెవ్వరూ లేరు. ఎలక్ట్రిక్ బల్బు మాత్రం కాంతివంతంగా వెలుగుతోంది. మురళి రాత్రంతా నవల చదువుతూ నిద్రలేకుండానే ప్రయాణం చేశాడు. అతనికి పుస్తకాలుంటే చాలు. నిద్రాహారాలుకూడ మరచిపోతాడు. ఏ పుస్తకం చదవడం మొదలుపెట్టినా ఒక్కబిగిన పూర్తయ్యేవరకూ దానిని వదలిపెట్టే అలవాటు లేదతనికి...పుస్తకాలే అతని సర్వస్వం. స్నేహితు లతనిని 'బుక్ వామ్' అంటూ ఉంటారు. ఈ దూరప్రయాణంలో కూడ మురళి అతని ప్రాణమిత్రులయిన పుస్తకాల్ని వదలి

పెట్టలేదు. తనతోబాటు ఒక నవలలసెట్టునుకూడ తెచ్చు కొన్నాడు...

రాత్రంతా నిద్రలేకపోవటంవల్ల మురళికి అంతా బద్ధకంగా ఉన్నది. లేచి కిటికీగుండా బాహ్యప్రకృతిని చూస్తూ కూర్చున్నాడు. స్వచ్ఛమయిన పిల్లగాలి మురళిని నునుమెత్తగా స్పర్శించి చక్కలిగింతలు పెట్టింది. కళ్ళ ముందు వేగంగా వెనుకకు జారిపోయే లావణ్యమైన ప్రకృతి అతనికి కన్నుల పండుగ జేస్తోంది.

మురళి పరవశమైనాడు. అతని హృదయం మధుర భావాల మృదులస్పర్శతో రాగరంజితమయింది. ఎన్నో సుందర ప్రకృతి దృశ్యాలు ఒకటి తరువాత ఒకటి వేగంగా కన్నులముందు సాగిపోతున్నాయి.

అంబరాన్ని చుంబించే గిరి శిఖరాలు, ఏపుగా పెరిగి పచ్చగా కళకళలాడే చెట్లూ, పొదలూ, ఆ లావణ్య లహరి ఆస్వాదనలో మురళి తనను తానే క్షణకాలం మరచి పోయాడు.

మురళి గమ్యస్థానం దగ్గరపడుతున్నకొద్దీ అతనిలో ఏదో అనిర్వచనీయమైన ఆనందం, ఆత్రం పెల్లుబికి అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

మురళి యం. ఏ. ఆనర్స్ ప్యాసయ్యాడు. అతని చదువంతా ఢిల్లీలోనే పూర్తయింది. ప్రస్తుతం ఢిల్లీలోనే ఒక కాలేజీలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. సుందర రూపి...మంచి వర్చస్సు...బలిష్టమయిన శరీరం...తోటి లెక్చరర్లలోనేగాక విద్యార్థు లందరిలోనూ తలల్లో

నాలిక. అతనంటే అందరికీ ఒకవిధమైన గౌరవం, యిష్టమూ...అభిమానమున్నా...

"కొందరి జన్మతీరే అంత. ఏ దేశంపోయినా, ఎలాంటి జనంలోవున్నా, అందరికీ నచ్చేటట్లుగా, ఒకరిని నొప్పించకుండా, తనూ బాధపడకుండా సంతోషంతో నెట్టుకుపోగలుగుతారు. అలాంటివారిని దివ్యమైన జీవితా లనే గట్టిగా చెప్పొచ్చు. ఎక్కడికి పోయినా దివ్యంగా చలామణీ అవుతారు."

ఈ పైవాక్యాలు మురళికి సంపూర్ణంగా అన్వ యిస్తయ్.

మురళి పేరొందిన రచయిత కూడాను...అతను వ్రాసిన వందలాది కథలు తెలుగు వివిధ పత్రికలలో ప్రచు రించబడి పాఠకుల ప్రశంసల నందుకొన్నాయి. ఒక సంవత్సరం ఆంధ్రదేశపు ప్రసిద్ధ వారపత్రిక నిర్వహించిన కథల పోటీలలో అతనికి ప్రథమ బహుమతి లభించింది. అతను వ్రాసిన చాల కథలు ఇంగ్లీషు, హిందీ భాషలలోకి కూడా అనువదింపబడి ప్రజాదరణ పొందాయి.

మురళి ఆంధ్ర పాఠకలోకపు అశేషాదరాభి మానాలు చూరగొన్న ప్రసిద్ధ కథకుడే గాక మంచి నవలా కారుడు కూడా. చక్కని పాత్రపోషణ, సంభాషణా చాతుర్యం, మృదు మధుర కథాగమనం, భావగాంభీర్యత లకు అతని రచనలు పెట్టింది పేరు. అతని రచనలు పాఠకు లకు నీతిబోధకంగానూ, చైతన్యకరంగానూ ఉంటాయి.

ఇంగ్లీషులోకూడా మురళి వివిధవిషయాలమీద వ్యాసాలు వ్రాస్తూ ఉంటాడు...

ఇంగ్లీషు రచనా రంగంలో కూడ తెలుగుతో సమంగా ప్రవేశమున్నది మురళికి. పేరు ప్రతిష్టలు కూడ తెలుగుతో సమంగా ఇంగ్లీషు రచనలతోగూడ గడించాడు. ఇంగ్లీషులో కథలు, పద్యాలు వివిధములయిన విషయాలమీద వ్యాసాలు వ్రాస్తూ ఉంటాడు. అతను ఏమి చెప్పినా సూటిగా, సరళంగా, భావగర్భితంగా చెప్తాడు.

మురళి తండ్రి రాజశేఖరరావుగారు. ఢిల్లీలోనే ఒక ప్రసిద్ధ వ్యాపారకంపెనీ అధిపతులు. రాజశేఖరం, అరుణాదేవిగార్లకు మురళి ఏకైక పుత్రుడు. వారు మురళిని చిన్నప్పటినుండీ అల్లారుముద్దుగా పెంచారు.

"ఎంత ఇరవయ్యో శతాబ్దం రాకెట్లయుగంలోనైనా మనకుటుంబాల్లో ఏదో విధమయిన గుడ్డినమ్మకాలుండనే ఉంటయ్. ఎంత నవీన అభిప్రాయాలతో 'అప్‌టూడేట్'గా ఉందామనుకొన్నా తరతరాలనుండీ సంక్రమిస్తూ వస్తున్న మన సంస్కృతినీ, అలవాట్లనూ, నమ్మకాలనూ మానవుడు వదలుకోలేడు. కష్టంకూడ"

మురళి పుట్టిన తరువాతనే రాజశేఖరంగారి వ్యాపారం పరిస్థితులు బాగుపడినయ్యని, ఆయనకు పేరు ప్రతిష్ఠలు వచ్చినయ్యని, ఆయనకు ఒక గుడ్డి నమ్మకం. మురళి పుట్టిన తరువాతనే ఆయన బాగా సంపాదించారట కూడ. అందుకనే ఆయనకు మురళి అంటే అమితమైన

ప్రేమ. నిండైన సంసారం వారిది. రాజశేఖరంగారు రెండు మూడు తరాలవరకూ తరగనంత డబ్బు సంపాదించారు. వారికి లోటు ఏమీ లేదు.

"సృష్టికంతటికీ మధురాతి మధురమైనది స్నేహితం. స్నేహాన్ని మూలంగా తీసికొని ఎందరో కవులు ఎన్నో కావ్యాలు అల్లారు. ఏ దగ్గరి బంధువుకీ ఇవ్వని గౌరవం, ఉత్కృష్టమయిన స్థానం, స్నేహితులకు యివ్వడం జరుగుతుంది చాలమందిలో. అలాంటి స్నేహం లోకాతీతమైనటువంటిది...ప్రశంసనీయమూ...కారణం యితమిద్ధమని చెప్పలేకపోయినా ఏదో నిగూఢమైన శక్తి జననాంతర సౌహార్ద్భావం కారణాలుగావచ్చు"

మూర్తిగారికీ, రాజశేఖరంగారికీ ఈ విధమయిన సంబంధమేనని చెప్పవచ్చు. రాజశేఖరంగారికి తనప్రాణం తరువాత ఏదయినా అమూల్యమైనదంటూ ఉంటే, అది మూర్తిగారితో ఆయనకున్న స్నేహబంధమే. అలాగే మూర్తిగారికీ రాజశేఖరంగారున్నూ. వారిద్దరూ ఏదో అజ్ఞాతమైన స్నేహానుబంధానికి కట్టుబడి ఒకరికొకరు ప్రాణస్నేహితు లయ్యారు.

మూర్తి, శేఖరంగార్లు ఒకానొకప్పుడు, ఒకరినొకరు విడువకుండా కలసిమెలసి ఉన్నారు. చూచేవారుకూడ వారిద్దరినీ అన్నదమ్ము లనుకొనేవారేగాని, స్నేహితులుగా భావించేవారే కాదు. అటువంటి ఆస్కారం వీరిద్దరే ఇవ్వలేదని చెప్పవచ్చు.

"కాలము, పరిస్థితుల ప్రభావం, మానవజీవితాల

మీద అనుకోని పరిణామాలు, హఠాత్సంఘటనలు సృష్టిస్తూనే ఉంటాయ్.

కాలభ్రమణంలో పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఇద్దరూ విడిపోయారు. మూర్తిగారు అనేక కష్టాల్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. విధి ఆయనతో ఆడిన చెలగాటంతో ఆయన సర్వస్వం కోల్పోయారు. జీవితంమీద విపరీతమయిన విరక్తిపుట్టి, సన్యసించి, దేశం నలుమూలలూ చూసి, అన్ని పవిత్రక్షేత్రాలూ సందర్శించి వచ్చారు. వయస్సు పెరగగా, రోజురోజుకూ ఓపిక క్షీణిస్తూ రావడంతో, ఆయన ఒక ప్రశాంత ప్రదేశంలో చిన్న ఇల్లు కట్టుకొని తత్వచింతనతో కాలం గడుపుతున్నారు. "జీవితంలో కష్టాలుపడి విసిగి వేసారిన వారికి చివరికి ఆధ్యాత్మిక చింతనే మనశ్శాంతిని కలుగజేస్తుంది". ఆ ఆధ్యాత్మిక చింతన వల్లనే యిప్పుడు మూర్తిగారు శేషజీవితాన్ని శాంతియుతంగా గడుపుతున్నారని చెప్పొచ్చు.

మూర్తిగారు రాజశేఖరంగార్ల మధ్యగల సంబంధం పవిత్ర స్నేహబంధమే కాకుండా, మూర్తిగారు రాజశేఖరం గారి కుటుంబ శుభాకాంక్షి...గురుతుల్యుడు.

"స్నేహ బంధమనేది ఒక మహోత్కృష్టమయిన అనుబంధ బంధము అంటారు. స్నేహితులమధ్య పరిస్థితుల ప్రాబల్యంవల్ల దూరం పెరిగిపోయినా వారి అనుబంధం దూరం పెరిగినకొద్దీ పటిష్టమవుతుందే గాని; తరగదు"

విధివికృతంగా మూర్తిగారు దూరంగా ఉంటున్నా, రాజశేఖరంగారి స్నేహం సడలకపోవడమేగాక, ఆయన

మూర్తిగారి సలహాలు, సంప్రతింపులు లేకుండా ఏ వ్యవహారములోకి దిగేవారుకాదు.

రాజశేఖరంగారు ప్రతి సంవత్సరమూ, పని వుసులు చూటుచూచుకొని మూర్తిగారిదగ్గరకు వస్తూనే ఉంటారు. ఆయనతో ఉండి గడిపిన కొద్దిరోజులూ, కలసిమెలగిన నాటి మధురస్మృతులను జ్ఞాపకం తెచ్చుకొని ఆనందంగా ఉంటారు. ఆ నాలుగురోజులూ పూర్వం ఉన్నట్లుగా అనుభూతి పొందేవారు. కాని మూర్తిగార్ని వదలి తిరిగి ఢిల్లీకి వస్తూంటే రాజశేఖరంగారి మనస్సు భారమయ్యేది విచారంతో. కాని, తప్పదు. పరిస్థితులకు తలవంచక తప్పదని, ఎలాగో సముదాయించుకొని భారంగా తిరిగివచ్చేవారు.

మూర్తిగారు మురళిని చిన్నపిల్లవాడప్పుడు చెప్పుడో చూచారు. తరువాత రాకపోకలు లేక, దూరాభారం వలన చూడడం తటస్థించలేదు. రాజశేఖరంగారు వస్తూఉండడం, క్షేమసమాచారాలు ఆయనద్వారా తెలుస్తూ ఉండడమేగాని దూరాభారంవల్ల మురళిని, అరుణాదేవిగార్ని, మూర్తిగారు చూచి ఏళ్ళతరబడి అయింది.

మూర్తిగారి గురించి, రాజశేఖరం మాటలలో చెప్పినప్పుడు వినడమేగాని...మురళికూడ మూర్తిగార్ని చూడలేదు. తనతండ్రికి, మూర్తిగార్కి మధ్య ఎలాంటి స్నేహితముందో, అతనికి బాగా తెలుసును. రాజశేఖరంగారు, మూర్తిగారి సలహాలు తీసికొంటూ ఉండడం, మూర్తిగారు ప్రత్యేకమైన సందర్భాలలో పంపే శుభా

శీస్సులు, ఇవన్నీ చూస్తుంటే మురళికి మూర్తిగార్ని చూడాలనే ఉత్సుకత పెరిగిపోయేది.

రానురాను మురళికి మూర్తిగారి యెడల; ఆయనను చూడకపోయినా ఒకవిధమయిన పూజ్యభావం ఏర్పడి పోయింది.

మురళి యం. ఏ; ఆనర్స్ డిస్టింక్షన్‌తో ప్యాసయి నపుడు మూర్తిగారు తనెంత ఆనందించిందీ, తెలుపుతూ ఉత్తరం వ్రాశారు—అభినందనలు తెలుపుతూ ప్రతి ఉత్త రంలోనూ మురళి రచనా వ్యాసంగానికి ప్రోత్సాహం కలుగజేస్తూ వ్రాసేవారు. వీటివల్ల మురళికి ఆయనమీద ఉన్న గౌరవం ఇనుమడించి, ఆయనను చూడాలనే తహ తహ ఎక్కువయ్యేది. తమ కుటుంబపు పేరుప్రతిష్టలకు సుఖ శాంతులకు, ముఖ్యమయిన కారణం మూర్తిగారి హృదయ పూర్వక అమృతాశీస్సులనే దృఢంగా విశ్వసించాడు మురళి. తను ఉన్నతిలోకి రావడం, పిన్నవయస్సులో నలుగురి ప్రశంసలకు పాత్రుడవడం, తన భవిష్యజ్జీవితం సుఖమయమూ, వడ్డించిన విస్తరిలాగా చేసికొనగలగడం, అంతా మూర్తిగారి చలవవల్లనే అని నమ్మేవాడు మురళి.

ఎన్నాళ్ళనుండో వాయిదా వేస్తూవస్తున్న మురళికి యిప్పుడు అనుకోకుండా మూర్తిగార్ని చూచేభాగ్యం లభించింది. కారణం మూర్తిగారు రాజశేఖరంగార్ని తప్పకుండా అందరినీ తీసికొని వచ్చిపొమ్మని ఉత్తరం వ్రాయడమే. తన ఆరోగ్యం బాగోలేదని, అందరూ వచ్చి కొన్నాళ్ళుండి వెళ్ళమని ఉత్తరం వ్రాయడంతో...మురళి

సంతోషానికి అవధిలేకపోయింది. ఇప్పుడు కాలేజీలకు వేసవిసెలవలు కావడంవల్ల మురళికి ఏ విధమయిన అడ్డంకీ లేకపోయింది.

"ఏవ్యవహారమైనా ఒక నిర్దిష్టమైన సమయానికి పూర్తిచేసుకొందామనుకొన్నా, ఒక్కొక్కప్పుడు కాలం ఒనగూడక అది అయేనాటికే అవుతుంది కాని, సకాలానికి పూర్తిచేయలేము. సమయం దానంతటదే కలసి రావాలిగాని, మనమెన్ని ప్రయత్నాలుచేసినా వ్యర్థమే అవుతుంది."

అలాగే మురళి కోరిక ఈనాటికి దానంతటదే పరిపూర్ణతకు వచ్చింది. ఉత్తరం చూచుకొని రాజశేఖరం గారు కొంచెం కలవరపడ్డారు. ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ చూచుకొన్నారు. బయలుదేరబోతుండగా శేఖరంగారికి అత్యవసరమైన ఆఫీసువ్యవహారం అడ్డొచ్చి మరి నాలుగురోజులవరకు ఎక్కడికీ కదలలేని పరిస్థితి కలిగింది.

ఈ సంఘటనతో మురళికి నిరాశ కలిగిందనే చెప్పాలి. కాని మురళి ఎలాగయినా తన ప్రయాణాన్ని మాత్రం ఆపకూడదనుకొన్నాడు. అందుకే బయలు దేరాడు. రాజశేఖరం, అరుణాదేవిగార్లు వెనుక, పనులు పూర్తికాగానే వస్తామన్నారు. మురళి ఈ ప్రయాణానికి యిదే కారణం. మురళి యిప్పుడు ఆ అజ్ఞాతమూర్తి, మూర్తిగారివద్దకు వెళుతున్నాడన్నమాట.

యింతలో మురళికి మూర్తిగారి ఉత్తరం జ్ఞాపకం

వచ్చింది. మూర్తిగారు, నాన్నగారికి రమ్మనమని వ్రాసిన ఉత్తరం తన దగ్గరే ఉంచుకొన్నాడు. కిటికీలోనుండి దృష్టిని మరల్చుకొని, 'జర్మినల్'లో ఉంచిన మూర్తిగారి ఉత్తరాన్ని చదువుకొన్నాడు.

ఒకేయ్ రాజూ!

మీ ఉభయులకీ, చి॥ మురళిబాబుకూ నా హృదయ పూర్వక ఆశీస్సులు. రోజురోజుకూ తరిగే వయస్సే కాని, పెరిగే వయస్సుకాదు. నా ఆరోగ్యమేమీ బాగుండడంలేదు. మిమ్మల్ని అందర్నీ ఒకసారి చూడాలని ఉన్నదిరా రాజూ!...ముఖ్యంగా అరుణను, మురళినీ చూచి ఏళ్ళు తర బడి అయింది. యిక నా జీవితం యిలా యిక్కడే వెళ్ళి పోవాల్సిందే. మిమ్మల్నందర్నీ ఒకసారి చూచి ఆనందించ గలిగే భాగ్యం నాకు కలిగించు. నన్ను నిరాశపరుచవని నాకు నమ్మకం ఉన్నది. మీ రాకకు ఎదురుచూస్తూ ఉంటా.

శుభాకాంక్షలతో,

నీ మూర్తి.

మురళి ఉత్తరం చదవడం పూర్తిచేసి ఏదో అవ్యక్త మైన అనుభూతితో సతమతమయ్యాడు. మూర్తిగారికీ నాన్నగారంటే ఎంత స్నేహం! వారి స్నేహాన్ని, వారి ద్దరిమధ్యగల గాఢానుబంధాన్ని కొలచి లెక్కగట్టడానికి ఈ ఉత్తరం ఒక్కటి చాలు. నిదర్శనమేమీ అనవసరం. తను చెప్పదలచిన నాలుగు మాటలూ క్లుప్తంగా వ్యథ,

స్నేహామృతాల మిళితమైన సరళమైన పదజాలంతో చక్కగా వ్రాశాడు.

ఇంకా కొన్ని గంటలలో తను మూర్తిగారి సన్నిధికి చేరుకొంటాడు. మూర్తిగార్ని ఎప్పుడు చూద్దామా అని ఆతృతగా ఉన్నది మురళికి.

ఉత్తరం మడిచి పుస్తకంలో పెట్టి రైల్వే టైం టేబుల్ చూచాడు. ఇంకా మూడు నాలుగు స్టేషన్లున్నయ్.

సూట్ కేస్ను సర్దుకొని టవల్, సోప్ తీసికొని ముఖం కడుగుకొని వచ్చాడు. అతని వదనంలో సంతోషపు రేఖలు మందంగా అల్లుకొంటున్నాయి.

అప్పుడే ప్రభవించిన బాలభాస్కరుని ఎండతో పరిసరాలు పసిడికాంతితో శోభిస్తున్నాయి. స్టేషను దగ్గర పడుతున్నకొద్దీ రైలు వేగం మందగించింది.

గనులు తొలిచి ఒడలు విరుచుకొనే బడుగు కార్మికుడిలా పెద్ద కుదుపుతో రైలు ఆగింది...నిట్టూర్పులాంటి పెద్ద శబ్దాన్ని చేస్తూ.

మురళి సూట్ కేస్తో బండి దిగి నాలుగు వైపులా పరీక్షగా చూశాడు. స్టేషనేమంత పెద్దదికాదు. స్టేషను ఒక ఎత్తయిన కొండప్రదేశంలో ఉన్నది. చుట్టూరా పచ్చటి చెట్ల గుబుర్లతో నిండిన కొండలు. స్టేషనుకు ఒక వైపున కొంతదూరంలో ఊరుగా మోలు లిలగా కనిపిస్తున్నది.

స్టేషనుకు మరొకవైపున కొండమూలలలోనుండి

ఒక వెడల్పాటి కాలువ ప్రవహిస్తోంది. ఆ కాలవ ఒడ్డునే దూరాన ఒక చిన్న పర్ణశాలలాంటి ఇల్లు; నీ రెండింటిలో స్పష్టంగా కనుపిస్తున్నది.

మురళి స్టేషనులో టిక్కెట్టు ఇచ్చి కాలవగట్టు వైపు నడిచాడు-నాన్నగారిచ్చిన గుర్తునుబట్టి ఆ పర్ణశాలే మూర్తిగారి నివాసస్థానం అయి ఉంటుంది.

కాలవలో నీరు నిర్మలంగా చిరుసవ్వడులు చేసు కొంటూ ప్రవహిస్తున్నది. కాలవ కిరువైపులా వింత వింత చెట్లూ ఉత్సాహంతో ఊగిసలాడుతున్నాయి. రంగు రంగుల పూలబాటలు ఆ చెట్లు, పరిసరాల శోభను ద్విగుణీ కృతం చేస్తున్నాయి. అటువంటి అత్యంత సుందరమైన ప్రదేశానికి రక్షగా చుట్టూరా ఎత్తయిన కొండలు. ఎక్కడో చెట్లగుబుర్ల మాటున మత్తుగా ఎలుగెత్తి కూసే గండు కోయిల కుహూ కుహూ నాదంతో, చిన్నారి విరిచేడెల సౌందర్యాన్ని, యూవ్వనాన్ని ఆస్వాదిస్తూ మత్తుగా ఝూమ్మని ఎగిరే అళిరాజుల సంగీతం సృతి కలుపుతోంది.

మురళి ఆ ప్రకృతికి పరవశమైనాడు. ఇటువంటి అతి సుందర పరిసరాల్లో నిర్జన ప్రశాంత ప్రదేశంలో ప్రకృతి దేవతతో నెయ్యం చేయగలిగే మూర్తిగారు ఎంత ధన్యులు! అనుకొన్నాడు మురళి_

అశాంతితో విసిగి వేసారిన ప్రాణాలు, క్షుభిత హృదయాలు శాంతిని పొందాలంటే ఇలాంటి అత్యంత సుందర ఏకాంత ప్రదేశాలు చాలావరకు దోహదం చేస్తయ్. జీవితంలో ఓడిన మూర్తిగారు ఇటువంటి

ప్రశాంత సుందరప్రదేశాన్ని నివాసస్థలంగా ఎన్నుకొన్నా రంటే ఆశ్చర్యంలేదు. యిలాంటిప్రశాంత ప్రకృతిగల ప్రదేశాలు ప్రజల జీవితాలపై కలుగజేసే ప్రభావం అపారమూ, అనన్య సామాన్యము.

దాదాపు తొమ్మిదిగంటలు కావస్తోంది. ఎండ ప్రభావం అంత తీవ్రంగాలేదు. చుట్టూ క్రమ్ముకొన్న చెట్లూ, ఎత్తయిన కొండల ప్రభావమది.

కొద్దిసేపట్లో మురళి మూర్తిగారి ఇల్లు చేరాడు. ఆ పర్ణశాలను, పరిసరాలను చూచి ముగ్ధుడైనాడు మురళి. మూర్తిగారి ఆ చిన్నయిల్లు నిజంగా పర్ణశాలలా ఉన్నది. చుట్టూ అందమయిన కాంపౌండు. లోపల వివిధరకాల పూలమొక్కలు ఒకవైపు. కాయగూరలు మరొకవైపు. ఆయన శ్రద్ధను చెప్పుకోవాలి మరి. స్టేషనునుండీ వస్తూ పరిశీలించిన పరిసరాల సౌందర్యం ఒకఎత్తూ, మూర్తిగారి ప్రాంగణంలోని తోట అందచందాలు ఒకఎత్తు. అంతటా నీరవని స్తబ్దత రాజ్యం చేస్తోంది. మురళి గేటుతీసి లోపలి కడుగుపెట్టగానే బొండుమల్లెలు యిచ్చిన మధురపూరితమైన సౌరభం అతనిని వుక్కిరిబిక్కిరిచేసింది. వివిధరకాల పూలు; ముద్ద గులాబి, తీగగులాబి, జాజిమల్లె...ఒకటేమిటి. సంపంగి సువాసనలకు మురళి తన్మయుడయి ఏలోకాల్లోనో, ఏ నందనవనప్రాంగణంలోనో విహరిస్తున్నట్లు గొప్ప మధురానుభూతిని పొందాడు. వివిధరకాల పూల అందచందాలు, వాటి సుగంధవీచికలు మురళిని అడుగుముందుకు వెయ్యనివ్వలేదు. మురళి మంత్ర ముగ్ధ

డిలా నిలబడి తనను, తన ఉనికినీ మరచిపోయాడు, కొన్ని క్షణాలసేపు.

'ఎవరు బాబూ!'

మురళి ఆ పిలుపుతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాడు. ఎవరో నడివయస్సావిడ గేటు అలికిడికి, పాదాలసవ్వడికి లోపలినుండి వచ్చారు. మురళి తేరుకొని జవాబు ఇచ్చే లోగా ఆమే పలుకరించారు చిరునవ్వుతో. 'రా...మురళి బాబూ!...మీ గురించి యిప్పుడే అనుకొంటున్నాము'

మురళికి ఏమీ పాలుబోవడంలేదు. ఎవరు ఈమె?!... తనకెంతమాత్రం పరిచయంలేదు...అయినా తను చిరపరిచితుడైనట్లుగా పేరుపెట్టి ఆప్యాయతతో పిలిచారేమిటి?! నాన్నగారు మూర్తిగారొక్కరిగురించే చెప్పేవారు కాని, ఎన్నడూ ఏ స్త్రీ ప్రస్తావన రాలేదు. అయితే ఈమె ఎవరయి ఉంటారు?!...మురళి చివరికి తనకు తానే సమాధానపరచుకొన్నాడు. ఆమె మూర్తిగారి ఏ దగ్గరబంధువో అయిఉండవచ్చులే అని. తనను గురించి మూర్తిగారి ద్వారానే విని అలా పేరుతో పిలువగలిగారని, లేక మూర్తిగారి మాదిరిగానే తన చిన్నప్పుడెప్పుడో చూచి ఉంటారని.

పచ్చని పసిమి. అక్కడక్కడ తల నెరిసిపోయి ఉన్నది. వయస్సు నలుబదిఅయిదే ళ్ళుండవచ్చు. ఆమె విశాలమైన నిర్మలనేత్రాల్లో అగాధమైన భావాలు అల్లిబిల్లిగా అల్లుకుపోయినట్లు దృగ్గోచరమైంది. ఆమె నిర్మల వదనంలో ఎన్నో అనుభవాల రేఖలు...

మురళి తేరుకొని, ఆలోచనలకు స్వస్తి చెప్పి చేతులు జోడించి నమస్కారం చేశాడు, సూట్ కేస్ ను ప్రక్కనే ఉన్న టేబుల్ మీదపెట్టి. ఆమె వాత్సల్యపూరిత మైన చిరునవ్వుతో అన్నారు. "మురళీబాబూ! ఆశ్చర్యంగా ఉన్నదా!? పరిచయం లేకపోయినా, తెలిసినట్లు మాట్లాడు తున్నానని? నే నెవరో నీకు తెలియదులే. నిన్ను చిన్నప్పు డెప్పుడో చూచాను నాయనా. చిన్నప్పటి మురళిమీద వాత్సల్యంకొద్దీ నీకు నేను తెలియకపోయినా యిలా పలక రించగలిగాను అంతే..."ఆమె అతిమధురంగా మాట్లాడుకు పోతున్నారు.

మురళి ఆలోచనలోపడి మాట్లాడలేకపోయాడు. అతనికి తోచడంలేదు. ఆమె ఎవరు అనే మీమాంసలో పడిపోయాడు."నాకుఆమె తెలియదు. నేను మాత్రం ఆమెకు బాగా తెలుసుట...తనను చిన్నతనంలో చూచారట." ఆలోచనలవలయంలో చిక్కుకొన్న మురళిబాబుకు వాగర్థ సౌలభ్యం నశించింది. చిరునవ్వుమాత్రం పెదాలమీదకు తెచ్చుకొని 'అలాగాండీ!' అని అనగలిగాడు...

"మూర్తిగారుకూడ యిప్పుడే మీగురించి అన్నారు. అమ్మా నాన్నగారూ కులాసాయేనా బాబూ! వారు రాలేదేం?"

"అంతా క్షేమమేనండీ! అందరూ బయలుదేరేటప్పు టికి హఠాత్తుగా నాన్నగారికి ఆఫీసు వ్యవహారం అడ్డొ చ్చింది. నన్ను ముందు వెళ్ళమన్నారు. బహుశః రెండు

మూడు రోజులలో వాళ్ళొస్తారు" అన్నాడు మురళి నమ్రతతో.

తిరిగి మురళే అన్నాడు, "చాలరోజులనుండి యిక్కడికి రావాలని మూర్తిగార్ని చూడాలని కోరికగా ఉన్నది. మూర్తిగారి ఉత్తరం చూచుకొని నాన్నగారు ప్రయాణానికి సిద్ధమయ్యేసరికి ఎంతో సంతోషించాను... నా కోరిక ఇన్నేళ్ళకు తీరుతున్నదిగదా అని. అన్నీ కలిసి వచ్చినయ్యనుకోండి. మా కాలేజీకి యిప్పుడు సెలవలు కూడ. ఇంతా బయలుదేరేసరికి నాన్నగారు ఆగిపోయారు. నేను మాత్రం ఆగలేక ముందు వచ్చేశాను"

ఆమె వదనంలో నిండయిన సంతోషం తొణికిసలాడింది. అనిర్వచనీయమైన కాంతిపుంజం లాస్యం చేసింది.

"అవును మురళిబాబూ!...అవును మరి...నువ్వా యన్ని ఎరుగవు. నీ చిన్నప్పు డెప్పుడో చూశారు మూర్తిగారు. అంతా ఉత్తరాలద్వారానే గదూ! నీకు చూడాలని ఉండడం సహజమే!"

"మూర్తిగారి ఆరోగ్యం ఎలా ఉందండీ?!...కబురు వినడంతోనే చాలాఆదుర్దాపడ్డాం. నాన్నగారు ఆగిపోవాల్సి వచ్చింది కాని ఆయన మనసంతా యిక్కడే ఉండి ఉంటుంది."

'ఫరవాలేదు మురళీ! నెమ్మదిగానే ఉన్నది. ప్రయాణంచేసి వచ్చావు బాబూ...బాగా అలసిపోయావు. కాళ్ళు కడుక్కో' అంటూ ఆమె చెంబుతో నీళ్లు తెచ్చి యిచ్చారు.

'మూర్తిగారి దగ్గర కెళ్దాంరా నాయనా!' అన్నారామె ప్రక్కనున్న గది కేసి నడుస్తూ.

సూట్ కేసు చేతిలోకి తీసుకొని మురళి మౌనంగా ఆమె వెంట నడిచాడు. ఆమెను చూస్తుంటే మురళికి అమిత మైన గౌరవప్రపత్తు లుద్భవించినై మనస్సులో.

'ఎందుకో చెప్పలేం. కొందరిని చూడగానే మన హృదయాంతరాళాల్లో వారికి విశిష్టమయిన స్థానం లభిస్తూ ఉంటుంది. కారణం అవ్యక్తమయిన జన్మజన్మాల అనుబంధాలు అయిఉండవచ్చు.'

మురళి, యిల్లు నాలుగువైపులా పరిశీలించాడు. యిల్లు నాలుగుగదులుగా ఉన్నది. గది చాల శుభ్రంగా అద్దంలా ప్రతిఫలిస్తోంది. గది గోడలకు అక్కడక్కడా ప్రసిద్ధ చిత్రకారుల సుందర ప్రకృతి దృశ్యాలు చక్కటి ఫ్రేముల్లో వ్రేలాడదీయబడిఉన్నయ్. చిత్రాల్లోని రంగుల సమ్మిశ్రమం కంటికి ఇంపుగా కనిపిస్తున్నది.

మూర్తిగారి గదిలోకి వెళ్ళారు. మూర్తిగారుపడుకుని విశ్రాంతి తీసికొంటున్నారు.

'మన మురళి బాబు వచ్చాడు' అన్నారామె మృదువుగా.

ఆయన ఉలిక్కిబడ్డారు. ఆమె స్వరం వినడంతోనే ఆతృతగా లేవడానికి ప్రయత్నం చేశారు.

ఆయనను చూడడంతోనే మురళికి ఆయనమీద గల గౌరవతత్పరతలు ఉబికివచ్చినయ్. నాన్నగారి స్నేహితాన్ని, తమ కుటుంబంతో ఆయనకుగల అనుబంధాన్ని

పురస్కరించుకొని, గౌరవభావంతో నమస్కరించాడు మురళి.

మూర్తిగారు చిరునవ్వు చిందిస్తూ "కూర్చో నాయనా" అన్నారు.

మురళి ఆయనను పరీక్షగా చూచాడు. ఆయనను చూస్తుంటే యౌవ్వనంలో ఆయన ఎంత పుష్టిగా, ఆరోగ్యంగా ఉండేవారో అర్థం చేసికోవడానికి ఎంతోసేపు పట్టలేదు.

వక్రించిన జీవనసమస్యలు, మనస్సును రంపపుకోత కోసే సంఘటనలు, జీవితాన్ని బాగా కృంగదీస్తుంటాయ్. మూర్తిగారు ఎదుర్కొనిన కఠోరసమస్యలు, అనుభవించిన కష్టపరంపర ఆయన ఇలా కృసించిపోవడానికి ముఖ్య కారణాలు కావచ్చు.

మూర్తిగారు చాలా ఆయాసపడుతున్నారు. మురళిని చూస్తూనే ఆయన క్షణకాలం స్తంభీభూతులై ఉండి పోయారు స్తబ్ధంగా.

'ఓపికగా లేదు బాబుగారూ! కూర్చోలేరు. పడుకొని విశ్రాంతి తీసుకోండి. నేనిక్కడ కూర్చుంటాను' ఆయన పాదాలవద్ద కూర్చుంటూ అన్నాడు మురళి.

కాని మూర్తిగారు పడుకోలేదు. ఏదో మాట్లాడుదామనుకొంటూనే మాట పెగలక ఏదో అస్పష్టంగా అన్నారు.

అమితమైన ప్రేమవాత్సల్యాలవలన మితిమీరిన ఆనందంమూలంగానూ, వాక్ప్రతిభ కట్టుబడి పోవచ్చు

నేమోకూడ. యిప్పుడు మూర్తిగారు అదే పరిస్థితిలో ఏమీ మాట్లాడలేకపోతున్నారు. మురళినిచూచి దాదాపు పాతికేళ్ళు కావస్తోంది. ఎప్పుడో చిన్నతనంలో చూచారు. తర్వాత ఇన్నాళ్ళకి ఎదిగిన మురళీకృష్ణను చూచేటప్పటికి అవధులు లేని ఆనందంలో ఉక్కిరిబిక్కిరయిపోయి, ప్రేమతో అతనివదనంలోనికి చూస్తూఉండడంతప్ప, కొంత సేపటివరకు ఏమీ మాట్లాడలేకపోయారు.

మూర్తిగారి విశాలమైన ఫాలభాగం, జీవన సంగ్రామంలోని ఓటమికి తార్కాణంగా అర్థంపర్థంలేని గీతల్ని పులుముకొన్నది. ఆయన నేత్రాల్లో వాత్సల్యవాహిని వెల్లుబికి వస్తోంది. వాత్సల్య పూర్వకంగా మురళిని ఆపాద మస్తకం పరిశీలిస్తూ అన్నారు...

చేతులు జాస్తూ 'ఇటురా నాయనా, మురళీ!...'

మురళి ఆయన దగ్గరగా జరిగి కూర్చున్నాడు. మూర్తిగారు అతనిని దిగ్గున తనచేతులతో లాక్కొని హృదయానికి హత్తుకొన్నారు ప్రేమతో. ఆయన నేత్రాల్లో ఒక క్రొత్తవెలుగు లాస్యం చేసింది.

'కరుణా! ఎన్నాళ్ళకు చూచాను మురళిని!' అన్నారు మూర్తిగారు ఆమెవైపు తన్మయత్వంతో చూస్తూ.

మురళికి యిందాకటినుండీ ఆమె జ్ఞాపకమే లేదు. మూర్తిగారి యెడల గౌరవ తత్పరతల మైకంలో ఏవేవో ఆలోచనానుభూతులలో తేలిపోతున్నాడు మురళి. మూర్తిగారు ఆమెను సంబోధించడంతో అప్పుడు అనుకొన్నాడు!

ఈమె పేరు కరుణాదేవిగారన్నమాట...నిజమే ... నిజంగా ఈమె కరుణాన్విత. 'సార్థకనామధేయురాలు' అని.

కరుణాదేవి చిన్నగా నవ్వారు. మూర్తిగారికి జవాబుగా, మురళిని, మూర్తిగార్ని పరవశమై ఆనందంతో చూస్తూ—ఆమెకూడ హావభావాలలో, మాటలలో, మురళి రాకతో క్రొత్తసంతోషాన్ని, ఉత్సాహాన్ని పుంజుకొన్నట్లే కనిపించారు.

మూర్తిగారు మురళి భుజాల్ని, వీపును, తలను, వాత్సల్యంతో వారి అమృతహస్తాలతో నిమిరారు.

'అంతా కులాసానా నాయనా మురళీ!' చివరికెలాగయితేనేం మూర్తిగారు మాట్లాడగలిగారు.

'ఆఁ!...అంతా కులాసానే బాబుగారూ!'

'నాన్నా, అమ్మా రాలేదేం బాబూ ... పిలుపడలేదా?!'

జరిగిన సంగతంతా వివరంగా మురళి చెప్పాడు మూర్తిగారితో. మురళీకృష్ణ వ్రాసిన నవలల గురించి, కాలేజీ విషయాలగురించి, అవీ యివీ మాట్లాడారు యిద్దరూ.

మురళికి బాబుగారు చూపే అనంతమైన వాత్సల్యానురాగాల ప్రభావంతో కళ్ళు చెమర్చినై. మూర్తిగారు అలసటచేత కూర్చోలేక మెల్లగా నడుంవాల్చారు.

మురళి ఆయనను పరీక్షగా చూచాడు. మూర్తిగారు బాగా చిక్కిపోయిఉన్నారు. నేత్రాలు నిస్తేజంగా ఉన్నయ్. వదనం పాలిపోయిఉన్నది. చాల ఆయాసపడుతున్నారు. వారి

జీవనసంధ్య దరిదాపుల్లోనే ఉన్నదని మాత్రం ఎవరయినా ఊహించడం అంత కష్టంగాదు.

క్షణకాలం గదిలో నిశ్శబ్దత ఆవరించింది. 'మురళి ప్రయాణంచేసి వచ్చాడు...అలసిపోయి ఉంటాడు కూడ. స్నానానికి నీళ్ళుతోడి భోజనం కానీయ్ కరుణా!' అన్నారు నిశ్శబ్దతను భంగం చేస్తూ...కరుణాదేవిగార్ని ఉద్దేశిస్తూ.

నవ్వుతూ అన్నారామె...'రా మురళిబాబూ. మాటల్లో నేనా విషయాన్నే మరచాను. స్నానం, భోజనం, పూర్తికానిస్తే తర్వాత ఎంతయినా మాట్లాడుకోవచ్చు.'

ఆ యిల్లాలి అమృతహస్తాల వడ్డనతో మురళి తృప్తిగా భోజనంచేసి వరండాలో మంచం వేసికొని విశ్రమించాడు. రెండురోజులనుండీ నిద్రలేకపోవడంతో బడలిక మూలంగా చల్లనిగాలి సోకగానే ప్రాణం ఏలోకాల్లోకో పోయింది. మురళి హాయిగా నిద్రపోయాడు.

* * *

పగలంతా మూర్తిగారు, కరుణాదేవిగారు, మురళి అవీయివీ మాట్లాడుకొంటూ గడిపేవారు. మురళి రచనల మీద మూర్తిగారి అభిప్రాయాలు, సలహాలు, ఎన్నో!... మురళి రచనావ్యాసంగానికి చాలా ప్రోత్సాహం యిచ్చే వారు ఆయన. సాయంత్రంపూట మురళి గంటసేపు కాలవ గట్టువెంట, కొండల్లోకి షికారు కెళ్ళేవాడు.

మురళి సాయంత్రం అలా వెళ్తూ, మూర్తి, కరుణా దేవిగార్ల అభిమానము, ఆప్యాయత, ఆదరణా మధురిమల గురించే ఆలోచిస్తూ ఉండేవాడు.

సామాన్యంగా ప్రతిఒక్కరికి యింతమంచి స్నేహితం దొరకదు. మూర్తిగారిలాంటి స్నేహితులు లభించడం ఏజన్మలోనో చేసికొన్న మహాపుణ్యఫలితమే అయిఉం టుంది, నాన్నగారికి.

నిత్యజీవితంలో ఎంతమందో పరిచయస్థుల్ని, స్నేహితులని చెప్పుకొనేవారినీ చూస్తూఉంటాం. ప్రతివ్యక్తి పరిచయంలో, స్నేహంలో ఎంతోకొంత స్వార్థం తెరవెనుక దాగివుంటుందన్న విషయం అందరికీ తెలిసినదే. స్వార్థరహితమైన, నిష్కల్మష స్నేహం మనం అరుదుగా చూడ గలుగుతున్నాం.

ఒకవేళ స్వార్థరాహిత్యమైన స్నేహితాలున్నా అలాంటి అనుబంధాన్ని ఏ కొంతమందో శాశ్వతంగా నిలుపుకోగలుగుతారు. చాలమంది ఏ మానసిక దౌర్బల్య ముసకో లోనయి స్నేహాన్ని కోల్పోతున్నారు.

"శాశ్వతమైన స్నేహబంధంతో యిమిడిపోయిన మూర్తిగారు, నాన్నగారు చాల అదృష్టవంతులు" అనుకొనేవాడు మురళి.

నాలుగురోజులు గడిచినై...అయిదోరోజు మధ్యాహ్నం రాజశేఖరం, అరుణాదేవిగార్లు ఢిల్లీనుండి వచ్చారు.

వాళ్ళరాకతో కరుణాదేవిగారి ఆనందానికి మేరలేక పోయింది. సంతోషంతో కరుణాదేవిగారు, అరుణాదేవిని ప్రేమతో కావిలించుకొన్నారు.

"యిన్నాళ్టికి దయగలిగిందటే మామీద. అబ్బ...

ఎన్నేళ్ళకు చూచాను అరుణా!" దీర్ఘమైన ఎడబాటువల్ల, అనురాగం పెల్లుబకగా పరవశమై అన్నారు కరుణాదేవి.

"మూర్తి ఏడి కరుణా—ఎలాఉంది వాడికి?" రాజశేఖరంగారు ఆతృతతో తన ప్రాణమిత్రుణ్ణి వెతుకుతున్నారు.

రాజశేఖరంగార్ని చూస్తూనే మూర్తిగారు సంతోషం పట్టలేకపోయారు. యిద్దరూ ఒకళ్ళనొకళ్ళు ఒరేయని పిలుచుకోవడమే.

వారి స్నేహానుబంధానికి మురళి ఒడలు పులకించింది.

ఈకాలంలో కావలసిన బంధువులలోకూడ ఒకరిమీద ఒకరికి అభిమానం, ఆప్యాయతలంటూ ఉండవు. కక్షలతోనూ, కావేషాలతోనూ, గర్వము, ఈర్ష్యాహంకారాలతోనూ, జీవితాంతం దూరదూరంగానే ఉంటారు. వారిమధ్య పచ్చనిగడ్డివేస్తే భగ్గుమని మండిపోతుంది. ఇలా వైరాలతో జీవితాన్ని తరింపజేసుకొనే కాలంలో, వీరిరువురి మధ్య ప్రేమాభిమానాలు, ఆపేక్షలు ఎలాకలిగి పటిష్ఠమయ్యాయో అని ఆశ్చర్యపడ్డాడు మురళి. అదంతా జనవాంతర సౌహృద్భావం.

ఆ మునికుటీరంలాంటి మూర్తిగారి పర్ణశాలలోనూ, పరిసర ప్రాంతాలలోనూ మురళి వాళ్ళరాకతో, సందడి జాస్తి అయిందనే చెప్పాలి. ఏకాంతంగా స్తబ్ధుగా గడిపే మూర్తి, కరుణాదేవీలకు ఆనందంగా గడచిపోతోంది.

వారి స్నేహమాధురి మురళి అంతరంగంలో కొం క్రొత్త అనుభూతుల్ని ప్రవేశపించింది.

మూర్తి, కరుణాదేవీల అతిశయించే స్నేహవాత్స ల్యాల మధ్య, జువ్వి చెట్ల ఈలపాటలు, పిల్లయేటి బిలబిలా ప్రవాహాల గలగలారావాల యింపయిన సంగీతాస్వాదన లోనూ, మహోన్నత గిరికందరాల ప్రాకృతిక దృశ్యాలను చూచి ఆనందించడంలోనే పదిరోజులు గడచినవని తెలిసి కొని మురళి ఆశ్చర్యపోయాడు.

"సుందర పరిసరాల ప్రభావం మన జీవితాలమీంద ఎక్కువగా ఉంటుంది. ఆహ్లాదకరమైన వాతావరణంలో, మనఉనికిని మనమే మరచి తన్మయులమయి పోతుంటాం. కాలాన్ని మరపింపజేసి, హృదయాన్ని మురిపించే శక్తి ప్రకృతిమాతకే ఉంటుంది."

ఆరోజు...రాత్రి భోజనాలయినై...కాసేపు అవీఇవీ మాట్లాడుకొని అందరూ నిద్రపోయారు...బయట అంతా పిండిఆరబోసినట్లుగా చల్లని తెల్లని వెన్నెల. వెన్నెలరేడు సర్వప్రపంచాన్ని పరిశీలిస్తూ ముందుకు సాగిపోతున్నాడు.

మురళికి మాత్రం నిద్రపట్టలేదు. పగలునిద్రపోవడమే దీనికి కారణం. మూర్తిగారి జీవితంగురించే ఆలోచనలు కుప్పలుగా వచ్చిపడుతున్నాయి అతని మస్తిష్కంలో.

బయట కొంతసేపు చల్లగాలిలో కూర్చుందామని మురళి తోటలోకి వచ్చాడు.

దూరంగా సెలయేటి ముహుర్ముహూరావం!...అడవి చెట్లగాలిపాటలూ...చీకటి పురుగుల కీచుశబ్దాలు... తెల్లని

చంద్రుని చల్లని అమృతకిరణకాంతులు!!...వెన్నెల్లో దూరాన చెట్లగుబుర్లలో తారట్లాడే అనంతమైన నీడల కాలిమ!!!...

మురళి గులాబి ప్రక్క పచ్చికలో కూర్చున్నాడు. చల్లని మలయసమీరం మెల్లగా శరీరాన్ని స్పృశిస్తోంది. దూరాన స్టేషన్లో దీపాలు మినుకుమినుకుమంటున్నాయి.

మురళి ఏవేవో ఆలోచిస్తున్నాడు. "లోపల అంతా గాఢనిద్రలో ఉంటే, తాను ఆ విశ్రాంతికి, సుషుప్తికి అతీతుడులా ఏమిటీ అర్ధరాత్రి వచ్చాస్తు! మూర్తిగారి ఆరోగ్యం ఒక మోస్తరుగా ఉన్నది. భయపడవలసిన అవసరంలేదు. తన సెలవలుకూడ అయిపోవస్తున్నయ్. రెండు మూడు రోజులలో తిరుగు ప్రయాణమవాల్సిందే. మూర్తి కరుణాదేవిగార్లతో గడిపిన ఈ పదిహేనురోజులూ తానెన్నటికీ మరువలేడు." యిలా అతని మనోపథంలో ఆలోచనలు సాగిపోతున్నయ్.

యింతలో పచ్చటి పచ్చికపై మెత్తటి, పాదాల సవ్వడి మురళి ఆలోచనలకు అంతరాయం కలిగించింది. మురళి ఆలోచనలకు స్వస్తి చెప్పి ఎవరా అని చూచాడు.

ఎవరో కాదు...మూర్తిగారు!...

యింత అర్ధరాత్రి, సర్వప్రపంచం నిశ్శబ్దంగా, విశ్రాంతి తీసికొంటుంటే, గాఢసుషుప్తికి, విశ్రాంతికి అతీతుడయిన తనకు తోడుగా, మూర్తిగారుకూడ ఉన్నారన్నమాట. మూర్తిగారు మెల్లగా ఆయాసంతో అడుగులు వేసుకొంటూ వస్తున్నారు.

మురళి ఆత్రుతతో లేచాడు. మూర్తిగార్కి ఎదు రెళ్లి ఆయన రెక్కపట్టుకొంటూ 'మీరా!?' యింకా నిద్ర పోలేదా బాబుగారూ!?' అన్నాడు.

"నిద్ర పట్టడంలేదు బాబూ! అయినా నా జీవితానికి నిద్ర ఎన్నడో కరువైందిలే!" ఆయన కంఠంలో నిరాశ, ఆవేదన, నిర్వేదం ధ్వనించినై.

"బాబుగారూ! ఆయాసంగదా...యింత దూరం యిలా నడిస్తే యింకా శ్రమకాదూ! ఎలా వచ్చారు?"

మూర్తిగారు ఏదో చెప్పాలని ఆత్రుత కనబరు స్తున్నట్లు కనుపించారు. అయినా మెల్లగా నవ్వి మురళిని అనుసరించారు. యిద్దరూ వచ్చి గులాబి ప్రక్కనే కూర్చు న్నారు.

కొంతసేపు వారిద్దరిమధ్య నిశ్శబ్దం ఆవరించింది. మూర్తిగారు ఏదో చెప్పాలని ఆత్రుత కనబరుస్తున్నారు. కొన్ని నిమిషాలుగడిచాక మూర్తిగారే అన్నారు 'మురళీ! నీకు నిద్రరావడంలేదు కదూ!'

"లేదు బాబుగారూ!" మురళి కొంత ఆశ్చర్యంతో మూర్తిగారి వదనంలోకి చూస్తూ అన్నాడు.

"అయితే సరే, నీకు యివాళ ఒక కథలాంటిది చెప్తాను. ఒక నిర్భాగ్యుని గాథ యిది. అతని జీవిత కథను విని జాలిజెందనివారు ఉండరు. ఆ హృదయ విదారకమైన కథను నీకు చెప్తే ఒక నవలరూపంలో చక్కగా మలచి వ్రాయగలవు. ఎందుకో దానిని నీకివాళే చెప్పాలని పిస్తోంది. అతనిగురించి పూర్తిగా చెప్తాను. విని అతని

జీవితాన్ని ఒక గొప్ప రచనగా రూపొందించు. ఏమం టావు నాయనా?"

"తప్పకుండా బాబూగారూ! నాకు నిద్ర రావడం లేదు. కానీ అసలే, మీ ఆరోగ్యం బాగో లేదు. మీరు శ్రమపడి చెప్పడం నిద్రలేకుండా కూర్చోడం మంచిది కాదేమో..."

"నాకేమీ శ్రమ లేదు బాబూ! మనిద్దరికీ నిద్ర రావడం లేదు. సమయమూ దొర్లినట్టుంటుంది. నీకు మంచి నవలా రచనకు గొప్ప ప్లాటు దొరుకుతుంది. అతని జీవితాన్ని విని సానుభూతిగా రెండు కన్నీటికణాలు దొర్లినా, ఆ నిర్భాగ్యుని శిథిల జీవితం ప్రశాంతి నొందుతుంది బాబూ! చెప్పమంటావా?..."

మురళి మారు మాట్లాడలేకపోయాడు. "చెప్పండి బాబుగారూ, వింటాను."

మురళికి 'బాబుగారూ' అని ఆయనను పిలవడం అలవాటయింది. ఈ పదిహేనురోజులనుండీ...మురళికి మూర్తి గారిమీద ఉన్న గౌరవభావానికి ఫలితమిది.

మూర్తిగారు నిట్టూర్చారు. కొంతసేపు ఆయన అవ్యక్తమైన ఏదో ఆలోచనలతో స్తబ్ధుగా ఉండిపోయారు. ఇంతలో ఆయనను విపరీతమైన దగ్గుతెర క్రమ్మింది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినై. తేరుకొని కలవరపాటుతో అన్నారు. "అయితే విను మురళీ! నేను చెప్పదలచు కొన్నది దుఃఖపూరితమైన ఒక నిర్భాగ్యుని జీవితాన్ని గురించి. అతని వృత్తాంతం నీకు తప్పకుండా ఉపకరిస్తుంది.

విని దానిని నీ రచనల్లో పెట్టడానికి ప్రయత్నించు. చెప్తాను విను బాబూ!"

మురళిలో ఆశ్చర్యం జాస్తి అయింది. ఆతృతగా మూర్తిగార్ని చూస్తూ కూర్చున్నాడు.

♦ ♦ ♦

"ఒరులేయవి యొనరించిన నరవర తను కవి యప్రియము..." మహాభారతం సూక్తిని నువ్వు వినే ఉంటావ్. ఆ మహోత్కృష్టమైన సూక్తిని అక్షరాలా తన జీవిత కాలంలో పాటించినవాడు బుచ్చిరామయ్యగారు. తన పిత్రార్జితం అయిదెకరాల కొండ్రమీద వచ్చే ఫల సాయంతో సంసారాన్ని పోషించుకుంటూ ఒకవిధంగా లేమిడితోనే కాలం గడిపాడు. తనేమీ ఇంగ్లీషు చదువు కోకపోయినా ఏ షావుకారు గుమాస్తా పనో చేయదలచు కొంటే దొరికేదేగాని ఆ ప్రయత్నమేమీ చేయకుండానే ఆయన జీవితం వెళ్ళబుచ్చాడు—

ఇద్దరు కూతుళ్ళ పెండ్లిళ్ళు శారదా బిల్లు రాకపూర్వమే (?) పుడిలో మంచి కట్నాలిచ్చే చేశాడు. వాళ్ళు కాపరాలకు పోయి వాళ్ళ సంసారం వాళ్ళు చేసుకొంటున్నారు. అతి కష్టంమీద ఏకైకపుత్రుడు సీతారాంను బి. యే. చదివిస్తు న్నాడు.ఆ కుగ్రామంలో ఉన్న పౌరులలో బుచ్చిరామయ్య గారంత మంచివాడు, సాత్వికుడు లేడని ప్రతీతి. శాంతమైన స్వభావం. పొరుగూరునుంచి ఏ అతిథి వచ్చినా ఆహ్వానించి సహపంక్తిని భోజనం పెట్టేవాడు.కుమార్తెల పెండ్లిండ్లకైతే నేమి, కుమారుని విద్యావ్యాసంగాలకయితేనేమి, కుటుంబ

పోషణ కయితేనేమి, చేసిన అప్పులకు మూడెకరాల పొలం చెల్లిపోగా మిగతా రెండెకరాలల్లో వచ్చే మక్తామీద కుటుంబపోషణ అతి భారమైనా అట్లాగే కాలం గడిపే వాడు. భార్య అనసూయమ్మగారుకూడా అమిత సాధ్వి. భర్తమాట జవదాటని యిల్లాలు. ఉన్నదో లేదో కాపురం గుట్టుగా వెళ్ళదీసేది. లోలోన ఎన్ని బాధలు పడుతున్నా పైకి ఎంతో ఆనందంగా, తృప్తికరంగా జీవితం వెళ్ళతీస్తున్నట్లే ఉండేవాళ్ళు. వీరిసంసారం గుంభనంగా సాగిపోవడం చూసి ఇరుగుపొరుగులు ముక్కుమీద వేలేసుకొనేవారు. అనసూయమ్మగారి అన్న సుందరరామయ్యగారు మంచి ధనిక భూస్వామి. రెండువందల ఎకరాల సుక్షేత్రమైన భూములు, తోటలు, దొడ్లు, ఇంకా లక్షలతో డబ్బు త్రిప్పుతూ ఉండేవాడు. అనసూయమ్మ అప్పుడప్పుడు భర్తతో చెప్పుతూ ఉండేది. "ఏమండి మా అన్నయ్య సహాయం అడుగుతే మనకున్న ఆర్థిక ఇబ్బందులు కొన్ని తొలగగలవేమో" అంటూ. కాని బుచ్చిరామయ్యగారు ససేమిరా అనేవాడు. ఆర్థిక సహాయానికికాదు; కాని ఒకరి దయాదాక్షిణ్యాలపై బ్రతకడమంత హీనం ఇంకొకటి లేదనే వాడు. సుందరరామయ్య గర్విష్టి. ధన మదాంధుడు. ద్రవ్యంముందు; బంధుప్రేమ, ఇతరుల ఇబ్బందులు ఆయన కొక లెక్కలోనివి కానేకావు. బీదవాళ్ళు 'తన బంధువు' అని చెప్పుకోడానికే ఆయన అవమానంగా భావించేవాడు. తన స్వంత చెల్లెలును చూడడానికికూడా ఎప్పుడూ వచ్చే వాడు కాదు ఆ ఊళ్లోనే ఉంటూకూడా. అన్ని శుభ

కార్యాలకుకూడా ఏదో సాకుచెప్పి రాకుండా ఉంచేవాడు. తను మొదటి ముగ్గురి ఆడపిల్లలకూ ఆ ఊళ్ళోనే వివాహాలు చేసినా చెల్లెలిపైనకూడ మమకారం లేకుండా, పిలవకుండా ఊరుకొన్నాడు. అటువంటి సుందరరామయ్యను సహాయం కోరటం బుచ్చిరామయ్యగారికి సుతరామూ యిష్టంలేదు. యిలాగే అప్పసొప్పచేసి, జీవితం వెళ్ళబుచ్చుతూ, కళ్ళు మూశాడు ఒకరోజున, బుచ్చిరామయ్య.

అప్పటికి సీతారాంకు 19 వ ఏడు. బి. యే. ఫైనల్ చదువుతున్నాడు గుంటూరులో. ఇంకా పరీక్షలునాలుగు నెల లున్నవనగా తండ్రి బుచ్చిరామయ్యగారు కాలం చేశారు. తన చదువు సంధ్యలకు తండ్రి ఎట్లా ఆమకొనేవాడో తనకు తెలిసేదికాదు. తండ్రికూడా కుటుంబ ఆర్థిక పరిస్థితు లను కొడుక్కు చెప్పేవాడుకాదు. కొడుకు అడిగేవాడూ కాదు. కొడుకు పట్టభద్రుడగుటకు తోడ్పడటమే ఆతండ్రి ధ్యేయం. తను బాగా చదువుకొని ప్రథమ శ్రేణిలో నిల బడడమే ఈ కొడుకు ధ్యాస. అలాగని, సీతారాంకు కుటుంబ పరిస్థితులు ఏమీ తెలియనివి, తెలియవనీ కాదు. ఏదో ఇబ్బందులుపడి అప్పసొప్ప తండ్రి జరుపుతున్నాడు. ఆయన అభీష్టానుసారం తను బాగా చదువుకొని ఏదయినా మంచి ఉద్యోగంలో ప్రవేశిస్తే కుటుంబాన్ని పీడిస్తున్న ఆర్థికబాధలు తొలగి వృద్ధ మాతా పితరులను సుఖపెట్ట వచ్చునని అనుకొనేవాడు.

సీతారాం మంచి స్ఫురద్రూపి. పల్లెటూరి వాతా వరణంలో పెరిగినందువల్ల దృఢశరీరి కాగలిగాడు. అన్ని

టికీ మించి తండ్రి గుణములన్నీ ఇతనికి బాగా అలవడినై. సాధుస్వభావం; ఇతరుల కష్టములను చూచి భరించలేక పోవడం; గంభీర హృదయుడు. ఇబ్బందులతో లోపల సుధానుడేగుతున్నా, పైకి శాంతమహాసముద్రము. సహాధ్యాయులలోనూ, ఉపాధ్యాయ వర్గంలోనూ, తలలో నాల్కగా ఉండేవాడు. విద్యార్థి బృందంకూడా ఇతనిని ఆదర్శంగా తీసికొని తమ నాయకుడుగా అంగీకరించారు. చదువులోనూ, ఆటలలోనూ, సాంస్కృతిక కార్యక్రమాల లోనూ, నడవడిలోనూ, సీతారాం అందరికీ తలమానికంగా ప్రకాశించాడు. అన్యాయాన్ని సహించలేనితనం, పట్టుదల, కార్యదీక్ష స్వతహాగా అలవడినై.

రాజకీయాలమీద చర్చలు జరుగుతుండేవి అప్పుడప్పుడూ. దేశంలోని రాజకీయ పరిస్థితి అధ్వాన్నంగా, తారుమారుగా ఉన్నది. భారతదేశ స్వాతంత్ర్యానికి విముఖులయిన తెల్లదొరల పాలనకు వ్యతిరేకంగా, నిరసనగా మన నాయకులు, ప్రముఖవ్యక్తులు వ్యక్తిసత్యాగ్రహం ప్రారంభించారు., ఈ వ్యక్తి సత్యాగ్రహం (Individual civil disobedience) మొదట చాలా సాధారణ పంథాలో ప్రారంభింపబడింది. ఈ సత్యాగ్రహంలో పాల్గొన దలచుకొనే ప్రతివ్యక్తి, ప్రథమంలో ఏదో ఒకవిధమైన పరీక్షలో ఉత్తీర్ణుడై సమర్థుడని తెలిపే అధికార పత్రాన్ని పొందవలసియుండేది. ఈ వ్యక్తి సత్యాగ్రహంలో ఎన్నుకోబడిన అభ్యర్థులు ఏదో ఒక శాసనోల్లంఘన జరిపేవారు. అలాంటి వ్యక్తుల్ని వెంటనే అరెస్టులు జరపడమూ, విచా

రణచేసి ఖైదుచేయడమూ జరుగుతోంది. ఈ వ్యక్తిసత్యాగ్రహ ప్రారంభంలో, ముందు ప్రముఖులైన వ్యక్తుల్ని ఏరుకొన్నారు. అంటే ప్రారంభంలో కాంగ్రెస్ అధిష్ఠానవర్గ సభ్యులు, రాష్ట్ర, కేంద్ర శాసనసభ్యులు, రాష్ట్ర మాజీ మంత్రులు మొదలయినవారు పాల్గొన్నారు. క్రమంగా ఈ ఉద్యమంలో పాల్గొనేవారి సంఖ్యావలయం పెరిగింది. పాతిక, ముప్ఫై వేలమంది స్త్రీ పురుషులు జైళ్ళలో మగ్గుతున్నారు. వీరిలో శాసనసభాధ్యక్షులు, చాలమంది రాష్ట్ర శాసనసభ్యులుకూడ ఉన్నారు. వీరంతా ప్రభుత్వంవల్ల బర్తరఫ్ చేయబడినవారే. వీరంతా, ఎన్నుకోబడిన శాసనసభలు రద్దుచేయబడినపుడు, ప్రభుత్వ దమననీతికి లొంగిపోవడంకన్న జైలుకు వెళ్ళడమే వృత్తమనుకొన్నారు.

వ్యక్తిసత్యాగ్రహంలో పాల్గొన్నందుకేగాక యితరత్రా నిరసన కార్యక్రమాలకు, ప్రభుత్వ వ్యతిరేకోపన్యాసాలకు, వేలాది ప్రజలను అరెస్టుచేశారు. కాలేజీల్లోకూడ కొంతమంది ఉద్యమంలో పాల్గొని అల్లరులుజరిపారు. పోలీసులు రావడం, లాఠీఛార్జి చేయడం, వారిని జైళ్ళల్లో త్రొయ్యడం జరిగింది. ఈ వ్యతిరేకోద్యమంవల్ల ఒనగూడే ఫలితా లెలాఉన్నా, ఒకటిమాత్రం నిజం. బ్రిటిష్‌ప్రభుత్వం ఎన్ని యిబ్బందులలో ఉన్నా యీ ఉద్యమానికి లొంగిపోవడంమాత్రం జరుగదు. అన్నివిధాలా అణచివేయడానికే పూనుకొంటుంది. దాని ఫలితం అప్పుడే పలుచోట్ల కనుపించిందికూడ. కాల్పులు, మార్షల్‌లా, పలుచోట్ల ప్రవేశపెట్టింది. విచక్షణారహితంగా జనాన్ని జైళ్ళలో తోస్తు

న్నది. నాయకులందర్నీ జైళ్ళల్లో ఉంచారు. సరయిన నాయకులు, మార్గదర్శకులు కరువయిన ఈ ఉద్యమం, నావికుడు, చుక్కానిలేని ఓడమాదిరి విచ్ఛిన్నంగాక తప్పలేదు.

ఉదయం కాలేజీ విద్యార్థులమీద జరిపిన కాల్పుల ఫలితంగా పలువురు గాయపడ్డారు. కొంతమందిని అరెస్టు చేశారు. నెలరోజులవరకు కాలేజీ మూసివేశారు. ఈ కాల్పులకు నిరసనగా యీ సాయంత్రం పెద్ద ఊరేగింపు, బహిరంగసభ జరపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయ్. ఈ ప్రయత్నం ఫలిస్తే మళ్ళీ కాల్పులు, యింకా ముమ్మరంగా అరెస్టులు. అమాయక విద్యార్థులు, పౌరులకు చెప్పలేని యిక్కట్లు. దీనిని ఎలాగైనా జరుగకుండా అరికట్టాలి.

యీ పంథాలో ఆలోచిస్తూన్నాడు సీతారాం తన గదిలో కూర్చుని. ఒకవేళ సభ జరిగితే తను ఆసభలో మాట్లాడవలసిన విషయాలన్నీ నోట్సు వ్రాసుకొంటు న్నాడు పైవిధంగా. యింతలో అతని లక్ష్యాన్ని భంగం చేస్తూ తలుపుకొట్టిన చప్పుడయింది.

'సీతారాం లోపలికి రావచ్చా?' గోపి కేకవేశాడు. గోపి సీతారాం సహపాఠి.

'ఓ! గోపీ, తలుపు తీసే ఉన్నది... రాహోయ్...'

గోపీ తలుపునెట్టుకొని లోపలికొచ్చాడు. 'బయట ఇంకా మనవాళ్ళున్నారు. నీతో మాట్లాడాలని వచ్చాం... లోపలికి రమ్మంటావా వాళ్ళని?!'

'ఓరి నీ అసాధ్యం... హుం. బాగానే ఉన్నది నీవరస.

వచ్చినడగాలటోయ్ స్నేహితులను లోపలికి ఇన్వయిట్ చెయ్యడానికి.'

సీతారాం అంటే సహవిద్యార్థుల్లో కూడా ఎంతో గౌరవం.

గోపితోపాటు వెంకటరమణ, సత్యమూర్తి, రాం గోపాల్, జయరాం లోపలకు వచ్చారు.

'నేనే మీ అందరిదగ్గరకు రావాలనుకొంటున్నాను. ఇంతల్లోకే మీరు వచ్చారు. కూర్చోండి అంతా. చూశారు గదా ప్రొద్దున సమాచారం.'

'అవును సీతారాం. ప్రభుత్వ చర్యలను నిరసిస్తూ ఒక ఊరేగింపు, బహిరంగసభ, జరపాలనుకొంటున్నాం. నీ అభి ప్రాయ మేమిటి?' అన్నాడు గోపి.

'నిజంగా ప్రభుత్వంచర్య గర్హనీయమే. కాని యీపరిస్థితులలో యింకా ప్రభుత్వాన్ని రెచ్చగొట్టి యిబ్బందులు కొని తెచ్చుకోటమే అవుతుందేమోనని నాభయం సుమా... అదీ...' సీతారాం అన్నాడు తగ్గు స్థాయిలో అందరివైపు చూస్తూ—

"ఇబ్బందులు వస్తయ్యని యీ అత్యాచారాన్ని చూస్తూ ఊరుకొంటామా సీతారాంగారూ?" సత్యమూర్తి తన సహజ ఉద్రేక స్వభావాన్ని మాటల్లో వ్యక్తంచేశాడు.

"నిజమేకాని, దీనిలో ఒక బాధ్యతకూడా ఉంది. ప్రజలు, విద్యార్థులు, దేశంలో జరుగుతున్న యీ ఘోర కాండకు చాలా ఉద్రేకంలో ఉన్నారు. ప్రభుత్వం

ఈ ఉద్యమాన్ని అణచడానికి గట్టి చర్యలు తీసుకొంటున్నది.

ఉద్రేకపూరిత ప్రజలు, ఏదో సభ జరుపుతుంటే, ఇదే అదనుగా తీసుకొని దుండగులు అల్లరిపనులు, లూటీలు మొదలయినవాటికి పూనుకొంటారు. ఖాయం. అటువంటివార్తలు మనం రోజూ వింటూనేవున్నాంకూడా. అటువంటివి జరిగితే కష్టాలు అనుభవించేది అమాయకులు. వీటికిబాధ్యత మనం తీసుకోలేనే మోనని నా అభిప్రాయం." సీతారాం కలవరపాటుతో ఉద్రేకి సత్యమూర్తివైపు శాంతంగాచూస్తూ అన్నాడు. 'అవును సీతారాం...నిజమే. ఇటువంటి ఉద్యమాలలో ఎప్పుడూ ఎవరికో, కొంతనష్టం వాటిల్లవచ్చు. ఎవరి జాగ్రత్తల్లో వారుంటారు. ఉండాలి కూడ. ఏమైనా దుండగాలు జరిగితే మనమెందుకు బాధ్యుల మౌతాం వాటికి.' రాంగోపాల్, సత్యమూర్తి అభిప్రాయాన్ని సమర్థిస్తూ అతని ఉద్దేశ్యాన్ని బలపరిచాడు.

'దేశమంతా ఇటువంటి సభలు జరుగుతున్నాయ్. విద్యార్థు లనేకమంది పాల్గొన్నారు; ఈ ఉద్యమంలో... మనం వెనుకంజ వేయకూడదు సీతారాం!' జయరాంకొంత సౌమ్యంగా తన ఉద్దేశ్యాన్ని బయల్పరచినా ... అతనూ విప్లవధోరణినే వాంఛించడం సీతారాం కలవరపాటును ద్విగుణీకృతం చేసింది.

'ప్రభుత్వచర్యలను నిరసించవలసిన బాధ్యత ఎంతుందో, ప్రజల ఆస్తిపాస్తులను కాపాడవలసిన బాధ్యత కూడా ఇంకా ఎక్కువే ఉంటుంది మనకు. ఇటువంటి పరిస్థి

తులను అవకాశంగా తీసుకొని దుండగులు లూటీ చేయ టానికి జంకరు. దాన్ని తట్టుకోటానికి ఒక విజిలెన్స్ కమిటీగాఏర్పడి, మనం దుండగులనుండి ప్రజల ప్రాణాలను, ఆ స్తిపాస్తులను కాపాడడానికి పూనుకోవాలి. దీనికి పుర జనుల పూర్తి సహకారం లభించుతుందని అనుకొంటాను. దీనికి ప్రభుత్వ సహకారంకూడా లభిస్తుంది. ఇకపోతే మన నిరసనసభ జరపడం విషయంలో అరెస్టయిన మన నాయకు లను విడుదల చేయవలసిందిగా ఒక తీర్మానం చేద్దాం. యీ ఉద్యమానికి వారి ఆమోదామోదాలు మనకు తెలి యవు. తెలియజెప్పడానికి ఎవరూలేరు. దీన్ని విరమింప జేయటానికికూడా చెప్పేనాథుడు లేడు. కనుక నాయకుల విడుదలకుమాత్రం తీర్మానం చేద్దాం.' సీతారాం ఉద్దేశ్యం ఒకటే. ...ఎలాగయినా సాత్వికంగానే సమస్యాపరిష్కారం జరగాలి. సహచరుల నందర్నీ సౌమ్యమార్గానికి మళ్ళించేం దుకు ప్రయత్నం చేయాలి.

'సరే మంచిదే. సరిగ్గా సాయంత్రం నాలుగు గంట లకు కాలేజీ ఆవరణలో ఊరేగింపని ప్రకటిస్తున్నాం. మీారురండి. ఏర్పాట్లన్నీ చూస్తాం. నేం వెళ్తాం సీతారాం... సరేనా' గోపి, సీతారాంతో ఏకీభవిస్తూ కార్యసన్నద్ధుడై లేచాడు.

'మంచిది. వస్తాము' సీతారాం...అందరూ కార్యో న్ముఖులై, నూతనోత్సాహంతో లేచారు.

అంతా వెళ్ళారు. సీతారాం ఆలోచనలో పడిపో యాడు. స్తబ్దుగా కూర్చుని ఉన్నాడు.

'సీతారాంగారూ!' ఒక అరగంటకు ఎవరో పిలిచారు బయట...

ఆలోచనలకు అంతరాయం కల్గడంతో, ఉలిక్కిపడి సీతారాం లేచి బయటకు వెళ్ళాడు.

'నమస్కారమండీ!' అని ఒక ముగ్ధమోహనాంగి గౌరవాభివాదం పల్కింది.

'ఓహో! శారదగారా! రండి! నమస్కారమండి! కూర్చోండి. ఇలావచ్చారు?'

శారద కుర్చీలో కూర్చుంటూ అన్నది: 'సీతారాం గారూ! చూశారుగా ప్రొద్దున జరిగిన భీభత్సకాండ?'

'అవును శారదగారూ చూశాను!'

'నేను మిమ్మల్ని గురించి చాలా విన్నాను. ముఖస్తుతి కాదుగాని, మీరు మంచి తెలివితేటలుగలవారనీ, కాలేజీలో, మీరు అగ్రశ్రేణిలో వుంటారని; విద్యార్థులందరికీ మీరంటే అమితమైన గౌరవం.'

శారద బి.ఏ. జూనియర్ చదువుతున్నది. ఆ ప్రాంతం డిప్యూటి కలెక్టరుగారి మేనకోడలు. శారద అభిప్రాయమేమిటో సీతారాంకు అర్థంకాలేదు. కాలేజీలో చూడడం మినహా వారిద్దరకు వేరే పరిచయంలేదు. అటువంటిది తన రూంకు ఎందుకువచ్చినట్లు. ఏమైనా కూపీలాగడానికి వచ్చిందా ఏమిటి డిప్యూటీకలెక్టరుగారి తరఫున. అనుకొన్నాడు సీతారాం.

'మీ సదభిప్రాయానికి కృతజ్ఞుణ్ణి. జూనియర్సులో ప్రముఖస్థానంలో ఉన్నారని మీగురించి విన్నాను.'

'దానికేంగానియండి. అసలుసంగతికివద్దాం. ప్రొద్దున జరిగిన అత్యాచారానికి నిరసనగా యీ సాయంత్రం ఏదో బహిరంగసభ మనవాళ్ళు జరుపనున్నట్లుగా తెలుస్తున్నది. మీ అభిప్రాయం?'

'అవును నేనూ విన్నాను. ఇక నా అభిప్రాయాని కేమిటి లెండి...'

'మీ రేమీ అనుమానించవద్దు; నేను డిప్యూటీ కలెక్టరుగారి బంధువునని మీమీద సిఐడిగా రాలే దండీ!'

'శారదగారూ, మీతో ముఖపరిచయంతప్ప నాకు ఎన్నడూ ఇంత దగ్గరగా మాట్లాడుకొనే అవకాశం కలుగ లేదు. ఈరోజు సుదినం. ఇంతకుముందే మిత్రులు కొందరు నా దగ్గరకు వచ్చారు. యీ విషయమై చర్చ జరిగింది. వాళ్లు సభ జరపటానికే నిశ్చయించుకొన్నారు. యిక యీ ఉద్యమాన్ని గురించి నా అభిప్రాయాలు నాకున్నాయ్. సభలో మాట్లాడుదామని ఈ నోట్సు వ్రాసుకొన్నాను. ఏంచేద్దాం, మాట్లాడాలని ఒకటే బలవంతంచేశారు. ఇదుగో ఈ నోట్సుచూస్తే నా అభిప్రాయాలేమిటో మీకు తెలు స్తుంది!'

శారద నోట్సు తీసికొని కాసేపు పేజీలు తిరగవేసి చూస్తుంది. "సీతారాంగారూ! మీ విజ్ఞతకు నా ధన్యవా దాలు. ఒకవేళ సభజరిగినా మీరు ఉపన్యసిస్తే, యీ నోట్సుతో మీకు అవసరంలేకుండానే మాట్లాడగల రను కొంటాను. ఈ నోట్సు ప్రస్తుతపరిస్థితులమీద వ్రాసిన

థీసిస్. ఇది నాదగ్గర వుండనీయండి. మరోకసారి స్టడీచేసి మీ కందిస్తాను.'

'అట్లాగే లెండి. ఏదో నాకు తోచింది వ్రాశాను. నా అభిప్రాయాలు తప్పుకావచ్చు.'

'ఇక వెళ్తానండి. నమస్కారం. నేనొచ్చినట్లు ఎవరికీ తెలుపకండి. శలవ్' అని చేతులు జోడించి నమస్కారం చేసి నిష్క్రమించింది. ప్రతినమస్కారంచేసి గుమ్మందాకా వెళ్ళి సాగనంపాడు.

సీతారాం స్తబ్దుడౌతాడు. అనుకొన్నాడు 'ఎంత తెలివిగలది యీ పిల్ల!' అని.

"సాయంత్రం నాలుగుగంటలకు ఊరేగింపు అనంతరం కాలేజీ ఆవరణలో బహిరంగసభ. యీ ఉదయం జరిగిన కాల్పులకు ప్రజలూ, విద్యార్థులూ విరివిగా పాల్గొని నిరసనను తెలుపగోరుచున్నాం" "ఇట్లు విద్యార్థి సంఘం"

అని అన్నిగోడలమీద ఎర్రసిరాతో పోస్టర్లతికించారు. ప్రజల్లో ఇంకా ఉద్రేకాలొచ్చినై.

యీ విషఫలితాన్నెలాగైనా అరికట్టాలి అనుకొంటూ డ్రెస్సువేసుకొని బయటకు వెళ్ళడానికి తయారౌతున్నాడు సీతారాం. తలుపుకొట్టిన చప్పుడవటంతో వెళ్ళి తలుపుతీశాడు.

ఎదురుగా పోలీసు జవాన్. వెనుక మరి నలుగురు పోలీసులు, సబ్ ఇన్స్పెక్టరు ప్రత్యక్షం. సీతారాం కలవరపడ్డాడు.

'మీ రేనా సీతారాం ?' అడిగాడు ఇన్స్పెక్టరు.

'అవునండీ!' కలవరాన్ని అణచుకొంటూ అన్నాడు సీతారాం.

'ఏయ్ వన్ త్రీ ఫోర్. ఈయన్ను వేన్‌లో ఎక్కించండి. చేతులకు బేడీలు వెయ్యండి!'

'ఇన్స్పెక్టర్‌గారూ. నేను చెప్పేది వింటారా?' ప్రాథేయపూర్వకంగా అడిగాడు.

'మేమేమీ వినదల్చుకోలా ప్రస్తుతం...పోలీస్!... ఊ! త్వరగా కానీయండి'

'నేను పారిపోను, బేడీలతో అవసరంలేదు, పదండి వస్తున్నా'

సీతారాంతో వ్యాన్ వెళ్ళిపోయింది. గోపీని, జయరాజును, రాంగోపాలును, సత్యమూర్తి; ఇంకా కొంత మంది విద్యార్థులందర్నీ అరెస్టు చేశారు. 144 వ శెక్షన్ ప్రవేశపెట్టారు.

ఆ రోజు ఏర్పాటుచేయబడిన సభ జరగలేదు...

* * *

మర్నాడు అందర్నీ కోర్టులో హాజరు పర్చారు. "వేరే విచారణ ఏమీ వుండదు. పోలీసు ఛార్జిషీట్ ప్రవేశపెట్టడం, మేజస్ట్రేట్ శిక్ష వెయ్యడం; తలా ఒక సంవత్సరం శిక్ష పడుతుందేమో" ననుకొంటున్నారందరూ.

ఒకొ్కక్కళ్ళనే కోర్టులో హాజరుపరిచారు పోలీసులు. అనుకొన్నట్లే ఏమీ విచారణ జరగలేదు. తలా ఒక ఆరు నెలలు విడిశైదు పడ్డది. సీతారాంనుకూడా హాజరు పరి

చాడు. ఛార్జిషీట్ ఏమీలేదు. సీతారాం వ్రాసిన ప్రస్తుత పరిస్థితులపై థీసిస్‌గల నోట్సును కోర్టులో దాఖలు చేస్తూ, ఆ నోట్సు అతను ఉద్యమానికి వ్యతిరేకుడని తెలుపుతున్నదనీ, ఏమీ అల్లర్లు జరుగకుండా చూచుటకు నిర్ణయించుకొన్నట్లు తెలుపుతున్నదని, కనుక అతనిమీద కేసును పెట్టడంలేదనీ చెప్పాడు సబ్‌యిన్స్‌పెక్టర్. సీతారాంను విడుదలకు ఉత్తర్వు జారీచేశాడు మేజస్ట్రేట్.

సీతారాంకు ఇదంతా ఆశ్చర్యంగా ఉంది. తను శారదకిచ్చిన నోట్సు, పోలీసుల కెలా చిక్కింది. ఒకవేళ చిక్కినా తనమీద కేసును ఉపసంహరించుకునేంత న్యాయం గాని, అభిమానంగాని, ప్రత్యేకతగాని, యీ పోలీసులకు తనమీద ఎందుకు కలిగింది. దీనికంతకు శారదే కారణం. శారదను కనుక్కోవాలి, అసలు సంగతేమిటో. సితారాం శారద యింటికి వెళ్ళుదామనుకొన్నాడు.

కాని సీతారాం శారద యింటికి వెళ్ళలా. ఏం బాగుంటుంది. పైగా డిప్యూటీ కలెక్టరుగారిల్లు. గేటులో జవానులు. లోపలకు కబురు చేయాలి. శారదకోసం వచ్చానంటే ఎవరేమనుకొంటారో. బహుశః శారదకు ఇట్లా పోలీసులు వస్తారని, అరెస్టులు జరుగుతయ్యని, అందరిని అరెస్టు చేయటానికి నిశ్చయించుకొన్నారని తెలిసే నా దగ్గర కొచ్చిఉంటుంది. మెల్లిగా నన్ను మెచ్చుకొన్నట్లు నటిస్తూ నోట్సు పుచ్చుకొని వెళ్ళింది. అది తన మేనమామకిచ్చి దానిద్వారా నా విముక్తి సాధించి ఉంటుంది. అబ్బ! ఎంత చురుకైన పిల్ల శారద! ఎందు

కంత అభిమానం నామీద కలిగిందో? ఏమయినా ఇది మంచికే జరిగింది. ఇంకా నాలుగు నెలల్లో పరీక్షలున్నాయ్. ఇంటివద్ద ముసలి తల్లిదండ్రులు ఎన్నో కష్టాల్లో ఉండి తనను చదివిస్తుంటే, తనకు ఈ రాజకీయాలు దేనికి. ఏ సంవత్సరమో జైలుశిక్ష పడితే, తన కుటుంబ పరిస్థితులు ఏం కాను? యిదంతా ఒక విధంగా తన మంచికే జరిగింది. శారద కనుపిస్తే, కృతజ్ఞతలు. తెలుపుకోవాలి. అనుకొంటూ తన రూంకు వెళ్ళాడు.

అనుకొంటూ రూంలో అడుగుపెట్టాంటే ఆ యింటాయన వెంకట్రామయ్యగారు పిల్చాడు. 'ఏం సీతారాం! నేనూ కోర్టు కొచ్చాలే. నీ అదృష్టం బాగుండి విముక్తులైనావు. ముఖ్యంగా మీ నాన్నగారి అదృష్టం బాగుంది. ఇదిగో టెలిగ్రాం. మీ నాన్నకు సీరియస్‌గా ఉందిట!' అంటూ టెలిగ్రాం అందించాడు. సీతారాం ఒక్కసారి విషణ్ణుడై స్థంభించిపోయాడు. "వెళ్ళవోయ్ 2 గంటలకు బండికూడా ఉన్నది. గాబరాపడకు. ఆరోగ్యం చేకూర్తుంది."

సీతారాం గబగబా రూంలో పడ్డాడు. ఆలోచనలన్నీ తండ్రి అనారోగ్యం గూర్చే...ఎలావుందో...ఎంతటి ప్రమాదస్థితిలో వుంటేనోగాని టెలిగ్రాం యివ్వరు. యింతలో ఆలోచనలు శారదపైకి మళ్ళాయి. 'శారదకు కృతజ్ఞతలు తెలుపుకోలేదే! అయినా తన కసలు, తెలియకుండా ఎంతపని చేసింది. తనను విడుదలచేసినట్లు తన నోట్సు ఆధారంగా తనమీద కేసుపోయినట్లు తన స్నేహితులకు తెలిస్తే, వాళ్లు తననుగురించి ఏమనుకుంటారు. తమను

ఇందులో ఇరికించి, తను, మెల్లిగా తప్పుకొన్నాడని అను
కోరూ? వాళ్ళ ఎదుట తను ఎంత అవమానం పొందాల్సి
ఉంటుందో? ఇంతవరకు తనయందు ఎంతో గౌరవభావాలు
ప్రదర్శిస్తున్న వాళ్లు తనపై ఎంత దురభిప్రాయం ఏర్పాటుచు
కుంటారో!

అయినా యీ ఉద్యమాన్ని గురించి తన అభిప్రా
యాలు వాళ్ళతో చర్చించాడు.

దేశ స్వాతంత్ర్య పోరాటానికి తను ముందు నిలవ
డానికి సిద్ధమే. కాని సరియైన నాయకత్వం లేకుండా,
ప్రజలే తమకు తోచినట్లు తోచిన పనులు చేయటం, ఇది
అదనుగా తీసికొని దుండగాలకు దిగడం, యీ అరాచక
చర్యలకు తను విముఖుడనని వాళ్ళతో చెప్పాడు. ఇలా
తాత్కాలికోద్రేకంలో పడిపోయే దానికంటె సాఫీగా
ఆలోచించుకోవడం మంచిదికాదని ఎవరంటారు. సరే
అయిందేదో అయింది. ఏంజరుగుతుందో చూద్దాం అను
కొన్నాడు సీతారాం.

రైలు వేళయింది. తండ్రికి ఎలావుందో ఏమో!
వెళ్ళాలి. కాలేజీకూడా మూసేశారు. వెళ్ళి తండ్రికి సేవ
చేయాలి. శారదను తిరిగి వచ్చి కలుసుకొందాంలే. అను
కొంటూ స్వగ్రామం బయలుదేరాడు.

* * *

యిల్లు చేరుకొనేటప్పటికి సాయంత్రం 5 అయింది.
తండ్రికి చాలాప్రమాదంగానేవుంది. ఆ రోజు అమావాస్య.
ఆ రెండురోజులు గడిస్తేగాని చెప్పలేమనుకొంటున్నారు.

స్పృహ కొంచెం వుంది యింకా. వెళ్ళి 'నాన్నా' అని పిల్చాడు సీతారాం.

బుచ్చిరామయ్యగారి కళావిహీనమైన ముఖంలో కొంత వెలుగు కన్పించింది. చాలా మందస్వరంలో... 'నాయనా వచ్చావా ! నీ చేతులమీదగా పోయేభాగ్యం నాకుందో లేదో అనుకొంటున్నా ?. ఇంకేం ! ఇక నిర్వి చారంగా కన్ను మూస్తా. నీవేదో గొప్ప వుద్యోగం చేస్తుంటే చూసి సంతోషించాలనుకొన్నా నాయనా. కాని ఆ అదృష్టం నాకు లేదు. తండ్రిగా చివరివాక్యాలు కొన్ని చెప్తున్నాను. నీ మనసుకు సరియైనదని నీ అంత రాత్మ సాక్షిగా నమ్మినదాన్ని ఆచరించడానికి వెనుకాడకు. తాత్కాలికోద్రేకాలకు లోనుగాకు. ఈ సలహాకు మించి నీ కిచ్చే ఆస్తి నాకేంలేదు బాబూ! వెళ్ళి అమ్మనుఊరడించు.'

'నాన్నా !' అంటూ బావురుమన్నాడు సీతారాం. ఆనుగంటలకు తన అక్కలిద్దరూ, బావమరదులూ వచ్చారు.

బుచ్చిరామయ్యగారి పరిస్థితి మరీ విషమించగా, ఆ రాత్రంతా కనిపెట్టుకు కూర్చున్నారు అందరూ. తెల్ల వారుతుందనగా ఈ లోకాన్ని విడిచి శాశ్వతంగా నిష్క్ర మించారు బుచ్చిరామయ్యగారు.

యిన్నాళ్ళు ప్రేమల్లేక దూరంగా ఉండిపోయిన సీతారాం మేనమామ సుందర్రామయ్య, సీతమ్మ కూడా వచ్చి నాలుగు ఊరడింపు వాక్యాలు పలికారు. తరువాత తమపని పూర్తయినట్లు వెళ్ళిపోయారు.

♦ ♦ ♦

జరుపవలసిన కర్మకాండలు అన్నీ సక్రమంగా జరిపాడు సీతారాం.

ఆ రోజు అంతా విచారంతో ఉన్నారు. అన్నం సహించలే దెవ్వరికి. అలాగే కేతికి ఒకచోట చేరారంతా. బుచ్చిరామయ్యగారి పెద్దకూతురు సుందరమ్మ, రెండో కూతురు సీత, బావలు అంతా కూర్చున్నారు. తల్లిని తనతో బాటు తీసుకుపోతానని సుందరమ్మ అన్నది.

'ఏమమ్మా ఏమంటావ్!'

'నే నెక్కడకు రానమ్మా'

'అవునండి ఏంచేస్తాం పెద్దవారు అందరూ ఉండగా ఎక్కువ బాధ లేకుండా కొడుకు చేతుల్లో పోయారు మామయ్య. సీతారాంకూడా మళ్ళీ కాలేజీకి పోవాలి. ఈ నాలుగు నెలలూ ఎలాగో వెళ్ళదీస్తే వా డెక్కడో వుద్యోగం చేస్తాడు. అందాకా మీ రొక్కరూ ఇక్కడే ఎలా ఉంటారు చెప్పండీ! మాతో రండి' అన్నాడు పెద్దల్లుడు రాంబాబు.

'మీకు తెలీదు నాయనా చిన్నవాళ్లు! నే నెక్కడికి ఇప్పుడు ;రాకూడదు. పుట్టింటివాళ్లు గడప త్రొక్కందే ఎక్కడికీ రాకూడదు నేను.'

'ఆ! పుట్టింటివాళ్ళు!నీకింకా ఆ ఆశ పోలా అమ్మా! రేపు లోకం కోడై కూస్తుందని మొహంచూపించి మొక్కు దీర్చుకుపోయారులే ఏదో—వారివద్దకు నీవేమీ పోనవసరంలా. నీకెక్కడికి వెళ్ళటానికి మనస్సుసరి లేకుండా ఉంటే,

చిన్నక్క కొడుకు యిక్కడే ఉంటాడులే నీకు తోడుగా!' అన్నాడు సీతారాం కోపం వచ్చి.

'సరే నీ యిష్టం నాయనా!' అన్నది ఎలాగో దుఃఖాన్ని అణచుకొంటూ ఆమె...

మర్నాడు కూతుళ్ళు వాళ్ళవాళ్ళ యిళ్ళకు వెళ్ళి పోయారు.

'అమ్మా! నేను రేపు పూరికి వెళ్ళొస్తా. కాలేజీలు ఎప్పుడు తెరుస్తారోఏమో. నెలరోజులు కావస్తుంది, కనుక్కోవాలి!' సీతారాం యిక తను ఉండి చేయాల్సిన కార్యమేమీ లేదుకదా అని ... గుంటూరు వెళ్ళిపోదలచుకున్నాడు.

'సరే వెళ్ళు నాయనా నాకేం ఫరవా లేదులే. ఉన్నాడుగా తోడుగా నా మనుమడు!'

మర్నాడు పట్నానికి తిరిగి వచ్చాడు సీతారాం.

— — —

లెక్చరర్ శర్మగారికి సీతారాం అంటే ఎంతో అభిమానం. ఇతని తెలివితేటలకూ, సద్గుణాలకు ఆయన చాల మెచ్చుకొనేవాడు. ఆయనను కనుక్కుంటే కాలేజీ విశేషాలు తెలుస్తయ్యని వెళ్ళాడు సీతారాం వారింటికి. లోగడకూడా వారివద్దకు అప్పుడప్పుడూ వెళ్తూవుండేవాడు కూడా, ఇంట్లో బాగా చనువుకూడ ఏర్పడింది.

'శర్మగారూ!' పిల్చాడు సీతారాం.

'ఏవరండీ!' అంటూ తలుపుతీసింది శర్మగారి కూతురు సరళ. ఆ అమ్మాయికి 9 ఏళ్లుంటయ్.

'నాన్నగా రున్నారా సరళ!'

'ఓ, సీతారాంమామయ్యా, ఆ! నాన్నగారు శారదక్కకి పాఠం చెప్తున్నారు ఆ గదిలో !'

సీతారాం తటపటాయించాడు. శారదను ఇక్కడే కలుసుకోడమా లేదా అని. ఇంతలోనే శర్మగారే వచ్చారు.
'ఎప్పుడొచ్చావోయ్ సీతారాం! ఏం, భయపడి పారిపోయావ్ వెళ్లేవుండే పోలీసుల హడావుడికి ?' అన్నారాయన నవ్వుతూ.

తిరిగి ఆయనే అన్నారు సీతారాం జవాబిచ్చే లోగానే 'అయితే మీ ఫాదర్ కెలావుంది సీతారాం?'

సీతారాం ఆశ్చర్యపోయినాడు ఒక్కక్షణం. ఫాదర్ సంగతి ఈయనకెలా తెలిసిందా అని. అంతలోనే తేరుకొని అన్నాడు విచారగ్రస్తుడై, "మా నాన్నగారు కాలం చేశారండీ, ఆయనకు సీరియస్ అని తెలిసే మీకెవరికీ కలియకుండానే వెళ్ళాల్సి వచ్చింది!'

'అరె! అట్లాగటోయ్ రా లోపలకు. మన శారద లేదూ... తెల్సుగా నీకు. ఆమే చెప్పింది. మీ ఫాదర్‌కు సీరియస్‌గావుందని వెళ్ళినట్లు.'

లోపలకడుగుపెట్టూనే, శారద లేచినిలబడింది.
'నమస్కారమండీ సీతారాంగారూ! పాపం మీ ఫాదర్ ఆఖరుక్షణాల్లో ఆయన ప్రక్కన ఉండగలిగారు!'

'నమస్కారమండి! మీకు కృతజ్ఞత తెలుపకుండానే వెళ్ళినందుకు క్షమించండి శారదగారూ!'

'నాకా! బలేవారే మీరు'.

'అవునండీ. మీకే. మీరు నానుండి తీసుకొన్న

నోట్సు పోలీసులకు అందించినందువల్ల ఒనగూడిన నా విడుదలకు ప్రప్రథమంలో నాకు కొంచెం చిరాకు కలిగించిన మాట వాస్తవమే లెండి. నాకు స్నేహితులలో ఏమి తలవంపులొస్తాయోనని. కాని అదే నాకు మహోపకారానికి కారణమయింది. మా నాన్నగారి అంత్యక్షణాలలో సమీపాన ఉండగలిగినందుకు మీరే కారకులయ్యారు. కనుకనే మీకు కృతజ్ఞత తెలుపుకుంటున్నా.'

శారద కొంచెం చిన్నబుచ్చుకొన్నది. 'నేను చాలా అనాలోచితంగా ఆపని చేశానేమో సీతారాంగారూ!' అన్నది.

'అరే! అప్పుడే కోపం తెచ్చుకొంటే ఎలా చెప్పండి. నన్ను సాంతం మాట్లాడనివ్వండి. మీకు కృతజ్ఞత తెలుపుకోవలసిన కారణాలలో మా నాయనగారి మరణకాలానికి దగ్గర ఉండగలుగుటకు అవకాశం కలగడం ఒక అంశం. రెండవది మనశ్శిక్షిమించిన పనులలో తలదూర్చి వాటిఫలితాలకు తట్టుకోలేనప్పుడు తికమకపడ్తాడు మానవుడు. అటువంటి పరిస్థితిదే. ఒక చక్కని గుణపాఠం నేర్పావు నాకు. ఇక మూడవది మీతో ఇంతకుముందు నాకు యాదృచ్ఛికమైన పరిచయమేగాని, ఈ సంఘటనమూలంగా, నాకు మంచి చురుకైన, ముందుచూపుగల ఒక స్నేహితురాలు దొరికిందని సంతోషపడ్తున్నాను'

శారద మనస్సులోనే ఆ మాటలకు పొంగిపోయిందని, ఆమె హావభావాలే తెలుపుతున్నాయ్.

నమ్రతకొరకు అన్నది నవ్వుతూనే, శారద 'నాకు

అన్ని విశేషణాలు అనవసరం సీతారాంగారూ. అసలు జరిగినసంగతిమీకు తెలిసివుంటే, నన్నంతగా పొగడకపోగా ఇంకా కోపగించుకొంటారేమోకూడా!...అసలు ఈ కృతజ్ఞతలన్నీ మామామయ్యకు, శర్మగారికి చెందాలి.'

'ఓహో! చాలా గూఢుపుఠాని ఉన్నదన్నమాట దీనిలో. మాష్టరుగారూ క్షమించండి. ముందు క్షమాపణ కోరుకొని తర్వాతే తెలుసుకొంటాను, సంగతేమిటో.'

'సరేలేవోయ్ మంచి ఘనకార్యమే చేశావ్. ఆవేళ శారద నీనుండి ఆ కాగితాలే తేకపోతే, మాకు కృతజ్ఞతలు కాదు. తలవంపులే వచ్చేవి నీవల్ల. ఇంతమందిమి నీ ప్రవర్తన తెలిసిఉండి, నిన్ను జైలుకు పంపించామని. అసలు నీ కృతజ్ఞతాసహస్రాలన్నీ శారదకే చెందాలి 'లా' ప్రకారం.'

'మీ మాటలతో నాలో ఇంకా కుతూహలం జాస్త యింది. ఇంతమందికి నామీద ఇంత సానుభూతి, సదభిప్రాయం ఉన్నందుకు. అసలు జరిగిందేమిటో కొంచెం తెలుసుకోవాలనివున్నది;మీకభ్యంతరంలేకపోతేకొంచెం.'

'కుర్రాళ్ళంతా ఏదో నిరసనసభ జరుపుతారని, నీఅభిప్రాయాలేమిటని, అంతకుముందురోజే మనం మాట్లాడుకొన్నాం. నీ సంగతి నాకు తెలుసు. కాని మిగతావాళ్ళను కాదనలేక వాళ్ళతో కలిసిపోకతప్పదు నీవు. మీటింగులో నీ స్వంత అభిప్రాయాలు నీవు చెప్పినప్పటికీని, ప్రభుత్వం చూస్తూ ఊరుకోదు. ఏంచెయ్యాలా అని అనుకొంటూ ఉంటే, శారద చెప్పింది; మీటింగు జరుగనీయరని.

అందర్నీ అరెస్టుచేయటానికి అనుమతి పొందారనీని. బుద్ధి పూర్వకంగా కాకపోయినప్పటికీ, నీవే రొంపిలో ఇరుక్కో వటం తథ్యం అనుకొన్నాం. శారద తనువెళ్ళి పరిస్థితు లేమిటో చూచివస్తానని, నీదగ్గరకొచ్చి, ఆ నోట్సు తీసికొచ్చింది. ఎలాగయినా వాళ్ళ మామయ్యనుకోరి,. నీ పీ ఉద్యమానికి వ్యతి రేకుడవని చెప్పిచూస్తానంది. కానీ తీరా ఇంటికి పోయేటప్పటికి, వాళ్ళ మామయ్యతో చెప్తే, తన ఉద్యోగ వ్యవహారాలలో జోక్యం కల్పించుకొంటున్నదని కోపపడ తాడేమోనని భయం డైరెక్టుగా చెప్పడానికి. అందుకని ఒకనాటకమాడింది. డిప్యూటీ కలెక్టరుగారి అబ్బాయిఒకడు 15 ఏళ్ళవాడుస్కూలు ఫైనలు చదువుతున్నాడు. వాణ్ణిపిలిచి ఉపన్యాస ధోరణిలో నీవ్రాసిన నోట్సును చదవడం మొదలుపెట్టిందట. ఇదంతా డిప్టీకలెక్టరుగారు విని లోపల కొచ్చి 'ఏమిటమ్మా, వుపన్యాసం దంచేస్తున్నావ్. అసలు నీచేత ఒక బహిరంగసభ పెట్టిస్తే బాగుండునే. నీ వుపన్యాసం వింటే, ఎవరూ, ఏ అల్లర్లకూ దిగకపోగా, పోలీసు వాళ్ళపనికూడా తగ్గించినదానివౌతావు. ఏదీ ఆనోట్సు' అని తీసికొన్నాడట. 'అవునుమామయ్యా. దీన్ని మాకాలేజీలో చదివే, సీతారాం అనే అతను వ్రాశాడు. అప్పుడప్పుడూ చెపుతూఉంటానే కాలేజీలో, అతనే ఫస్టు అన్నింట్లో అని. అతను వ్రాశాడు' అన్నదిట శారద.

'అరె! అతనికూడా అరెస్టువారంటున్నదే' అన్నారట ఆయన.

'అలాగా పాపం. ఇటువంటివాటికి అన్నింటికీ వ్యతి కుడే' అన్నదిట.

'సరేలే. నేను చూసాను; ఆనోట్సు యివ్వు' అని పుచ్చుకున్నాట్ట...తర్వాత నీకు తెలిసేఉంటుంది నీవిడుదల. ఈ విధంగా సాధించింది నీవిడుదల శారదమ్మ—

కాబట్టి నీ తరఫున అందరితరఫునకూడా నేనే కృతజ్ఞత తెలిపాను ఇదివరకే!' అన్నాడు శర్మగారు.

శారద ముసిముసి నవ్వులతో నుంచొనివున్నది. సీతారాం వదనం కృతజ్ఞతాభారంతో కృంగిపోయింది. 'మీఅందరినీ ఇంతశ్రమ పెట్టినందులకుక్షమించండి' అన్నాడు సీతారాం.

"చాల్లేవోయ్ ఈ క్షమార్పణలు. ఇక కట్టి పెట్టుదూ!"

"మీకు నాగురువులు. నామీద వాత్సల్యం ఉండడం సహజం. ఇక శారదగారికి నామీదకలిగిన ఈ అవ్యాజానుకంపానికి, నా అభినందనాలు; తప్పక చెప్పుకోవటం నాబాధ్యతండీ!"

శారద ఆ క్షణంలో చూసినచూపులలో, ఆ భావ ప్రకటనలో అనేక కావ్యాలు చదువగలిగాడు సీతారాం.

శర్మగారు వీరిద్దరినీచూచి చిరునవ్వునవ్వుకొన్నారు.

"ఏమోయ్ సీతారాం! శారదకు ట్యూషన్ కావాలిట. వాళ్ళ మామయ్యగారుకూడ మొన్న క్లబ్బులో కనిపించి చెప్పారు. నాకేమీ తీరికలేకుండా ఉన్నది

బొత్తిగా. కాస్త ఈ రెండు నెల్లూ, నీవు శ్రమపడుదూ! నేను వాళ్ళ మామయ్యగారికి చెప్తాను!"

సీతారాం ఉక్కిరి బిక్కిరయ్యాడు. ట్యూషన్ చెప్పాలంటే అతను రోజూ డిప్టీకలెక్టరుగారి ఇంటికిపోవాలి. వాళ్ళ అంతస్థు గొప్పది. గొప్పవాళ్ళతో సహవాసం ఏమి ప్రమాదాలకు దారితీస్తుందోనని.

అయినా తనకింత సహాయం చేసినవాళ్ళకు తానీ మాత్రం చేయలేడా? అసలు ఇంతకూ తన ఆర్థిక పరిస్థితుల్లో చదువేం సాగుతుందో.

"ఏం అనుమానిస్తున్నావ్ సీతారాం" అన్నాడు శర్మగారు.

"వేరే అనుమానాలేం లేవండి; మాష్టారూ! అసలు నాచదువే సాగుతుందా లేదా అనుకొంటున్నాను"

తన ఆర్థికపరిస్థితులు శర్మగారికి తెలుసు. తనకు స్కాలర్‌షిప్ రావడానికి, తన తెలివితేటలు కారణ మయినా, శర్మగారి కృషికూడా తోడుకాకుంటే అంత సులభంగా జరిగేదికాదు. కాని తన ఆర్థికస్థితిని గురించి శారదముందు సూటిగా చెప్పటానికి సీతారాం కొంచెం వెనకాడాడు.

"అదేం పీలుకాదోయ్. ఆ సంగతులన్నీ నాకు వదిలేయ్, ఈ నాలుగు నెలలూ నీవు మా యింట్లోనేవుండు. ప్రస్తుతం మా యింట్లోకూడ ఎవరూలేరుగా. మీ అక్క గారువచ్చేదాకా మనమిద్దరం వండుకుతిందాం. నే నీ రోజే

డిప్టీకలెక్టరుగారికి చెప్పుతాను; రేపటినుండి నీవు శారదకు ట్యూషన్ చెప్పటానికి వస్తావని."

"ఏం శారదా, మీా మామయ్యకు ఇన్ట్రొడ్యూస్ చెయ్ సీతారాంని రేపు"

సీతారాంకు ఇక ఏమన్నా మాట్లాడేందుకు తనకు ఆయనమీాదవుండే గౌరవభావం అడ్డొచ్చింది. "సరేలెండి. వస్తానండి నమస్కారం...నమస్కారం శారదగారూ!"

"నమస్కారమండీ! రేపుతప్పక సాయంత్రం 5 గంట లకు రావాలి మా యింటికి" అన్నది శారద.

"సరే" నంటూ బయటకు వెళ్ళాడు సీతారాం. శారదకూడా శర్మగారివద్ద శలవుతీసకొని ఇంటికి వెళ్లి పోయింది కాసేపుతరువాత.

♦ ♦ ♦

ఆరోజు సాయంత్రం అయిదుగంటలకు డిప్యూటీ కలెక్టరు రమణారావుగారు క్లబ్బుకుపోవటానికి తయారవు తున్నాడు - ఇంతలోనే లెక్చరర్ శర్మగారు వచ్చారు— అభివందనలైన తరువాత శారదట్యూషన్ విషయమై ప్రస్తావన తెచ్చాడు. సీతారాం విషయం ఆయనకు చెప్పాడు శర్మగారు. "ఎవరండీ ఆ అబ్బాయి, నేనూ చాలా సార్లు విన్నాను. మా శారదద్వారానే కాకుండా బయట కూడ, అంతమంచి వున్నతికి రాగలిగిన గుణాలున్నయ్యని. అతన్ని చూడాలని నాకూ కుతూహలంగానే ఉన్నది. అతను ఆ రోజు విడుదలయినతరువాత ఇటువస్తాడేమోననుకొన్నాను కానీ, రాలేదు"

"వాళ్ళ నాన్నగారు సీరియస్‌గా ఉన్నారని టెలి గ్రాంవస్తే వెంటనే బయలుదేరి వెళ్లాడట. పాపం వాళ్ళ ఫాదర్ పోయినారట. తిరిగిరాగానే నా దగ్గర కొచ్చాడు. చాలా గౌరవంగల కుటుంబంలో పుట్టినవాడల్లేఉంది. ఎంతో అభిమానం వయసుకు మించిన తెలివితేటలు. అయితేనేం పైకి రావటానికి ఆర్థిక అవకాశం తక్కువ"

"సరే - రేపు రమ్మనండి. 5 గంటలకు నేను ఇంటి దగ్గరే ఉంటా...ఆ సమయంలో."

శారదకు సంతోషంగానే ఉన్నది. సీతారాం ట్యూషన్ అంటే మామయ్య అభ్యంతరం చెప్తాడేమోనని భయపడ్డది కాని ఆయన ఉత్సాహం కనబర్చాడు.

*　　　　*　　　　*

సాయంత్రం నాలుగయింది. సీతారాం తనరూంలో కూర్చుని ఉన్నాడు. 5 గంటలకు శారద యింటికి వెళ్లాలి. అతని అభిమానం అడ్డొచ్చింది. గొప్పవాళ్ళతో పని. తను బీదవాడు. గొప్పవాళ్ళకు బీదలంటే చిన్నచూపు-వాళ్ళకు గౌరవమల్లా ధనంతోనే. సత్ప్రవర్తన, విజ్ఞానము గొప్ప తనం అన్నీ డబ్బుతోనే కొనుక్కుంటారు...సీతారాం తండ్రి కూడ ఈ ధోరణిలోనే మాట్లాడేవాడు.

ఇంతలోకే కారుహారన్ వినిపించింది ఇంటిబయట. తలుపు తీశాడు. "ఊ! ఇంకా కూర్చునేఉన్నారేమిటు. వస్తారని మామయ్యగారుకూడా ఇంటిదగ్గరే ఉన్నారు. మీరు రాకపోయేటప్పటికి నేనే జీపు తీసుకువచ్చా. రండివెళ్దాం." ధీమాగా నవ్వుకుంటూ శారద వచ్చింది.

ఇక తప్పలా సీతారాంకు. కాదంటే శారదను, ఇంకా శర్మ గారిని, అవమానించినట్లవుతుంది. వెంటనే బయలు దేరాడు సీతారాం. జీపులో వెనుక ఒకళ్ళు ప్రక్కన ఒకళ్ళు కూర్చున్నారు. శారద దారి పొడుగునా ఏదో చెప్తూనే ఉంది. కాని సీతారాం చెవులకు అవేమీ వినపడడం లేదు. యాదృచ్ఛికంగా జవాబు చెప్తున్నాడన్నమాటే గాని, అతని మనస్సంతా తన చిన్నతనం, తను పెరిగిన బీద రికపు వాతావరణం, తనకుటుంబ వ్యవహారాలు, తండ్రి మరణానంతరం, అతని భవిష్యత్తేమి కానున్నదో అనీ— ఇప్పుడే పెద్దవాళ్ళతో పరిచయం దేనికి దారితీస్తుందోనని. ఏమేమో ఆలోచనల్లో మునిగిపోతున్నాడు.

ఇంతలో వారి బంగళాముందు జీపు ఆగింది. ఇద్దరూ గేటుదాటి లోపల అడుగుపెట్టాండగానే, రమణారావు గారు గదిలోనుండి, బయటకు వచ్చారు—

"నమస్కారమండి"

"రండి - మీరు వస్తారనే చూస్తున్నాము. ఇంకా రాలేదని మా శారదే బయలుదేరి వచ్చింది.

"నేను చిన్నవాడినండి. 'మీరు'అని సంబోధించడం నాకు బావుండలా."

"అవును బాబూ! నీ పేరు సీతారాంకాదూ. శర్మ గారు నీగురించి అన్నీ చెప్పారులే. ఇవాల్టినుండి నీకు, ఇచ్చటికి రావటానికి ఏమీ అభ్యంతరం లేదు. వచ్చి, మా శారద, నీవు చదువుకోండి. దానికి తెలియని విషయాలు,

నీవే చెప్పాలి. నీతోపాటు శారదనుకూడా ఫస్టున ప్యాసు చేయించాలి." అన్నారాయన.

ఇంతలో శారదతోపాటు వంటమనిషి వెంకన్న, కాఫీ ట్రేతో వచ్చాడు. శారద కప్పులందించింది. మెల్లిగా సిప్ చేస్తున్నారు.

"శారదా! సీతారాం ఇకనుంచి యిక్కడేవుంటాడు. నీకు తెలియనివిషయాలు అన్నీ అడిగితెలుసుకో. ఏం ? ! సీతారాం — నీ కిక్కడఉంటానికి ఏమీ అభ్యంతరం లేదుగా !"

"క్షమించండి. యీ నాలుగు నెలలూ శర్మగారింట్లో ఉంటానన్నాను. రోజూ సాయంత్రమో ప్రొద్దునో వచ్చి తెలియనివి చెప్తూంటాలేండి శారదకు"

అంతవరకూ కుతూహలంతో కన్నార్పకుండా తన వంకే చూస్తున్న శారద, ఈ జవాబు విని, మొఖం క్రిందకు దింపింది.

"సరే నీ యిష్టం సీతారాం, మీ స్టడీ రూంలో కూర్చుని చదువుకోండి. నేను క్లబ్బుకు పోతా!" అంటూ రమణారావుగారు కాఫీ ముగించి వెళ్ళిపోయారు.

"ఏమండీ సీతారాంగారూ, మా యింట్లోనేవుంటే మీకూ నాకూ చాలా వసులుబాటుగా ఉంటుందను కొంటాను!" అన్నది శారద.

"శర్మగారు వాత్సల్యంతో పిలిచినప్పుడు అంగీక రించితినాయె. ఇప్పుడు మళ్ళీ ప్రోగ్రాం మారిస్తే వారే

మయినా అనుకోరూ? అయినా రెండు నెలల్లో వాళ్ళఫ్యామిలీ వస్తుందాయె! తర్వాత చూద్దాం పరిస్థితి.”

శారద కొంత నిరుత్సాహపడింది. కొంచెంతడవు పిచ్చాపాటీ మాట్లాడుకొని, వెళ్ళోస్తానని లేచాడు సీతారాం.

“రేపు సాయంత్రం నాలుగుగంటలకు వస్తారు కదూ!”

“ఓక్!...ష్యూర్...”అంటూ వెళ్ళాడు సీతారాం. శారద ఒక్కనిట్టూర్పు విడిచి మేడపైకి వెళ్ళింది. సీతారాం కనుచూపుమేర దాటేవరకు కిటికీలోంచి చూస్తూనేఉంది... ఏదో కొత్త అనుభూతి పొందుతూ.

* * *

ఇంకా కాలేజీ తెరవలేదు. ప్రతిరోజు సాయంత్రం 4 గంటలకు శారదయింటికి రావటం సీతారాం దైనందిన కార్యక్రమంలో ఒక భాగమైంది. సాయంత్రం టిఫిన్, కాఫీ శారదే తెచ్చి యిచ్చేది. మొదట బెట్టుచేసినా - శారద చనువుగా బలవంతం చేయగా తప్పిందికాదు సీతారాంకు, లోపల బెరుకుగా ఉన్నా!

ఒకరోజున సాయంత్రం పాఠం పూర్తి అయినతరువాత “ఫస్టు షో సినిమాకు వెళ్దాం సీతారాంగారూ”అన్నది శారద...

“సినిమాకు తరచుగా పోనండి నేను”

“నేనూ తరచుగా మిమ్మల్ని రమ్మనలేదే...ఇవాళనే వెళ్దాం అన్నాను!”అంది శారద గోముగా.

"ఆ, ఏం సినిమాలో లెండి. ఎందుకొచ్చింది. దేశాని కేమన్నా ఉపయోగించేవా పెట్టేవా? మనుష్యులను ఏమైనా ఒకడుగు ముందుకు నైతికంగా తీసుకుపోయేవా. ఏదో రెండు డ్యాన్సులు, రెండు పాటలు, ప్రేమకలాపం! —నాకు అంతఇష్టం లేదండీ!"

"ఓహో సరే అయితే, ప్రేమఅంటే అది ఏమయినా అపరాధమా అండి. నాకు తెలీక అడుగుతాను. అయినా ఎందుకులెండి. నాకు మీతో వాదించటమంటేనే భయం. మీతో వాదనలో ఎవ్వరూ నెగ్గలేరు!"

"దీంట్లో వాదన ఏముంది. ప్రేమ చాల పవిత్రమైంది శారదా! అది దైవాంశ. నిజంగా ప్రేమించటానికి ఎంతో ఆత్మత్యాగం అవుసరం అని నా అభిప్రాయం"

ఇంతలో వంటమనిషి. వెంకన్న కాఫీతో తయారయినాడు.

"రాంబాబుగారూ! ఇవ్వాళ మీకు స్పెషల్‌గా చేసి తీసికొచ్చానండి కాఫీ."

"మంచిది వెంకన్నా! నాకు స్పెషల్‌గా, నా కోసం తీసికొచ్చినదేదీ నచ్చదే ఎట్లా!"

"ఏమో బాబు. మీ మాటలు వింటుంటే నాకు మా ముచ్చటేసుద్దండి. మిమ్మును చూచినకాడ్నించీ, నాకు నా కొడుకే జ్ఞాపక మొత్తాడు. పోయాడండి నారాత ఇట్లాగేసి"

"అట్లాగా వెంకన్నా! పాపం పెద్దతనంలో నీకు కష్టకాలం..."

"ఏం సీతారాంగారూ, ఇంతకీ నా కోరిక ఏం చేస్తారో? ఇవాళ మంచి సినిమాటండి!"

"నా మనస్సుకు ఇష్టంలేనిపని మరొకళ్ళ బలవంతం మీద చేయవద్దని...నా అభిప్రాయం. మీరు వెళ్ళిరండి"

"అయితే మీ ప్రిన్సిపుల్స్ ఇతరులమీద రుద్దడం ఏం భావ్యం సీతారాంగారూ. అయితే ఇతరుల మనస్సు నొప్పించడమే ప్రిన్సిపుల్‌గా పెట్టుకోమని చెప్పారా మీ నాన్నగారు."

"నా అభిప్రాయాలు ఇతరులమీద రుద్దనుకదా... నేను; మీరు సినిమాకు వెళ్ళడంలో, వెళ్ళకపోవడంలో మీకు సంపూర్ణమైన స్వేచ్ఛవుంది."

"అబ్బ! సరదాకు సినిమాకు పోయొద్దామంటే ఏం పట్టుదలండి. మీకు నాతో సినిమాకు రావడం ఇష్టంలేదనుకొంటాలెండి." చిన్నబుచ్చుకొన్నది శారద.

"శారదమ్మగారూ! నేను ఒక సంగతి అడుగుతా చెప్పండి."

"మీరు ముందు ఒకమాట ఉపసంహరించుకోవాలి. నన్ను 'గారూ' అనకండి. 'శారదా' అనండి చాలు"

"గారు అనేది గౌరవవాచకం."

"అట్లా పిలిపించుకోవటం నా ప్రిన్సిపుల్‌కు పూర్తిగా విరుద్ధం"

"ఓహో! ఎదురుదెబ్బ కొట్టారే నన్ను. అయితే నన్నూ సీతారాంగారూ అననవసరం లేదు"

"పెద్దవాళ్ళను అలా పిలిచి గౌరవించకపోతే చిన్న వాళ్ళకు ఆయుక్షీణం అన్నారు... పెద్దవాళ్ళు."

"ఈ ముసిలివాళ్ళ కబుర్ల కేంలే;"

"సినిమాలు చూడకూడదనడంమాత్రం ముసిలాళ్ళ కబుర్లు కాదు! కామోలు."

"రెండుసార్లు ఓడిపోయినా నీ చేతిలో. ఇంకొక్క సారయితే నేను సంపూర్ణంగా ఓడిపోయినట్లే. ఇకనువ్వే నాకు గురుత్వం వహించాల్సివుంటుంది శారదా."

"గురుత్వం వహించిన వాళ్ళు శిష్యుల మనస్తత్వాన్ని అర్థం చేసుకొని ఆ విధంగా నడుచుకోవాలి. నేనే గురుత్వం వహిస్తే, ఆ విధంగానే నడుచుకొంటా."

"యివ్వాళ వాదనలో ముమ్మాటికీ ఓడిపోయినా శారదా. ఇహ నువ్వే నాకు గురువు.కనుక నా మనస్తత్వం ప్రకారమే నీవు నడుచుకోవాలి."

"తప్పకుండాను" అన్నది శారద నవ్వుతూ.

"శారదా...నా మీద ఎందుకింత కరుణ నీకు."

"అవ్వేమీ నాకు తెలీదు!" సిగ్గుతో ముగ్ధురాలయి పోయింది శారద. మెల్లగా సీతారాంచెయ్యి తనచేతిలోనికి తీసికొంది వేళ్ళు నిమురుతూ.

సీతారాం ఆక్షణంలో ఏదో బ్రహ్మానందం అనుభవించాడు. "తనకోటి జన్మాలతపస్సు పండిన ఘడియలవి" అనుకొన్నాడతను...ఇంతలో తనవ్యక్తిత్వం గుర్తొచ్చింది. ఆందోళితుడైనాడు.

తెప్పరిల్లుకొని అన్నాడు...'శారదా! శర్మగారు

నిన్ను చూసి చాలరోజులయిందన్నారు. ఒకసారి వెళ్ళొద్దామా."

"వెళ్దాం పదండి. నేనూ చూడాలనుకొంటున్నాను"

దారిలో సీతారాం అన్నాడు. "శారదా! ఇందాక మాటల సందర్భంలో నీతో అన్నాను గుర్తుందా; పవిత్ర ప్రేమ ఆత్మత్యాగంతో కూడుకొందని!"

"మీ సాన్నిహిత్యంకోసం దేన్నయినా త్యాగం చేయగలను, సీతారాం!"

"మనిద్దరి అంతస్తులలో చాల తేడా ఉంది శారదా. నీవో భాగ్యవంతుల బిడ్డవు.. నేనో ఒక నిర్భాగ్యుణ్ణనే చెప్పుకోవాలి యీరోజున. భాగ్యవంతులదృష్టి ఎప్పుడూ తమ అంతస్థుకు తగిన వారిమీదే వుంటుంది. నీలో త్యాగం చెయ్యగల స్థైర్యంవుంది. కాని దానికి చాల అవరోధాలు కలుగుతయ్యని నా భయం."

"ఏ అవరోధాలు, నా పవిత్రప్రేమను ఏమీ చేయలేవు!"

"ప్రేమైకమార్గం ఎప్పుడూ కంటకావృతం శారదా. ముందాలోచన, సరిఅయిన రక్షణలేనిదే కంటకావృతమైన పథంలో పోవడం కష్టసాధ్యం."

"నేనన్నీ ఆలోచించే యీ నిశ్చయానికొచ్చాను. నా హృదయపూర్వకంగానే మిమ్మల్ని ప్రేమించాను సీతారాం. ఎన్ని అవరోధాలయినా రానీ, అన్నీ అధిగమించగలను. నా ప్రేమైకమూర్తి అండ వున్నంతవరకు నన్నెవ్వరూ ఏమీ చేయలేరు!"

"నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నా శారదా! కాని అంతస్థుల తేడా అనేక యిబ్బందులకు కారణమౌతుంది. నీవు కష్టపడుతుంటే నేను చూడలేను శారదా. నీవు సుఖంగా అమృతహాసం చేస్తుంటే నేను నా ఉనికినే మరచిపోగలను."

"నీ నిర్ణయం వ్యతిరేకమైనా, నా నిర్ణయం మారదు సీతారాం. మీ ముందు ఇతరమేమీ నాకొక లెక్కలోవి కావు."

"శారదా!...నేను ధన్యుణ్ణి!"

"ఇది పర్వదినం. సీతారాం. నా ఆశయాలన్నీ ఫలించినై."

♦ ♦ ♦

శర్మగారు వాకిట్లోనే వున్నారు...పిల్లి చేరు కొనేప్పటికి.

"ఏం శారదా, బాగా చదువుకొంటున్నావా?"

"ఓవ్! ఫస్టుమార్కు కొట్టేస్తానండి. మా సీతారాం ప్రక్కనుంటే ఈ సంవత్సరమే యం. ఏ. పరీక్షకు కూర్చొమన్నా ఢంకాకొట్టి ప్యాసు కాగలను."

"ఏం సీతారాం. నీవైనా చదువుతున్నావా. శిష్యురాలికి పాఠాలు చెప్పడంతోనే సరిపోతుందా?"

"మా శారద ప్రక్కనుంటే మహాకావ్యాన్ని ఆశువుగా చెప్పేయ్యనూ. ఇక మీ ఆశీర్వచనం ఉండనే ఉంటుంది. మేం యాచించకుండానే!"

"సెభాష్. సరిపోయిందోయ్ మీ యిద్దరికీని, మంచి

ముహూర్తం చూడండి ఆశీర్వదిస్తాను"...సిగ్గుతో ఇద్దరూ తలలు వంచుకొన్నారు.

కాలేజీలు ఇంకా నాలుగురోజులలో తెరుస్తారని తెలిసింది...ఇద్దరూ శర్మగారిదగ్గర శెలవుతీసికొని బయలు దేరారు...

♦ ♦ ♦

సీతారాం శర్మగారింటికి వచ్చేటప్పటికి శర్మగారు ఇంట్లోనే ఉన్నారు. ఇల్లు సందడిగాఉన్నది. భార్యా పిల్లలు వచ్చినట్లున్నారు. అనుకొంటూనే "శర్మగారూ" అని పిల్చాడు.

శర్మగారిభార్య తలుపుతీసింది. కుశలప్రశ్నలవుతుం డగా శర్మగారు వచ్చారు. అంతా కూర్చున్నారు. రుక్మి ణమ్మగారు కాఫీ తెచ్చి యిచ్చారు.

కాఫీ త్రాగుతూ శర్మగారే అన్నారు. "ఏమేవ్ రుక్మిణీ! నీకొక శుభవార్త. మన సీతారాం—శారదా..." అంటూ వదిలేశారు. రుక్మిణమ్మగారు గ్రహించు కొన్నారు. "ఇంకేం...శుభం!... అదృష్టవంతుడవోయ్ సీతారాం!" అన్నారామె. సీతారాంకు కళ్ళవెంట నీళ్ళే వచ్చినై.

"నిజం చెప్పాలంటే నాకు ఇప్పుడు పెళ్ళిచేసు కోవడం ఇష్టంలేదు. అందుకు తగిన తాహతూలేదు. అందులో శారదలాంటి అమ్మాయిని! మా ఇరువురి హృద యాలూ ఎంత పవిత్రమైనా, సాంఘికంగా ఆ ప్రేమ ఫలిం చడం చాలకష్టమండి. దీనివల్ల శారద ఏమి ఇబ్బందులు

పడవలసి ఉంటుందో? కాని, శారద హృదయానికి నేను జోహారులర్పించకుండా ఉండలేకపోతున్నాను" అన్నాడు సీతారాం సగం సిగ్గుతోనే—

"అవునోయ్...శారదతండ్రి బాగా ఆస్తిపరుడట. సాకూ అదే అనుమానం. ఆయన మీ యిరువురి వివాహానికి ఆమోదిస్తాడా?" అని అన్నాడు శర్మగారు.

"ఏమోనండి, నా కంతా అగమ్యగోచరంగా ఉన్నది!"

"శారద మేనమామ అభ్యుదయభావాలు కలవాడే. బహుశః వప్పుకోవచ్చు. అందులో శారదంటే చాలా అభిమానంకూడా ఆయనకు. వాళ్ళతండ్రి, శారద చదువుకు కూడా ససేమిరా వీలులేదన్నాట్ట. కాని ఈయన బలవంతం మీదనే శారద చదువుకొంటున్నదిటకూడ" అన్నారు శర్మగారు.

"ఏమో శర్మగారూ!...ప్రేమ భగవదంశ అన్నారు కదా. బీదవాడికి ప్రేమించే హక్కు లేదాండి."

"ప్రేమించే హక్కుఉన్నది...ప్రేమింపబడే హక్కు ఉంది. ఆప్రేమసాఫల్యానికి సాంఘికముద్ర అవసరమైంది కదా. ఏమౌతుందో చూద్దాం.ముందు ఇంకా రెండునెలల్లో పరీక్షలున్నయ్. సరిగా చదవండి. ఈ వ్యవహారాలుతర్వాత చూడొచ్చు."

"సంఘంముద్ర వేయకపోతే...ఆ సంఘం, అభివృద్ధి నిరోధకమైనదన్నమాట. అటువంటి సంఘాన్నే వ్యతిరేకిస్తా మాష్టారూ!" అంటూ లోపలకు వచ్చింది శారద.

"ఓహో! సమయానికి వచ్చావు. రా అమ్మా! శారదా!"

"నీవన్నది మంచిదే. కాని సంఘాన్ని అందులో తండ్రిని వ్యతిరేకించగల నిబ్బరం ఉండాలి తల్లీ! దానివల్ల వచ్చే కష్టనష్టాలుకూడా తక్కువేమీ ఉండవు."

"ఏమోలెండి. అదంతా కాలమే నిర్ణయిస్తుంది. మా నిర్ణయాలకు మాత్రం ఏమీ తిరుగులేదు. సీతారాం తరఫునకూడా నేనే ప్రమాణం చేస్తున్నా-ఆయన హృదయం నాకు తెలుసుగనుక. మా గురువర్యుల సహకారామోదాలు మాకుండనే ఉన్నయ్. ఇకపోతే అసలుసంగతి రేపు శుక్రవారం నా పుట్టినరోజు. మీరూ, పిన్నిగారూ, పిల్లలు తప్పకరావాలి. రాత్రికి డిన్నరు." అని తలవంచుకొన్నది శారద.

"అదేమిటమ్మా! సీతారాంను పిలవవూ!" అంటూ నవ్వారు శర్మగారు.

"వారితరఫునకూడా మిమ్మల్ని నేనే ఆహ్వానించానండీ...వారికి ఆహ్వానమెందుకు. నన్నెవరు ఆహ్వానిస్తారు. నేనెంతో వారూ అంతే. ఏం సీతారాం!" అంటూ సీతారాంవంక చూసింది శారద.

సీతారాం కళ్ళు చెమర్చినై. కృతజ్ఞతాభారంతో గొంతు గాద్గదికమయింది.

"నీ జీవితానికి ఒక పెన్నిధి దొరికిందోయ్" అన్నారు శర్మగారు ఆనందంతో సీతారాంవైపుచూస్తూ.

"అన్యోన్యంగా చిరకాలం వర్ధిల్లండి నాయనా"

అన్నారు రుక్మిణమ్మగారు...సీతారాం, శారదల హృద యాలు మధురోహాలతో పరవశించగా...సిగ్గుతో ఒకరి నొకరు చూచుకొని తలలువంచుకొన్నారు.

"ఇక నేను వస్తానండి...సీతారాం వస్తా...ఇవాళ, రేపు మన చదువుకు స్వస్తిచెప్దాం లెండి."

* * *

శుక్రవారం సాయంత్రం శారదయింటికి వెళ్ళాడు సీతారాం. అతనిదగ్గర షేక్స్పియర్ సెట్ ఉన్నది. అది శారద జన్మదిన కానుకగా యిద్దామనుకొన్నాడు. అంత కంటె ఇచ్చేందుకు తనకు శక్తిలేదని శారదకుమాత్రం తెలి యదా అనుకొన్నాడు సీతారాం.

శర్మగారు సీతారాంకన్నా ముందుగానే వచ్చారు. ఇంకా అతిథులెవ్వరూ రాలేదు. హాలులో శారద మేన మామ, శర్మగారూ కూర్చున్నారు.

సీతారాం నమస్కరించాడు.

"ఏమోయ్ సీతారాం!...కూర్చోవోయ్. నేను పర్సనల్‌గా ఆహ్వానిద్దామనుకొన్నాను. నిన్న, మొన్న, ఎక్కడా ఈ చాయలకుకూడా రాలేదేం."

ఇంతలోనే ఒకముసలాయన వచ్చారు. "వీరు మా బావగారండి. మా శారద తండ్రి" అంటూ రమణారావు గారు శర్మగారికీ, సీతారాంకు పరిచయంచేశారు.

"వీరు శర్మగారు ... మన శారద లెక్చరర్‌గారు. వీరు సీతారాం. మన శారద క్లాస్‌మేట్. మంచి అభివృద్ధి లోనికి రావలసినవాడు."

శారద వచ్చింది లోపలనుండి. "ప్రొద్దున్నే రమ్మంటిని కదండీ మీ అందర్నీ. రాలేదేమండీ" అంటూ.

"అందరికంటె ముందే వచ్చాంగదా అమ్మా!" అన్నారు శర్మగారు.

శర్మగారు, సీతారాం శారదతండ్రికి నమస్కరించారు. ఆయన సీతారాంవైపు రెండుసార్లు ఎగాదిగా చూచాడు. ఆ క్షణంలో ఆయన ముఖకవళిక చూస్తుంటే సీతారాంకు చాలా భయమేసింది. ఆగర్భశత్రువును చూచినట్లు చూశాడు సీతారాంవంక. అంతటితో వెనక్కుతిరిగి లోపలకుపోతూ, "రమణారావ్, ఇలా రా ఒక్కసారి" అంటూ వెళ్ళాడు. ఆయన వెనకనే 'కూర్చోండి మాష్టారూ' అంటూ శారదకూడ వెళ్ళింది.

లోపలనుండి అస్పష్టంగా వినిపిస్తున్నవి మాటలు. శారద తండ్రి అంటున్నాడు. 'ఈ కూటికిలేని దరిద్రుల్నందర్నీ చేరదీయటమూనూ! పరువుప్రతిష్ట, ఏం అవసరంలా? మనతాహతుకు అందగలవాళ్ళతోనే స్నేహం చేయాలి.' సీతారాంలాంటి బీదవాడు తనయింటికి రావడం ఆయనకు ఏమాత్రం యిష్టంలేదు...ధనిక నిర్ధనిక అంతరం ఎన్నటికీ సడలకూడదనీ, ఆ రెండూ సమాంతర రేఖల్లా కలవక తమ తమ గతుల్లో సాగిపోవాలనే సిద్ధాంతం నరనరాల్లో జీర్ణింపజేసుకున్నవాడాయన. "మీచాదస్తంగాని...అలాఎలాగండి. అయినా గుణం ప్రధానంగాని ఏమిటండి బావగారూ, మీ కోపం, పట్టుదల. ఒకే క్లాసు. మంచివాడు ... మనవాళ్ళే. కనుక ఆహ్వానించింది. ఆహ్వానంమీద మనఇంటికి వచ్చిన

వాళ్ళను నిరాకరిస్తామా! అది మాత్రం మనగౌరవానికి లోటుగాదుటండీ! ఏమయినా నేనాపని చేయను. మీ యిష్టం.' రమణారావుగారు అంటున్నారు బావగార్ని మూర్ఖపు సిద్ధాంతంనుండి మళ్ళించాలనే ఉద్దేశ్యంతో.

"అయితే నేనే చెప్పాస్తానులేవయ్యా" అన్నాడు శారద నాన్నగారు. ముసిలాయన తన పట్టుదలను సడలించక, ద్విగుణీకృతమైన కోపంతో, మూర్ఖపుజుగుప్సతో—

సీతారాం తలతిరిగిపోతున్నది. ఇటు శర్మగారి పరిస్థితికూడా అట్లాగే ఉన్నది. ఇంకా ఏమేమో మాటలు గట్టిగానే సాగుతున్నయ్. అవి ప్రత్యేకించి సీతారాంను ఉద్దేశించి మాట్లాడుతున్నవే అనేది స్పష్టం. సీతారాం అయోమయపరిస్థితిలో పడ్డాడు. స్వహతస్వేస్థితి వచ్చింది అతనికి. 'నేను వెళ్ళొస్తా మాష్టారూ' అన్నాడు సీతారాం శర్మగారిని ఉద్దేశిస్తూ. యింతరభస జరిగినతరువాత యిక అక్కడ ఉండడం భావ్యంగాదనే భావనతో, విచలిత మనస్కతతో.

"కూర్చోవోయ్. ఇదేమిటో తేలుస్తా. ఆయనకు ఎంతఉంటేమాత్రం అతిథులను అగౌరవపరుస్తాడా?" శర్మ గారంతటి సాత్వికుడికి, శారద తండ్రి చేసిన అవమానానికి కోపం కట్టలు తెంచుకు వచ్చింది.

"వద్దండి మేష్టారూ. శారద మనసు బాధించటం మంచిదికాదండి. అసలు ఈయనతత్వమే అంతనుకొందాం. అన్నివిధాల నేను వెళ్ళటమే మంచిదండి." అని లేచాడు

సీతారాం. అతను మొదటినుండీ భయపడుతూనే ఉన్నాడు యిలాంటి పరిస్థితి ఎన్నడో తటస్థపడుతుందని.

"వెళ్ళవోయ్ వెళ్ళు. ఇంకా ఏమో మంచిదంటున్నావా—తాహతు కనిపెట్టవద్దూ" అంటూ శారద తండ్రి హాల్లోకి వచ్చాడు ఉగ్రరూపంతో వణకిపోతూ.

సీతారాం ఎలా బయటపడ్డాడో అతనికే తెలియదు. అతనికి అక్కడ ఉండడమంత బుద్ధితక్కువ ఇంకొకటి లేదని పించింది. ఒకరిక్షా అలాపోతుంటే దానిలోపడి రూంక పోయి...దుఃఖం పొర్లిరాగా ఏడుస్తూ పడుకొన్నాడు కలిగిన అవమానానికి. గాలిలో బ్రహ్మాండమయిన మేడకట్టి, ఒక్కసారిగా కూలిపోయినట్లయింది. ప్రపంచంలో బీద వాళ్ళకు డబ్బున్నవాళ్ళచేతులలో ఇంతగా అవమానం పొందమని రాశాడా భగవంతుడు! వచ్చేటప్పుడు శారద కనపడలా. కనబడకుండా ఉండడమే మంచిదయింది. హే భగవాన్!...

కొంతసేపటికి తలుపెవరో కొట్టారు ...శర్మగారు, రమణారావుగారు తలుపునెట్టుకొని లోపలికివచ్చారు.

"సీతారాం నన్ను క్షమించాలి. ఈ అవమానం నీకు కాదు, నాకు; మా శారదకూనూ. ఆ ముండమనిషి మాటలకు లెక్కేమిటి ... రా వెళ్దాం" అన్నాడు రమణారావుగారు బాధపడుతూ.

"మీ అభిమానానికి ఎప్పుడూ తలవంచుతానండి. కాని నేనువచ్చి ఆయన మనసు నొప్పించడంకంటె, రాకపోవడమే మంచిదిలెండి." విషణ్ణవదనంతో, మరోసారి

అలాంటి అశాంతియుతపరిస్థితిని సృష్టించకూడదనుకొంటూ అన్నాడు.

"సీతారాం...ఇక నీవాదనలన్నీ కట్టిపెట్టి, రమణా రావుగారిమాటి మన్నించు" శర్మగారు అన్నారు సాను నయంగా.

"జరిగినదానికి చాల విచారిస్తున్నాం సీతారాం. నీవు రాకుంటే శారద పుట్టినరోజు, వుపవాసమే చేస్తుంది. రా వెళ్దాం - తప్పను. క్షమించు." రమణారావుగారు, ఎలా గయినా సీతారాంను ఒప్పించేధోరణితో, స్నిగ్ధమైన దృష్టితో అతనివైపుచూస్తూ అతని హస్తద్వయాన్ని తన చేతుల్లోకి తీసుకున్నారు—

"క్షమించండి. మిమ్మల్ని యింత శ్రమ పెట్టి నందుకు..." అంటూ సీతారాం లేచాడు వాడి పేలవంగా మారిన వదనంతో.

శారద తండ్రి ఎక్కడా కనబడలా. అతిథులుకూడా ఎవరూలేరు. శారద, ఆమెతల్లి; సీతమ్మగారూ, రమణా రావుగారిభార్య కూర్చున్నారు.

"సీతారాం. నన్ను క్షమించరూ! మా నాన్న మూర్ఖంగా అన్న మాటలకు చాలా విచారిస్తున్నానండీ" అంటూ కంటతడిపెట్టింది శారద.

"రా నాయనా...సీతారాం. అంతా కూర్చోండి. ఆ మొండిఘటం ఎప్పుడూ అంతే. అంతా ఆలోచించకుం డానే అనేశాడు. అయినదానికి క్షమించాలి నాయనా! నీవు

క్షమిస్తేగాని మా శారదమనస్సు పూరట చెందదు'' అన్నారు సీతమ్మగారు.

ముసలాయనకు, ఆయనభార్యకు ఎంత ప్రేమ! ఎంత ఆప్యాయత! ఆమె ఆదరణలో ఇంతకుపూర్వం జరిగిన అవమానం క్షాళితమయింది సీతారాంకు.

"మీ ఆదరణకు ఆజన్మాంతం కృతజ్ఞుణ్ణి. మీ అందరిమనస్సు నొప్పించినందుకు మీరే క్షమించాలి" అంటూ సీతారాం వారికి నమస్కరించాడు. ఆమెకళ్ళు చెమర్చినవి.

"నిజంగా భాగ్యవంతుల మన సత్వం అని, బీదల మన స్తత్వమని, మనుష్యులలో ప్రత్యేకత ఉన్నదా. భాగ్యవంతులలో మాత్రం ఉదాత్తమైన అభిప్రాయాలుగలవా రున్నారనడానికి సీతమ్మగారే సాక్ష్యం.

"ఆమెకు ఏవిధంగా నేను దగ్గర అని ఇంత ఆప్యాయత చూపింది తనమీద. అసలు స్వతహాగా ప్రతిమనిషికి మంచిగాని, చెడుగాని, కొంత అంతర్గతమైఉంటుందేమో. ఎక్కువ తక్కువ అంశలలో మంచీ చెడూ-రెండూ అందరిలోనూ ఉంటయ్. కొంతమంది ఈ రెండుగుణాలలోనూ మెరుగులు దిద్దుకొంటూ ముందుకు నడుస్తారు" ఏవేవో ఆలోచిస్తున్నాడు సీతారాం.

ఇంతలో కొంతమంది స్నేహితులు వచ్చారు. ఎవరికి తోచిన బహుమతులు వాళ్ళు యిచ్చారు. అంతా కూర్చున్నారు. శారద తండ్రికూడ వచ్చి పంక్తిలో చివర కూర్చున్నాడు. భోజనాలయ్యాక స్నేహితులు వెళ్ళిపోయినారు.

శర్మగారు - సీతారాం వసారాలోకి వచ్చారు. శారద తండ్రి ఒక సోఫాలో నుటనుటలాడుతూ కూర్చు న్నారు.

సీతారాం రూంకు వెళ్ళిపోయినతరువాత ముసిలా యన్ని అంతా దులిపివుంటారు. పెద్ద రాద్ధాంతం జరిగే వుంటుంది. అందుకనే అలా మూగిగా కూర్చున్నాడు. పాపం సీతారాంకు జాలి వేసింది.

"నావల్ల ఏమయినా తప్పుంటే క్షమించండి." అంటూ దగ్గరకు వెళ్ళి నమస్కరించాడు.

ముసలాయన 'ఊఁ!' అని ఊరుకొన్నాడుగాని ఇంకేమీ మాట్లాడలా ఆయన. ఇంతలో శారద, రమణా రావుగారు వచ్చారు అక్కడికి. అందరివద్ద శెలవుతీసికొని శర్మగారు, సీతారాం బయలుదేరారు—

"శారద తండ్రి ఎంత కుత్సితుడో, రమణారావుగా రంత ఉదాత్తుడోయ్" శర్మగారే అన్నారు దారిలో.

"ఏం జరిగిందేమిటి నేను వెళ్ళినతరువాత. ముసిలా యన ధోరణిచూస్తే చివ్వబుచ్చుకొన్నట్లుందే" అన్నాడు. సీతారాం.

" 'మంచివాడు ... మనవాడు. సత్ప్రవర్తన, తెలివి తేటలూచూచి అతన్ని నేనే ఆహ్వానించాను. అతన్ని నీవు అవమానిస్తే - ఆ అవమానం అతనికికాదు నాకు. కనుక ఇక్కడ అవేమీ పనికిరావు' అని నిక్కచ్చిగా చెప్పారు రమణారావుగారు. ముసిలాయన నోరెత్తితే ఒట్టు. వింత అనుభవస్తులయినా పెద్దవాళ్ళుకూడా చాలా నీచంగా ప్రవ

రిస్తారోయ్." శర్మగారిమాటల్లో, వదనంలో, ఆనాటి సంఘట నకు బాధ విచారం ద్యోతకమయ్యాయి.

"అది అనుభవం కాదండి. అనుభవంగలవాళ్ళకున్న అపోహ - అహంభావం - అవుతుందేమోగాని, ఏమైనా ఆయన్ని చూస్తే నాకే జాలివేసి పలుకరించి వచ్చానండి" అన్నాడు సీతారాం చిన్న హాసంచేస్తూ.

ఇంతలో సీతారాం రూంవచ్చింది. శర్మ తన యింటికి వెళ్ళిపోయారు....ముందు జరుగబోయే పరిణా మాలకు, పరిస్థితులకు ఈరోజు సంఘటన ఒక దివ్యమైన హెచ్చరిక అనుకొంటూ రూంకి వెళ్ళాడు సీతారాం.

♦ ♦ ♦

ఇంటికి వెళ్ళాడేగాని, ఆరాత్రి సీతారాంకు నిద్ర పట్టలేదు. రాత్రంతా అదే ఆలోచన. శారదకు తనకు ఏర్పడ్డ స్నేహం చనువుగా మారింది. ఆ చనువువల్ల తమ ఇరువురి హృదయాలు దగ్గరయినాయి. అది ప్రేమబంధంగా మారింది. తను నిరుపేద. శారద లక్షాధికారి బిడ్డ. తమ యిరువురి ప్రేమానుబంధానికి ఈ ధనిక నిర్ధనికాంతర హైన్యపు సిద్ధాంతాలు అడ్డుగోడగా నిలిచేటట్లున్నయ్. శారద తండ్రి...బీదవాడయిన తనకు శారదనిచ్చి పెళ్ళి చేయడానికి సుతరామూ సమ్మతించడు. ఆ విషయం ఆయన ప్రవర్తనవల్ల అప్పుడే తేటతెల్లమయింది.

ఇక శారద చాలా పట్టుదల గలది. ఆమెకు స్వతంత్ర అభిప్రాయాలున్నయ్. తమ వివాహానికి తనతండ్రిని ఒప్పించగలననే ధైర్యం అదివరకుంటే ఉండవచ్చు. కాని

ఈ సంఘటన తర్వాత ఆమె ఏవిధంగా మారుతుందో, తమ యిరువురి సాంగత్యానికి మధ్యలేచే అడ్డుగోడలు, తగిలే అఘాతాలూ ముందుముందు ఎలాఉంటాయో సూచనప్రాయంగా యివాళ శారద తెలిసికొనేఉంటుంది. అయినా తనకిప్పుడు పెళ్ళేమిటి? ఒకవేళ శారదతో పెళ్ళయితే తనకు కొంత సంపద కలవవచ్చు. కాని స్త్రీ ధనంతో జీవితం వెళ్ళదీయడం నీచాతినీచం. తనూ జీవితంలో పైకిరావాలంటే ఏదయినా మంచి ఉద్యోగం సంపాయించాలి. మంచి ఉద్యోగం రావటానికి ఈ డిగ్రీ పూర్తికావాలి. ఏమయినా శారదను తను మనఃపూర్తిగా ప్రేమించాడు. దీని ఫలితాలు, మంచిచెడ్డలు ఎలా ఉంటాయో...ఏమైనా ఆశాజనకంగా మాత్రం లేవు...

ఇలాంటి ఆలోచనలతో ఎప్పుడో తెల్లవారు ఝామునగాని సీతారాంకు నిద్రపట్టలేదు.

మరురోజు కాలేజీకి వెళ్ళలేదు...రాత్రి నిద్ర పోక పోవడంతో బద్ధకంగా పడుకొన్నాడు ... "ఒకసారి శారదతో మాట్లాడాలి. సాయంత్రం కలుస్తుందేమో చూద్దాం. అయినా వాళ్ళయింటికి మాత్రం వెళ్ళకూడదు.." అనుకొన్నాడు సీతారాం.

సాయంత్రంకూడా ఎక్కడికీ కదలలేదు. శారద మాత్రం రాలేదు. మర్నాడు కాలేజీకి వెళ్ళాడు సీతారాం. అయిదు గంటలకే లేచి పండుకొన్నాడు. శర్మగారి భార్య వచ్చినప్పటినుండి రూంలోనే స్టౌమీద వండుకొంటున్నాడు.

హోటళ్లోనో, హాస్టల్లోనో తినాలంటే డబ్బు పుష్కలంగా కావాలి. అంతఖర్చు తను నిభాయించలేడు—

క్లాసులో ఉన్నాడన్నమాటేగాని మనస్సంతా శారదమీదే వుంది. ఒకసారి శారద కనిపించితే బాగుండును. కాని తీరా శారద కనిపించితే ఏం మాట్లాడాలి?...ఆమె నోటిద్వారా ఏమి వ్యతిరేకత వినాల్సి ఉంటుందో! భయపడ్డాడు మళ్ళీ.

సాయంత్రం అయింది. కాలేజీ వదిలారు. శారద ఇవాళ కనబడకుంటేనే మంచిది. అందరికంటే తను ముందు లేచి బయలుదేరి గేటుదాటాడు. అప్పటికే శారద బయట నిల్చునిఉన్నది. తనరాకకే నిరీక్షిస్తున్నట్లున్నది. కొంచెం తడబాటు చెందాడు సీతారాం.

అయినా శారదతో ముఖాముఖి తప్పదు. దగ్గరకు వచ్చాడు. "ఏం శారదా! ఎవరికోసం నిరీక్షిస్తున్నావు?" అన్నాడు అనుకోకుండానే.

శారద చిన్నబుచ్చుకొన్నట్లు కనిపించింది ఆ ప్రశ్నతో.

"మొన్న జరిగిన సంఘటనను నేను చాల విచారిస్తున్నా సీతారాం. కాని మీరింతలోనే చిన్నింత పరాయిదాన్నిగా భావించేసి, అవమానపర్చటం, మీకేమంత భావ్యం" అన్నది శారద.

"నేనేమీ బాధపడలా శారదా! పెద్దవాళ్ళ మన సత్వం తెలుసు. నే నందుకు సిద్ధపడే ఉన్నా. కాని నీవు బాధపడడంమాత్రం నేను సహించలేను. ఆరోజు సంఘ

టనతో నాకేదో అవమానం జరిగిందని కాదు నా బాధ. నీ మనస్సెంత బాధ పడిఉంటుందో నే నూహించుకోగలను శారదా!"

"మా నాన్న తత్వమే అంత. ఈ పరీక్షలు కాగానే నా చదువు మాన్పించుతానని ఊరెళ్ళారు మా నాన్న."

"అదేమిటి? ఎటూ కాకుండా మధ్యలో మానితే ఎట్లాగనుకొన్నారు?"

"నే నిక్కడ ఉంటే ఇట్లాగే వాళ్ళతో వీళ్ళతో స్నేహాలు చేస్తాననీ, అయినా ఆడవాళ్ళకు చదువెందుకనీ, ఏమేమో అన్నారు. ఈ ఉన్న కాస్త గౌరవంకూడా పోగొట్టుకున్నారు నాదగ్గర" అంది శారద.

"అదేమిటి శారదా! పిల్లలబాగోగులు పెద్దవాళ్లకు బాగా తెలుస్తాయి పిల్లలకంటె." అన్నాడు సీతారాం.

"మీరింత మర్మగర్భంగా మాట్లాడడం నేస్నకో సవసరంలా సీతారాం."

"నేను మీకు హృదయాన్నిచ్చాను. ఆ సంగతి మీకు తెలియక పోలా. ఒకళ్లనొకళ్లు ప్రేమించుకొన్నాం. మన తల్లిదండ్రులకు ఇష్టం లేనంత మాత్రాన మన స్నేహం విచ్ఛిన్నం కావచ్చనికదూ మీ ఉద్దేశం. ఆమనూరయినా వుద్దేశ్యం మారబోదు సీతారాం. ఎన్ని జన్మలకైనా ఈ శారద నీ సొత్తే." శారద కంట తడిపెట్టింది.

"ఛా, ఏమిటి శారదా. మరీ చిన్న పిల్ల వౌతున్నావు. నేను నిన్ను నా హృదయపూర్తిగా ప్రేమించుతున్నా. అందుచేతనే, నీవేమి ఇబ్బందులలో పడవలసివస్తుందేమో

నని భయంగా ఉంది శారదా. ఇక నేనంటే, నాకు ఇబ్బందులు పడడం మొదటినుండీ అలవాటే—నాకా భయమే లేదు"

"ఒకళ్లకు మనస్ఫూర్తించటమే తెలుసు. కాని దానిని మళ్లించటం విషయం నాకు తెలీదు...ఏదో ఇబ్బందు లొస్తాయని. ఎన్ని ఇబ్బందులొచ్చినా మనిద్దరం ఒకటిగానే అనుభవిద్దాం సీతారాం."

సీతారాం శారద దృఢ మనస్కతచూచి ఆశ్చర్య పోయాడు. ఇంతలో శారద యింటి దగ్గరకు వచ్చారు.

'నేను వస్తా శారదా!'

'ఒకసారి లోపలికివచ్చి వెళ్ళండి'

సీతారాం 'ఎందుకులే శారదా! తర్వాత ఎప్పు డయినా వస్తాలే' అన్నాడు. ఇంతలో రమణారావుగారు టెన్నిస్ బాట్ ఊగించుకుంటూ బయటకు వచ్చారు. మొఖం చిట్లించుకొంటూ వీళ్ళవంక చూచి జీపులో వెళ్ళి పోయాడు. సీతారాంకు చీమలు ప్రాకినట్లయింది. అంత ఆప్యాయతగా పలుకరించేవాడు ఒక్కరోజులో ఇలా మారి పోయాడేమిటి?...శారదకూడ చిన్నబుచ్చుకొన్నది. ఈ పరిస్థితుల్లో సీతారాంను బలవంతం చేసినా లాభంలేదు. సీతారాం రాడు.

'సరే మీయిష్టం సీతారాం' అని లోనికి వెళ్ళిపో యింది ఉదాసీనంగా.

ఒక్కక్షణం శారద వెళ్ళినదిక్కే చూస్తూ నిలబడ్డ

సీతారాం ఒక నిట్టూర్పు విడిచి తన రూంకి వెళ్ళి పోయాడు.

తనెట్లాగయినా బాగా చదివి పైకి రావాలి. ప్రస్తుతం ఈ ప్రేమకలాపంలో దిగడంచేత చదువుకూడా సరిగ్గా సాగడంలేదు. కాని శారద—తనను ఇంతగా ప్రేమిస్తున్న శారద మనస్సు తను నొప్పిస్తున్నాడేమో. మనస్సు చిన్న బుచ్చుకుంటుందేమో. అన్నీ అడ్డంకులే కనిపిస్తున్నాయ్. ఇదివరకు శారద తండ్రి ఒక్కరే అడ్డంకి అనుకున్నాడు. ఇప్పుడు రమణారావుగారుకూడ చేరారు. ఇందాక రమణా రావుగారి ముఖభావం చూచిన తరువాత ఇదేమీ ఇప్పట్లో సానుకూలపడేది కాదనుకొన్నాడు.

ఒకవేళ శారదతో వివాహం జరిగితే! శారదకు మంచి ఆస్తి ఉన్నమాట వాస్తవమే. కాని తనుకూడా మంచి హోదాగల ఉద్యోగంచేసి తన ఆర్థికలోటును తన స్వప్రయత్నం మూలంగానే భర్తీ చేయాలి. కాని శారద ఆస్తిపాస్తులమీద ఆధారపడటం మాత్రం మంచిది కాదు. పైగా లోకువకూడాను. తనూ, శారదా, ఇరువురూ స్వతం త్రాభిప్రాయాలు కలవాళ్ళే. అట్లాగే స్వతంత్రంగానే బ్రత కటం నేర్చుకోవాలి. ఏమేమో ఆలోచించాడు సీతారాం.

కొన్నిరోజులవరకు శారద సీతారాంకు తటస్థపడలా. సీతారాం శారద ఇంటిదారినే పోవటం మానివేశాడు. వేరే దారిన కాలేజీకి పోతున్నాడు. ఒకవేళ వాళ్ళ ఇంటి దగ్గర శారద తటస్థపడితే పెద్దవాళ్ళచేత తను అవమాన పడడం అతనికి ఇష్టంలేదు.

పరీక్షలు చివరిరోజు శారద కనిపించింది. చంద్ర బింబంలాంటి ఆమె మొఖం వాడివుంది.

'ఏం శారదా కులాసా'

శారద తలవంచుకొని వుంది. సూటిగా సీతారాం వైపు చూడలేకపోయింది. ఆమె కళ్ళవెంట అశ్రువులు రాలుతున్నాయి. మెల్లగా అంది.

'నీవుకూడా నన్ను పరీక్షచేస్తున్నావా సీతారాం. ఇక ఈ మహాజలరాశిని నేనొక్కతెనే ఈదాలన్నమాట.'

శారద, సీతారాంల మధ్య ప్రేమాంకురమైనట్లు శారదతల్లి గ్రహించగల్గిందట. సీతారాంఎడ ఆమె భర్త చూపిన అనాదరణకు ఆమె కించపడినా, సీతారాంలాంటి బీదవాడు తన కుమార్తెకు భర్త గానటానికి ఇష్టపడనట్లు శారద చెప్పింది.

రమణారావుగారుకూడ తన చెల్లెలిమాటకే వంత పాడారట. తన అతిథిగా సీతారాంకు శారద తండ్రిచేసిన అవమానాన్ని వ్యతిరేకించాడేగాని, వీరిద్దరి సంబంధానికి ఆయన వ్యతిరేకి అనేదికూడా శారదే చెప్పింది.

'ఈ పరిస్థితుల్లో తను ఆజన్మబ్రహ్మచారిణిగానన్నా ఉంటాగాని, మన ప్రేమానుబంధం ఇలా సగంలో విచ్ఛిత్తి చెందడం అసంభవం సీతారాం!' దృఢంగా అన్నది శారద. శారద దగ్గర సెలవుతీసుకొని రూమువైపు బయలుదేరాడు, శారద యిల్లు సమీపించంగానే. వెనుకనుండి రమణారావు గారి జవాను పిల్చాడు 'సీతారాంగారూ' అంటూ. ఏదో గాలిదుమారం ఎదుర్కోవలసి ఉంటుందనుకుంటూ వెను

దిరిగి వచ్చాడు. రమణారావుగారు లేరు ఇంట్లో. హాలులో కూర్చున్నాడు. శారద తల్లి తలుపుప్రక్కగా నిలబడిఉంది.

'ఏం బాబూ! పరీక్షలు బాగా వ్రాశావా?!' అందామె...

'బాగానే వ్రాశానండి. ఆపైన భగవంతుని దయ.'

'తర్వాత ఏం చేద్దామని బాబూ!'

'ఏమోలెండి. ఇంతవరకు పెద్దవాళ్ళ అండన చదివాను. ఇకముందేమౌతుందో తెలియదు.'

ఇంతలో శారదవచ్చి ఎదురుగాకూర్చుంది సోఫాలో. వెంకన్న కాఫీకప్పులతో వచ్చాడు. సీతారాంవంక దీనంగా చూశాడు. కాఫీత్రాగుతున్నంతసేపు అతనివైపే కన్నార్పకుండా చూస్తూనే ఉన్నాడు వెంకన్న.

'అయితే శలవులకు మీవూరెప్పుడు వెళ్తున్నావబ్బాయి?'

'నాలుగు రోజుల్లో వెళ్తానండి'

'పాపం మీ తల్లి ఒంటరిగా ఉంటుంది. శలవల్లో ఆమెదగ్గరుండు. ఏదయినా సంబంధంవస్తే పెళ్ళిచేసుకో. మీ అమ్మగారి పెద్దతనంలో ఆసరాగాగూడ ఉంటుంది'

సీతారాం నిలువెల్లాకంపించాడు...తనయందు ఆప్యాయత కనబర్చుతూనే ఒక గొప్ప సత్యాన్ని తెలియజెప్పిందామె. శారద ఒక గొప్పయింటిపిల్ల; దానిమీద ఆశ పెట్టుకోవద్దనీ, వేరే నీదారినీవు చూచుకోమని, అన్యాపదేశంగా చెప్పినట్లు ధ్వనించింది సీతారాంకు. ఎన్నో అర్థాలు

స్ఫురింపనై. ఇక అక్కడ కూర్చోబుద్ధి పుట్టలేదు. తల్లి ఈ మాట అనటంతోనే శారద లేచి వెళ్ళిపోయింది లోపలకు.

'మంచిదండి. వస్తాను' అంటూ బయటపడ్డాడు సీతారాం.

బీదవాళ్ళకు ప్రేమించటానికి, ప్రేమింపబడటానికి హక్కులేదు. సంఘంలో బీదవాడికి పలుకుబడి శూన్యం. ఎంత అన్యాయస్థుడైనా, డబ్బున్నవాళ్ళదే సంఘంలో పలుకుబడి. వారికే గౌరవం. తనూ సంఘంలో ఒకడుగా పరిగణింపబడాలంటే తను ధనవంతుడు గావటానికైనా పాటుపడాలి. అకస్మాత్తుగా ధనికుడు కావాలంటే అన్యాయార్జితనే చేయాలి. ఈనాటి సాంఘికపరిస్థితి అదీ మరి. అన్యాయార్జితానికి తను విముఖుడు. ఈ సాంఘిక పరిస్థితే కుళ్ళుది. దగా — దోపిడి — మనిషిని మనిషి దోచుకోవటం - సత్యం - అహింస ప్రాతిపదికలులేని ఈ సమాజం కుళ్ళుది - కుళ్ళు సమాజం! ... కుళ్ళు మనుష్యులు ! ...

సీతారాం మనస్సు ఆలోచనలతో సతమతమైపోయింది.

సీతారాం కాలేజీకి సెలవు లివ్వడంతో తన సొంత వూరు వచ్చేశాడు. చదువు చెడిపోతుందని మనుమణ్ణి యింటికి పంపేసి ఒక్కతే ఉంటున్నది తల్లి ...

సీతారాం తన వూరు వెళ్ళాడని తెలిసి శారద చాలా విచారించింది; తన తొలిప్రేమపుష్పం ఇలా వాడిపోయినందుకు. సీతారాంమీద ఉన్న అభిమానాన్ని, మనస్సును, తన ఆకాంక్షను ఇతరులమీదకు మళ్ళించలేదు

తను. అన్ని ఆశలు అతనిమీద ఉంచుకొనిన తనను, వెళ్తూ కలవకుండానే వెళ్ళాడు చివరికి ... సీతారాం అంత మూర్ఖంగా ఎందుకు ప్రవర్తించాడు ? కష్టాలు, సుఖాలు ఇరువురు సమంగా పంచుకొందామనుకొన్నారు కూడ. ఈ విధంగా ఒంటరిదాన్ని చేసిపోతే ... పైగా ఎదుకు తన సుఖాన్నే కాంక్షించి వెళ్ళిపోయినాడంటాడు తన్ను సమ రించుకొంటూ. ఇందుమూలకంగా తనకు సుఖమెలా కలుగుతుంది ? తల్లిదండ్రుల నిరంకుశత్వానికి లొంగిపోవటం సుఖమా ?! స్వేచ్ఛగా తన సుఖదుఃఖాలకు తను బాధ్యురాలు కావటంలో సుఖముందా ? ఏమో ! ... ఎటు చూచినా భవిష్యత్తు అంధకార బంధురంగా ఉన్నది. తన అనుబంధానికి, అనురాగానికి అడ్డుగా నిలిచిన ముసిలాయన, తల్లి, మామయ్యలను ఎలాగైనా ఒప్పించాలి. అసాధ్యమయితే సీతారాం తనవాడయ్యేదాకా తను ఆజన్మబ్రహ్మచారిణే ... తను ఎలాగైనా ఈ కార్యాన్ని సాధించాలి.

ఈ ఆలోచనలతో శారద కళ్ళనుండి దుఃఖాశ్రువులు కట్టలు తెంచుకొన్నాయి. శారద తలగడలో తల మూసుకొని నిశ్శబ్దంగా ఏడుస్తున్నది.

"అమ్మాయ్ - శారదమ్మా - రా తల్లీ - భోజనానికి." అంటూ వెంకన్న వచ్చాడు.

"నా ఆశలన్నీ అడుగంటినై వెంకన్నా ... సీతారాం వెళ్ళిపోయాడు ... అమ్మా - అందరూ వ్యతిరేకంగా ఉన్నారు."

" అవును తల్లీ నాకు తెలిసింది ... "

ఇంతలో శారదతల్లి వచ్చింది. గది బయటనుండి విన్నట్లుంది వీరి సంభాషణ.

" అయితే అతగాడికోసం ఏడుస్తూ తిండి మానేస్తా వేమిటే ... పద...లేచి ... పిచ్చిచేష్టలు చేయక. "

" అమ్మా - నువ్వుకూడా అట్లా అంటే నేను బ్రతకనే ... " గొంతు పూడి శారద మాట్లాడలేకపోయింది.

" అవును మీ నాన్న వద్దంటున్నా, నేనే బలవంతాన ఈ చదువంటూ మొదలుపెట్టినందుకు; నాకు బాగా బుద్ధి చెప్పావు. పెద్దవాళ్ళు చెప్పినట్లు వింటంలేదు - అతనికోసం నీవు చిన్నపిల్లలా ఏడుస్తున్నావంటే, మన వాళ్ళంతా ఏమంటారన్నైనా ఆలోచించావా "

ఇంతలో రమణారావుగారు వచ్చారు.

" అమ్మాయ్ శారదా - నాకేమీ బాగోలేదు నీ తరహా. ఏదో తెలివిగలవాడుగదా అని వస్తూ పోతూ ఉండమంటే - మీరు ఇంత చనువు తీసుకొంటారనుకోలేదు. అయినా వియ్యానికి, కయ్యానికి తగిఉండాలికదా అమ్మాయ్. నీవు మొండిచేస్తే బాగుండదు. చదువుకొన్నదానివి " అన్నాడు అనునయిస్తూ.

" బీదవాడైనా అతనిలో ఉన్న సుగుణాలు చాలా భాగ్యవంతులలో వుండవు మామయ్యా - నేను చదువుకొన్నది సుగుణాలనుగురించే కాని, భాగ్యాలనుగురించి కాదు "

" భాగ్యం లేకుంటే ఒక్క సుగుణాలేమీ రాణించ

వమ్మాయ్. ఈ విషయంలో ప్రపంచజ్ఞానం ఏమీ తెలియదు నీకు"

"ఏం భాగ్యం మామయ్యా - ఇవాళుంటుంది - రేపు పోతుంది. మాకుమాత్రం ఏంభాగ్యం వుంది; మొదట. కలిసివస్తే అదే భాగ్యం"

ఆ మాట అంతరార్థం శారదతల్లికి, రఘురావుకు అర్థమయింది. అంటే నీ చెల్లెలయిన మా అమ్మను ఏ భాగ్యం చూసి మా నాయన కిచ్చారు అని. ఆ ప్రశ్నతో అంతా నిరుత్తరులైనారు. కాని వాళ్ళ అహం దెబ్బతిన్నది. దానితో కోపం రెచ్చిపోయింది.

"మానవుల అభిప్రాయాలకు, వ్యతిరేకత పొడసూపగనే, నిప్పుతొక్కిన కోతులౌతారు. అందులో ధనవంతులకు వారి గతంలోని బీదరికం జ్ఞాపకం చేస్తే మరీని. వాళ్ళ అభిజాత్యం దెబ్బతింటుంది."

అలాగే రఘురావు పరిస్థితికూడ అయింది.

"ఇదిగో అమ్మాయ్. నువ్వుల్ని విమర్శించాల్సింది నీవు కాదు. ఇది తెచ్చుకో. నా కెందుకమ్మా ఈ గొడవ" అని శారదను ఉద్దేశిస్తూ అని శారదతల్లితో "నీ కూతురును ఎవరికిచ్చుకొంటావో - మీ వ్యవహారం మీరే చూచుకోండి. నా ప్రమేయం లేదు" అంటూ మసమసా వెళ్ళిపోయాడు.

"ఎంత అపకీర్తి తెస్తున్నావే. మీ రంతా కలిసి నా ప్రాణాలు తియ్యండి ... వెధవపుటక ... నా ఖర్మ" అంటూ ఆమె బయటకు నడిచింది.

శారదకు ఏమీ చేయడానికి పాలుపోవడంలా. అనేక సమస్యలు ఒక్కసారిగా ఎదుర్కొన్నాయ్. పోనీ ఎక్కడి కయినా వెళ్ళిపోతే బాగుంటుందనుకొంది.

ఛా! ... అంత నీచం వేరే లేదు ఆడదానికి. లోకంకూడా ఎంతో నీచంగా చూస్తుంది ... సీతారాం ఎక్కడున్నాడో తెలియదు ... అక్కడేసేమిటో. అతను ఈ వూళ్ళోనైనా ఉంటే ... ఇద్దరూ కలిసి ఏ దూరదేశమో పోయి స్వేచ్ఛావాయువులు పీల్చగలిగేవాళ్ళే. తన తండ్రి ఆస్తి రాకపోయినా ఫరవాలా. తను యిద్దరికొరకూ సంపాదించుకోలేకపోడు. ... ఈ మనోబాధ లన్నింటికి తనే కారణం. తనబుద్ధి సీతారంమీదకు ఎందుకు పోవాలి?! అందుకు ... సీతారాం తెలివితేటలు, వ్యక్తిత్వం కారణాలు. ఆ వ్యక్తిత్వమే తిరిగి తన భవిష్యత్తును అంధకారమయం చేసింది. ఇక తన కొక్కటే దారి. తల్లిదండ్రుల నెలాగయినా ఒప్పించడం —

మర్నాడు ... శారద తల్లి తను [illegible] గ్రామానికి వెళ్ళారు ... శారదకు సెలవలుగదా అని.

♦ ♦

ఇంతలో మూర్తిగార్కి విపరీతమైన దగ్గువర వచ్చింది ... ఆ కాసేపు గుండె చేత్తో పట్టుకొని [illegible] తిరిగి చెప్పడం మొదలుపెట్టారు. మురళి మాత్రం శ్రద్ధగా వింటున్నాడు.

ఇప్పుడు సీతారాం స్వగ్రామంలోని పరిస్థితులెలా ఉన్నాయో చెపుతాను.

అటు బుచ్చిరామయ్యగారు కాలం చేసినతరువాత, సీతారాం చదువుకై గుంటూరు వచ్చేశాడుకదా. బుచ్చిరామయ్యగారి మరణానంతరం సుందరరామయ్య లోకానికి వెరచి,ముఖం చూపించకపోవడం, తరువాత ఆడబడచనే అభిమానంకూడా లేకుండా ముభావంగా ఉండిపోవడంతో సీతారాంతల్లి చాలా విచారించింది.

“ నడిమంత్రపుసిరి వచ్చినవారికి కళ్ళు తలమీదకు వస్తయ్. వారికి ధనం ముందు, రక్తసంబంధం, బంధుత్వం అల్ప విషయాలు!” “లక్షాధికారి అయిన తను ఒక బీదవాడైన బుచ్చిరామయ్య యింటికి వెళ్ళటమా ... అతను తన బావమరిది కావచ్చు. కాని డబ్బులేని బీద. తను, బీదవాడింటికి వెళ్ళితే తన గౌరవం, పరువు ప్రతిష్ట లేంగాను.”

బుచ్చిరామయ్యగారు చనిపోయిన నెల రోజులకు సుందరరామయ్య భార్య అన్నది ఒకనాటి రాత్రి.

“ ఏమండీ... ”

“ ఏం... ఏమిటి ?

“ మా బావగారు పోయారు గదా ... పాపం మీ అక్కగారు... ఏమి అవస్థల్లో ఉన్నదో ఏమో వృద్ధాప్యంలో” అన్నదామె ప్రకాశంగా.

“ ఎవళ్ళకర్మ వాళ్ళు అనుభవించాలే ... ఏం చేస్తాం” అన్నాడు సుందరరామయ్య.

తన అక్కగారి గురించి అంతర్గతంగా జాలి ఆయన మనసులో ఉన్నది. కాని చనిపోయిన ఆమె భర్తయందున్న ద్వేషం ముందు ఆ జాలిని బయటకు కనబడనివ్వలేక

పోయాడు. ఇదివరకు రెండు మూడు సార్లు వెళ్ళి చూచి వద్దామనుకున్నాడు కూడా. కాని తనకున్న అహంభావం అడ్డువచ్చి వెళ్ళలేకపోయాడు.

"పోనీ వెళ్ళి తీసికొనిరండి. పాపం నాలుగురోజులు వుండిపోతుంది. భర్త పోయినతరువాత ఒంటిగా ఏమి అవస్థలు పడుతున్నదో."

"నాలుగు రోజులు కాకపోతే, నాలుగు నెలలుండి నియ్యి. అందుకు కాదు. వాళ్ళకు ఆ పట్టుదల దేనికంట!" అన్నాడు సుందరరామయ్య లోగడ తన బావగారు తన ఇంటికి రాకపోవడాన్ని పురస్కరించుకొని.

"పట్టుదల వున్నవాడు వెళ్ళిపోయినాడుగా. ఇంకా ఏం పట్టుదల లుంటాయిలెండి ... మన రంగడికికూడా సంబంధమూ కుదిరినట్లుంటుంది" అన్నదామె తన సలహాకు కొంచెం ప్రాతం ఇస్తూ సుందరరామయ్య భార్య సీతమ్మ.

సుందరరామయ్యకు నలుగురూ కూతుళ్ళే. ముగ్గురు కూతుళ్ళకు పెళ్ళిళ్ళయిపోయినై. చివరి అమ్మాయి రంగమ్మ. అందవికారి. పగలు చూస్తే రాత్రికి కలలో కనిపించేలా ఉంటుంది. అమితమైన లావు, పై పెదవి దాటి ముందుకు తొంగిచూచే పలువరుస. హిడింబి, శూర్పణఖ లాంటి పురాణ రక్కసుల వంశంలో పుట్టినట్లుంటుంది. ఆమె యుక్త వయస్కురాలు అయినతరువాత సవాలక్ష సంబంధాలొచ్చి, ఆమె ఆకార వికారాదులకు జడిసినవారై ఒక్కొక్కరే వెనుకకు తిరిగి జవాబుకూడా చెప్పకుండా పత్తాలేకుండా వెళ్ళిపోయారు. పెళ్ళిళ్ళ చరిత్రలో ఒక సువర్ణశకాన్ని

ఆరంభించిన రంగమ్మ వురఫ్ రంగడు, సుందరరామయ్యకు ఒక తీరని సమస్య అయి కూర్చున్నమాట వాస్తవమే.

సీతమ్మ ఇచ్చిన సూచనలో సుందరరామయ్యగారు కొంచెం ఆలోచనలో పడ్డాడు...

భర్త దారికి వస్తున్నాడని పసిగట్టిన సీతమ్మ ఇక వదలకూడదని మరల అన్నది.

"బీదవాళ్ళు అని ఆడబడుచును చిన్నచూపు చూడడం మంచిది కాదండి. పోనీ మీరు వెళ్ళకపోతే ఒకరోజున నేనే వెళ్ళి తీసుకువస్తాలెండి" అన్నది.

ఆమె వెలిబుచ్చిన వ్యూహాను బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చిన సుందరరామయ్య లోపల యిష్టంగానే ఉన్నా బెట్టుసరిగా అన్నాడు చివరికి "సరే, నీ యిష్టం. ఆమెమీద నీకంత అభిమానం ఉండగా నేనెందుకు కాదనాలి. వెళ్ళి తీసుకురా. కాని ఆమె రాకపోతే నీకు కలిగే అవమానానికి నేను బాధ్యుణ్ణి కాను."

తన కోరిక ఇంత తేలికగా తనభర్త మన్నించటం ఆమెకు ఆశ్చర్యంగానే ఉంది. ఇంతకుముందు రెండుమూడు సార్లు ఈ విషయంమీదే భర్తను కోరగా ససేమిరా తీసుకురానన్నాడు. అందుకని ఆమె సంతోషం పట్టలేక పోయింది.

"అయితే రేపే వెళ్ళి వస్తాం నేనూ, రంగడూను" అంటూ లోపలకు వెళ్ళి ఒక గ్లాసులో పాలు తెచ్చి ఇచ్చింది. సుందరరామయ్య మనస్సులోనే నవ్వుకుంటూ గ్లాసు పూర్తిచేశాడు.

♦ ♦

మరునాడు భోజనాలు కానిచ్చి సీతమ్మ, రంగమ్మ, బుచ్చిరామయ్యగారింటికి వచ్చారు. వాకిట్లో బండి ఆగగానే తన యింటికి వచ్చేవారు ఎవరున్నారా అని ఆలోచనలోపడ్డ సీతారాంతల్లి అనసూయమ్మగారు సీతమ్మగార్ని చూడగానే గతుక్కుమన్నారు.

మరి ఎన్నాళ్ళనుండో సంబంధం తెగిపోయింది. చివరికి ఆయన పోయినతరువాత ఏదో వచ్చి మొక్కు తీర్చుకుని వెళ్ళిపోయి, ఏదో అక్కగారనకూడా మమకారం లేనివారు మరి ఇప్పుడు, ఆయన పోయిన రెండు నెలలకు ఎందుకు వచ్చినట్లు?

అయినా సీతమ్మ లోపలికివచ్చి, పరామర్శించేటప్పటికి అనసూయమ్మ దుఃఖం ఆపుకోలేకపోయింది. సీతమ్మను కావిలించుకొని బావురుమంది. సీతమ్మ సముదాయించింది. "పెద్దవారు" అని ... "మహారాజులా పోయారు ఆయన కేమమ్మా" అని...

రెండు నెలలూ దుఃఖంతో, కొడుకుకూడా దగ్గర లేకుండా గడిపిన అనసూయమ్మ, సీతమ్మ పరామర్శతో, వారిరాకతో ఊరట చెందింది.

ఎలాగైనా సీతమ్మగారిరాకతో అనసూయమ్మ సంతోషించిందనే చెప్పాలి. ఆ సాయంత్రం అనసూయమ్మను "ఒకవారం పదిరోజులుండి వద్దువుగాని రావమ్మా ... ఆయనగారుకూడ మరీ మరీ చెప్పారు. ఆయనకు క్షణం తీరిక

లేదు. అందుకని నేనే బయలుదేరి వచ్చాము" అని చెప్పి తమ యింటికి తీసికొనిపోయారు.

సుందరరామయ్య బాగానే మాట్లాడాడు అక్కగారితో...మర్యాదలుకూడ బాగానే జరిగినై. అనసూయమ్మ బాగా సంతోషించింది తమ్ముడి మర్యాదలకు సత్కారానికి—అన్నగారి కుటుంబానికి తనమీదఅకస్మాత్తుగా పుట్టుకొచ్చిన అనుకంపకు తికమకపడినా, అనసూయమ్మ పూర్వపు కలతలకు స్వస్తిచెప్పి, వర్తమానంలో లీనమయింది.

* * *

తమ్ముడు, మరదళ్ళ ప్రేమకు, ఆదరణకు అనసూయమ్మ ఉబ్బితబ్బిబ్బైపోయింది. సుందరరామయ్య అంటే ఒకవిధమయిన గౌరవ భావము ఏర్పడింది ఆమె మనస్సులో.

అది కనిపెట్టి సుందరరామయ్య అన్నాడు ఒకరోజున మాటల్లో మాటల్లో.

"సీతారాం చదువు అయిపోవస్తూంది గదుటే అక్కయ్యా!"

"అవునురా...భగవంతుడి దయవల్ల ఇంతదూరం లాక్కొచ్చాడు..."

"అదయితే వాడికేం తక్కువే. కళ్ళకద్దుకుని ఉద్యోగం యిస్తారు వాడికి... నేనూ ప్రయత్నం చేస్తాను..."

తమ్ముడు సహాయం చేస్తాననేప్పటికి అనసూయమ్మ ఆనందం పట్టలేక అన్నది.

"ఎక్కడో అక్కడ ఉద్యోగం చూపిస్తివా వాడికీ నాకూ ఎంతో సహాయం చేసినవాడివి అవుతావురా!"

"మొన్న రంగమకూడ అన్నదే. బావ చదువు ఇంకొక సంవత్సరంకదా నాన్నా అని...ఏవో పట్టింపులతో సంబంధాలు చెడిసినా, అయినవాళ్ళంకదా ... అందులో రంగడికి నువ్వన్నా, సీతారాం అన్నా ఎంత అభిమానమనీ!"

అనసూయమ్మ ఉక్కిరిబిక్కిరి అయిపోయింది తమ్ముడి ఆత్మీయతకు.

"అదికాదురా, మొన్న సీతమ్మ ఏదో సంబంధమనీ, ఏదో అంటున్నది రంగడికి...ఎవరో చూడ్డానికి వస్తామన్నారట ... ఏమన్నా కబురందిందా వారెప్పు డొచ్చేదీ!"

"లేదే అక్కాయ్ ... అది తొందర చేస్తూనే ఉన్నది కనుక్కోండీ అని. నేనే అన్నాను మీ వదినను కనుక్కొని తరువాత చూడొచ్చులే అని. అది కాదే... నాకూ, దానికీ కూడా మనసులో ఉన్నది చెప్పొద్దూ. అయిన వాళ్ళ సంబంధం వదలుకొంటామా ... సీతారాంకు మన రంగడిని ఇద్దామని..."

ఇంతలో సమయానికి సీతమ్మ అటువచ్చింది...ఆమె కూడ అన్నది "రంగడు లేదమ్మా వదినా! దానికి సీతారాం అంటే ఎంత యిది అనుకొన్నావ్. మొన్న స్నేహితు రాళ్ళెవరోవస్తే అంటోంది. మా సీతారాం బావ గుంటూరులో బి. ఏ. చదువుతున్నాడని, త్వరలో వస్తాడని...

ఎంత అభిమానమో దానికి చెప్పొద్దూ!...సంబంధం కలుపుకుంటే బాగుంటుంది వదినా!"

"అంతకన్నానమ్మా! ... నాకుకూడ కావల్సిందే ముంది...నాకు మటుకు ఎవరున్నారు. రేపు సెలవల్లో వస్తాడు వాడు...చెప్దాం.తర్వాత మీవీలునుబట్టి..."అనసూయమ్మ ఆనందానికి మేరలేకపోయింది. సుందరరామయ్య తృప్తిగా గాలి పీల్చుకొన్నాడు. ఆయనకు ఒక పెద్దభారం తలనుండి దింపినట్లయింది. కొన్నేళ్ళుగా పీడిస్తూవచ్చిన రంగడివివాహ సమస్యకు ఇన్నాళ్టికి విముక్తి దొరుకుతోందని...

అనసూయమ్మ, కాబోయే కొడుకు పెళ్ళి; కొడుకు వివాహంతో లభించే సంపద, తమ్ముడి మంచి మనస్సు, మరదలి ఆదరణ...వీటితో అవ్యక్తమైన ఆలోచనలతో సతమతమౌతోంది.

ఆరోజు రాత్రి సీతమ్మ అన్నది సుందరరామయ్యతో... "ఎలా ఉన్నది ఆనాటి నా సలహా" అని.

"నాకు తెలుసునే ... నీది ఎలాగయినా తెలివిగల బుర్రే ... ఒకొక్కప్పుడు మందగిస్తుందికానీ" అన్నాడు సుందరరామయ్య నవ్వుతూ, సీతమ్మ బుగ్గమీద వేలుతో పొడుస్తూ.

అత్తయ్యతో జరిగిన సంభాషణవిన్న రంగమ్మ అంతరంగంలో ఏవేవో తియ్యని ఊహలు మెదిలాయా రాత్రి... కలలో రంగమ్మ ప్రక్కనే సీతారాం...

స్వార్థం పురివిప్పి నాట్యంచేస్తున్న ఈ సమాజంలో; సుందరరామయ్య తన స్వార్థం కోసం, విడనాడిన బంధు

త్వాన్ని మళ్ళీ కలుపుకున్నాడంటే ఆశ్చర్యంలేదు......
తను ధనికుడనే అధికృత, గర్వం; గౌరవ ప్రతిష్టలు...అన్నీ అతని స్వార్థం ముందు దిగదుడుపే అయ్యాయి. అవసరం ఏపనైనా చేయిస్తుంది. లోకంతీరే అంత.

పదిరోజులుండి అనసూయమ్మ, అన్ని గౌరవ మర్యాదలతో, లాంఛనాలతో ఇంటికి తిరిగి వచ్చింది సంతోషంతో.

ఈ రెండు కుటుంబాల మధ్య జరిగిన ఈ హఠాత్సంఘటనతో ఊరు ఊరూ ఆశ్చర్యపడిపోయింది...కొందరు సుందరరామయ్య స్వార్థాన్ని పసిగట్టి గుసగుస లాడక పోలేదు—

*　　　*　　　*

శారద, తల్లితోపాటు స్వగ్రామానికి వచ్చింది. తల్లితో అంతగా మాట్లాడడంలేదు. అంతా ముభావంగా ఉంటున్నారు. శారదతో చనువుగా మాట్లాడేవాళ్ళు లేక పోయినారు. తల్లికూడ భోజనం చేద్దువుగాని రమ్మని పిలవడం మినహా వెనుకటి ఆప్యాయత గనబరచడంలేదు ఇప్పుడు. తండ్రి సరేసరి. ఎప్పుడూ ధుమధుమలాడుతూ ఉంటాడు ఇంట్లోఉన్న కాసేపూను.

ఒక రోజున జానకి అకస్మాత్తుగా వచ్చింది శారద దగ్గరకు. జానకి మేనమామది శారద వాళ్ళ వూరు. శలవుల్లో మేనమామ యింటికి వచ్చిందట.జానకి శారద క్లాస్ మేటు.

జానకిని చూడ్డంతోటే శారదకు ప్రాణంలేచివచ్చింది. ఆప్తమిత్రులు దొరికినట్లయింది. ఆమెలో చచ్చిపోయిన

ఉత్సాహం ఉబికివచ్చింది. ఏదో పిచ్చాపాటి మాట్లాడను కోటాసికైనా దొరికింది కదా అని అనుకొన్నది శారద. ఎందుకంటే గుంటూరులో ఉండగా వారిద్దరికీ అంత పెద్ద స్నేహితంలేదు.

"రా జానకీ! ఎప్పుడొచ్చావు ఊర్నుంచి" అన్నది శారద.

"ప్రొద్దునే వచ్చాను. భోజనంచేసి నిన్ను చూసి పోదామని వచ్చాను" అన్నది జానకి.

"పరీక్షలు బాగా వ్రాశావా?" అంది జానకి.

"ఏదో బాగానే వ్రాశానే...కాని నా చదువుకు ఇంతటితోనే స్వస్తి అనుకుంటున్నా" అన్నది శారద. "పరిస్థితులేం సరిగ్గా లేవు జానకి" నిరుత్సాహంతో అన్నది.

"పరిస్థితులు అనుకూలంగా లేకపోతే వాటిని అనుకూలంగా మార్చుకోడానికి ప్రయత్నించాలేగాని అలా నిరుత్సాహపడతారా. ఇన్నాళ్ళు సీతారాంతో స్నేహం చేసి నీవు నేర్చుకొన్నది ఇదేనా" అన్నది జానకి నవ్వుతూ.

సీతారాంతో తనకున్న స్నేహం తనకూ శర్మగారికి తప్ప బయటి ప్రపంచంలో ఎవరికీ తెలియదనుకొన్నది శారద. జానకి సీతారాం ప్రసంగం ఎత్తేటప్పటికి ఆశ్చర్యాన్ని కనపర్చకుండా ఉండలేకపోయింది.

"నీవేమీ ఆశ్చర్యపడనక్కర్లేదు శారదా! నాకన్నీ తెలుసు. నీవు పడుతున్న ఆవేదనా తెలుసు. అలా దిగులు పెట్టుకోకూడదు శారదా. సీతారాంను అర్థంచేసుకోవడం కష్టం. అంతకంటే చాలకష్టం అతన్ని అనుసరించడం. దానికి

ఎంతో ఆత్మత్యాగం, సర్వపరిత్యాగం చేయాల్సిఉంటుంది. అవి నీవలన కానిపని. కాబట్టే నీదారిని నిష్కంటకం చేసి పోయినాడు. నీ కతనిమీద ఎంత ప్రేమ ఉందో, అతనికి నీమీద అంత అభిమాన ముంది. మక్కువవుంది. నిన్ను కష్టాలలో పెట్టడం అంత ఇష్టం లేదతనికి. అతని ఆశయాలు ఉన్నతమైనవి శారదా. ఎక్కడ వంచితనముందో—ఎవరు ఇక్కట్టులలో వున్నారో—ఎవరు అస్వతంత్రులో—సాంఘికంగా ఎవరు పతితులై వున్నారో - ఆర్థికంగా, సాంఘికంగా ఎవరు అణచివేయబడుతున్నారో—వారందరి మీదా అతనికి ఎంతో జాలి, అభిమానం. సూర్యుని కిరణాలు ఎల్లప్రాణులమీద ఎలా సమంగా ప్రసరిస్తయ్యో-అలాగే సీతారాం అభిమానంకూడా ఇంతమందీ సమంగానే పంచుకుంటారు. కాని నీహృదయం సూర్యుని కిరణాలకు వికసించు పద్మం నంటిది. సూర్యోదయం కొరకు ముకుళిత పద్మం తపస్సాధన చేస్తుంది.

"కాని ఆసాధన నీవలన కాదు. సీతారాంవంటి వ్యక్తిని ప్రేమించడం - ప్రేమింపబడటం, సుఖపడటం మటుకే తెలుసును నీకు. ఆ మహానుభూతికోసం తపస్సు చేయలేవు. తత్సాధనలో ఎదురయ్యే ఝంఝూమారుతానికి నిలబడ లేవు శారదా" అంది జానకి

ఝంఝూమారుతానికి జలజలలాడే మాధవీలత లాగా వణకిపోయింది శారద. అలాగే జానకిముందు కన్నార్పకుండా చూస్తూ ఉండిపోయింది. ఇంతగా సీతారాం గురించి చెప్పుతున్న జానకిని చూసి, సంభ్రమాశ్చర్యాలతో

ఒక వంక, తనకు, సీతారాంకు మధ్య ఏర్పడ్డ దూరం ఇంకా విస్తృతం కావటం వల్ల ఏర్పడ్డ విచారశోకా లోకవైపున, శారదను వెర్రిదాన్ని చేసినై. "జానకీ!" అంటూ రెండు చేతులు పట్టుకొని తన గుండెల కదుముకుంది.

"ఛా! విచారించకోయి శారదా! ప్రతి ప్రేమికులు ఎదుర్కోవాల్సిన పరిస్థితే యిది. సీతారాం ఆదర్శాలను అందుకోవడం ఎంత కష్టమో, సీతారాంను పొందగలగటం అంత కష్టం. ఒకవిధంగా చెప్పాలంటే అతని అభిప్రాయాలకు దగ్గరగా రాగలిగావు నీవు. కాని ఆరోజున మీ నాన్నగారు జరిపిన వ్యవహారంలో, సీతారాం విడిపోవాల్సి వచ్చింది. సీతారాం అనే మహావృక్షం నీకు ఆలంబనం కాగలిగింది కాని, అంతలోనే నీకు అందకుండా పెరిగిపోయిందా వృక్షం. అదేస్థాయిలో నీవు పెరగాలంటే నీ వెన్నో ఎదిరించాల్సివుంటుంది శారదా."

తమ ఇరువురి స్నేహం గురించే కాకుండా, ఆనాడు తన తండ్రి చేసిన అల్లరిని గురించికూడా జానకికి తెలిసినందుకు శారద చిన్నబుచ్చుకొన్నది.

"అయితే ఈ రహస్యాలన్నీ నీదాకా ఎలా వచ్చినయ్ జానకీ" అంది శారద.

అంతవరకు గంభీరంగా ఉన్న జానకి ముఖం ఒక్కసారిగా ముకుళించుకొనడం శారద గమనించింది.

"శారదా! నీవింకా చిన్నదానివమ్మా! అందుకనే నీవంత బెంబేలు పడిపోయినావు. సీతారాంకు నాకు చిన్నప్పటినుంచీ స్నేహం. హైస్కూలులోకూడా కలిసే

చదువుకొన్నాం. సీతారాంను నేనూ నీ మాదిరిగానే ప్రేమించాను ఒకప్పుడు. మా నాయనకు కుమారైనను నేనొక్కతె నేగా. మాకూ చాలా ఆస్తిఉంది. ఈ సంపదలే లేకుంటే అతన్ని ఎప్పుడో పొందగలిగేదాన్ని నేను.ఒకవిధంగా అతను ఆదర్శాలనే పాషాణపు మూసలో కఠినత్వం వహించటానికికూడ కారణం మన సంపదలే. లోకంలో మానవునికి,మరొక మానవుడికి మధ్య వున్న అగాధాలకు, అత్యాచారాలకు, అన్యాయాలకు మూలం ఈ దౌర్భాగ్యపు సంపదలే.ఒకడుసకలసంపదలోతులతూగుతుంటే, వేరొకడు, ప్రేమవిధూరుడై సానుభూతి విహీనుడై పోవాల్సివస్తున్నది. ఈ ఇరువురికి మధ్య అడ్డుగోడలు బాగా పెరిగిపోతున్నాయి. అతిసున్నితమైన మనస్సు సీతారాంది; అమిత చురుకు దనం దానికితోడుగా.అందుచేతనే ఈ అడ్డుగోడల ప్రభావం అతన్ని పూర్తిగా మార్చేస్తున్నది. అతన్ని పొందాలంటే ఆ అడ్డుగోడలు నిర్మూలించాలి — అతని ఆదర్శంకూడా అదే, ఈ అడ్డుగోడలు పడగొట్టడమే.''

ఇరువురి నయనాలనుంచీ అశ్రువులు ప్రవహిస్తున్నాయి.

ఒకప్పుడు జానకి సీతారాంను ప్రేమించినట్లు తనకు తెలియదు. కాని తన వ్యవహారమంతా జానకికి తెలిసింది. సీతారాం గురించి తనకు తెలియనివీ, తను తెలుసుకోలేనివీ, అతని ఆదర్శాలను, ఆశయాలనూ అన్నీ వివరంగా చెప్పగలిగింది. సీతారాంను తను దక్కించుకోవాలని జానకి వేసిన ఎత్తేమో యిది—అని ఒకవంక అనుమానం వేధిస్తు

న్నది. వేరొక వంక ఇకముందు ఈ పరిస్థితుల్లో తను చేయవలసినదేమో ఒక నిశ్చయానికి రాలేకపోతున్నది. ఇది జానకి ఊహాయేమో అనుకొందామంటే తను సీతారాంను ప్రేమించానని ఎందుకు చెప్పుతుంది. ఈ ఆలోచనలన్నీ ఆమెను కలచివైచినై...

"నీ సలహా ఏమిటో చెప్పు జానకీ..." అంది శారద.

"ఇంకొకళ్ళు చెప్పవలసిన సలహా కాదు శారదా! ఇప్పుడు నీవు పడుతునో వేదనంతా ఒకప్పుడు నేను పడ్డాను. సీతారాంను పొందగలగాలంటే అంత ఎత్తులకు మన ఆదర్శాలుకూడ పెంచుకోవాలి. భావైక్యంలోనే ప్రేమ సాఫల్యం వుంది. బాహ్యానికి ఇరువురూ ప్రేమించుకొని, వివాహమయిన తరువాత అతని అభిప్రాయాలు అతనివి, ఆమె అభిప్రాయాలు ఆమెవి. అయితే అది సంపూర్ణ ప్రేమకు దాంతీయదు. భగవంతునియందు ఐక్యం కావాలంటే ముందు భగవంతునికి ఆరోపించిన గుణగణాలను అలవర్చుకోవాలి. లేకుంటే భగవంతునిపొందడం దుర్లభం. అలాగే భావైక్యత లేనిదే ప్రేమ సమర్పణలేదు...తత్సాధనలో అడ్డంకులు విపరీతం నీకు. వాటన్నిటిని దాటగలగాలి నీవు...నే నాపని చేయలేకపోయాను. నేను సౌరభం మాత్రమే ఇవ్వగల పుష్పరాజాన్ని. ఏ మాత్రం వడగాల్పు సోకినా కంపించిపోతాను. కనుకనే నే నాయన్ని పొందలేకపోయాను. నీవు ధన్యురాలివి; ఆయనకు నీ మీద ఉన్న ప్రేమకు—ఒక్క కరుణాన్వితమయిన పలుకు కూడ

నేను ఆయననుండి పొందలేకపోయాను ... నీవు నిజంగా అదృష్టవంతురాలివి. నీకు తప్పక జయం కలుగుతుంది. సీతారాంను పొంది సఫలీకృతురాలు వౌతావు. ధైర్యంతో పరిస్థితుల్ని ఎదుర్కో" అన్నది జానకి గద్గదస్వరంతో.

జానకి హృదయనైర్మల్యానికి శారద మనస్సు కదిలిపోయింది. ఆమె పవిత్రహృదయానికి మనస్సులోనే నివాళు లర్పించింది. జానకిమీాద ఉన్న ఇదివరకటి అనుమానం పటాపంచలయింది. దానిస్థానే శారద హృదయం కరుణామృతంతో నిండిపోయింది. జానకిని అనవరసంగా అనుమానించినందుకు సిగ్గుచెందింది. 'చెల్లీ' అంటూ పట్టరాని వాత్సల్యంతో జానకిని కౌగలించుకొంది. ఇద్దరూ పరవశత్వంతో వున్నారు. అవి ఆనందభాష్పాలో, దుఃఖభాష్పాలో చెప్పలేము. బహుశః దుఃఖాతిశయంకూడా ఆనందమే అవుతుందేమో.

ఇంతలో శారద తల్లి రెండు గ్లాసులలో కాఫీ తెచ్చి యిచ్చింది ఇద్దరికి.

"అయితే పెళ్ళి ఎప్పుడు చేసుకొంటావమ్మా జానకీ?!" అన్నది శారద తల్లి.

"ఎప్పుడు చేసుకొంటావమ్మా అనవద్దు. ఎప్పుడు చేసారమ్మా అను పిన్నీ" అన్నది జానకి తార్కిక ధోరణిలో.

"ఏమో నాకేం తెలుస్తయ్యమ్మా! ఆ తర్కాలు వితర్కాలూ" అన్నది ఆమె.

"ఇందులో తర్కమేమున్నది పిన్నీ. పెళ్ళి చేసు

కోవలసినది, మాకు, నచ్చినవరుడు కాదుగా మీ పెద్దలకు కావలసింది: మీకు నచ్చిననాడిని మేము గ్రుడ్డిగా పెళ్ళి చేసుకోవాలిగా."

"మాకా మాత్రం బాధ్యత లేదా ఏమిటి. కని, పెంచి పదికాలాలపాటు సుఖంగా ఉండాలనే గదూ మా తాపత్రయంకూడా"

"అవును, మేము పది కాలాలపాటు పిల్ల, జల్ల, మనమళ్ళు, మునిమనుమళ్ళు చూడాలి. కాని మాకు వచ్చే వరుడు ఎలా ఉండాలో తెలుసా మీ ఉద్దేశంలో?! బాగా ఆస్తి ఉండాలి... బాగా చదువుకొని ఉండాలి. వాళ్ళ తల్లి దండ్రులకు ఒక్కడే కొడుకయి వుండాలి. అక్క-చెల్లెళ్ళుండ కూడదు. అత్తగారు మామగారు అంతకుముందే పోయి వుంటే మరీ ఒక క్వాలిఫికేషన్. ఆ కాబోయే వరుడు ఈ మామగారి చెప్పుచేతల్లో వుండేవాడయి వుండాలి. ఇవన్నీ చూస్తారు మీరు. అంతేగాని అసలు విషయం, వధూవరులిద్దరూ అనుకూల దాంపత్యం చేయగలుగుతారా, ఏ వడుదుడుకులు లేకుండా అనే ఆలోచన పోదు మీకు. ఎలాగో ఇంత ఆస్థిఉంటే చాలు!" అన్నది జానకి నిర్మొహ మాటంగా, ఎత్తిపొడుపు ధోరణిలో.

"అవునమ్మా ఆస్థిలేనివాడిని కట్టుకొని ఏం అనుభ విస్తారే. అసలు పూర్వం ఇంతగా వాదించేవారా, వెతికి తమకు నచ్చినవాణ్ణే కట్టుకొన్నారా ఏమిటి పెద్దవాళ్ళంతా. వాళ్లంతా సుఖంగా కాపరాలు చేయటంలా!"

"అవును వాళ్లంతా సుఖంగానే ఉంటున్నారు. బానిసబ్రతుకులో కూడ సుఖం వుందిగదా!"

"భర్త ఎటువంటివాడైనా భార్యకు అతగాడే పరమ దైవం. సీత, సావిత్రి, అనసూయ మొదలయిన పతివ్రతలే మనజాతికి ఆదర్శం జానకీ" అన్నది శారద తల్లి—

"నిజంగా, ఆదర్శంగా వాళ్ళనే తీసుకొంటే, మా ఆదర్శాలు అందుకేమీ భిన్నంగా లేవు. పురాణ స్త్రీలంతా తాము కోరిన వాళ్ళనే పొందారు. భర్త రాజ్యాన్ని వదలి అరణ్యాలకు వెళ్ళితే సీత మనవర్తి దావా వెయ్యలేదు పిన్నీ. భర్త రాజ్యాన్నీ సర్వస్వాన్నీ కోలుపోతే ద్రౌపది విడాకులివ్వలేదు. మనకాలపు పతివ్రతలు కాలంకలసిరాక భర్త బీదవాడైతే కోర్టుల కెక్కుతున్నారు. ఇక చాలా బీదకుటుంబాలు చాలవరకు అజ్ఞానంలోనే వున్నారు. వాళ్ళ అభిప్రాయాలూ, ఆదర్శాలూ అంటూ ఏమీ లేవు. వాళ్ళ ఆదర్శమల్లా ఏపూట కాపూట. తిండికి వెతుక్కోవడమే. వాళ్ళకీ సమస్యలే లేవు. ఒక జీవితసమస్య మినహా. వాళ్ళకు విడాకులు అవసరంలా. విజ్ఞానం లేనే లేదు" అన్నది జానకి.

"ఎంతసేపూ బానిస బ్రతుకులు, విజ్ఞానం ఇవేగా. మేమంతా బానిసల్లుగానే వుంటున్నామంటావా!" అంది ఆత్మవిమర్శన ధోరణిలో శారదతల్లి.

"మీలాంటి పెద్దలతో వాదించకూడదనుగాని, నిజం చెప్పాలంటే మీ కేసు స్వాతంత్ర్యం ఉన్నదో చెప్పండి ఈ ఇంట్లో. ఏదో ఇంత వండి పెట్టడం. లేకుంటే ఇంత తినటం.

మీరు స్వతంత్రించి ఒకపని చేయగలుగుతారా అని. మీరే కాదు. అందరు స్త్రీలవిషయం అంతే, మధ్యతరగతి కుటుంబాలల్లో. ఒక్క విషయం అంటాను, కోపం పెట్టుకోకండి. సీతారాంతో మా శారద సంబంధం మీకు ఇష్టమే అనుకొంటాను. మీరిద్దరూ తల్లీకూతుళ్లు వాంఛిస్తున్న విషయాన్ని మా బాబాయి త్రోసిరాజు చేయగలుగుతున్నారు.

"ఆ త్రోసిరాజనడం సహేతుకంగా అయితే మంచిదే...బీదవాడు, ఇష్టంలేదుఅంటే అర్థంలేదు. పట్టుదల, తనపంతం నెగ్గాలి. అంతేగా. మీరేమయినా కాదనగలుగుతున్నారా? ఏం, మీకున్న ఆస్తి చాలదూ. ఆ యిద్దరూ ఒకళ్లనొకళ్లు తగినవాళ్లు. సుఖమైన సంసారం వెళ్లబుచ్చగలరు" అన్నది జానకి.

"పెద్దవాళ్లమాటను కాదనడం ఏమంత గౌరవప్రదమైన విషయంకాదు. జానకీ"

"అవును, బిడ్డలఅభిప్రాయాలకుకూడా విలువయిచ్చినంతవరకూ, పెద్దల అభిప్రాయాలకూ విలువ ఇవ్వవలసిందే. రాణి సంయుక్త కోరిన వరుడు తక్కువ వాడేమీ కాదు. ఆమె కోరికను పెద్దలు మన్నించి వుంటే భారత జాతి చరిత్ర మరొక విధంగా ఉండేది. జయచంద్రుని ఈర్ష్యాద్వేషాలే స్త్రీజాతిని తరతరాలుగా బానిసలుగా చేసినై. స్త్రీజాతి బానిసత్వంతోబాటు యావద్భారతమే అస్వతంత్రమైపోయింది."

తరువాత ముగ్గురూ ఆలోచనలోనే ఉండిపోయారు

గంభీరముద్రదాల్చి. శారదమాత్రం మాటలు వింటూందే కాని నోరు మెదపడంలేదు. జానకి మళ్లీ ఎత్తుకొంది తర్కం.

"కాదు పిన్నిగారూ. మళ్లీ స్త్రీజాతి మేలుకొన్నది. స్త్రీజాతితోపాటు యావద్భారతమూ మేలుకొన్నది. దాస్యంలో ఉంచడం ఇంకెవళ్లకూ శక్యంకాదు. భారత దాస్యవిముక్తితోబాటు భారతనారి దాస్యవిముక్తికూడా ఇంకా ఎంతోదూరం లేదు" అన్నది జానకి. శారద తల్లి మౌనాన్ని ఆసరాగా తీసుకొని, ఎలాగయినా ఒప్పించాలనే పట్టుదలతో.

"ఈ ఇంగ్లీషు చదువులతో మాబోటివాళ్ళం మాట్లాడేందుకు వీలులేకుండాకూడ పోతున్నది."

"ఒక అన్యాయాన్ని అసత్యాన్ని నిరసించటానికి ఒక ఇంగ్లీషు చదువే అవసరంలేదు పిన్నీ. అది అన్యాయమని తెలిసీ న్యాయపథానుగామి కాకుంటే వేదాలు వల్లించినా ప్రయోజనం లేదు"

సీతమ్మగారికి ఇంక వాదనాప్రతిభ పోయింది. మామూలు తేలిక ధోరణిలో అన్నది, "ఇంతకీ నీ వెవరిని వరించావమ్మా జానకీ?!"

జానకి ఈ హటాత్ప్రశ్నకు కొంచెం కంగారు పడ్డది. అంతవరకూ పిచ్చవాదనలు వింటున్న శారద అన్నది..."సీతారాంను ప్రేమించింది"

శారదతల్లి నిర్విణ్ణురాలయింది. ఇప్పుడు వాదనకు మంచివీలు చిక్కింది. "అయితే ఆ స్త్రీ జనోద్ధరణ,

దీనజనోద్ధరణ నీవే చేయలేకపోయావా జానకమ్మ తల్లీ" అన్నదామె.

ఆమెమాటలలో కొంత ఎద్దేవ ధ్వనించింది. ఆ మాటలు జానకిమనస్సుకు శూలాల్లా తగిలినై సూటిగా వచ్చి. ఖిన్నురాలయింది. "ప్రభూ! ఈ అంధకారంలో ఉన్న భారతనారీజాతి ఉద్ధరణ చేయలేవా!" అనుకొన్నది మనోంతరాళంలో. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయినవి.

"అవును నేను సీతారాంను ప్రేమించాను. అతని కొరకు నేనే పనైనా చేయగలిగేటంతగా ప్రేమించాను. అతని సుఖంకోసం ఏ త్యాగమైనా చేస్తాను. అతని సుఖం కోసే శారదను అర్థిస్తున్నాను పిన్నీ." అన్నది జానకి.

శారదతల్లికి కళ్ళు అశ్రుపూరితాలయినవి. జానకి స్వచ్ఛవదనం, ఆమె నేత్రాల్లోని త్యాగజ్యోతిని చూచికాని జానకి మాటలలోని తర్కం ఆమెకు అర్థం కాలా. ఆమె పవిత్ర హృదయానికి ఆశ్చర్యపడ్డది. అన్నది, "నీవు ప్రేమించానంటివి కదటమ్మా జానకీ!" అని.

'అవును పిన్నీ. కాని సీతారాం అనే ఒక ప్రచండ మారుతాన్ని అదుపులోపెట్టి మలయమారుతం అనుభవించ గలిగే శక్తి శారదకుమాత్రమే ఉంది. సీతారాంలోఉన్న ఆ ప్రచండ మారుతమే నాలోనూవుంది. కాబట్టి కుదరదు. సీతారాంలోవున్న ఆ మహాశక్తిని, విప్లవాగ్నిని సరియైన నిర్మాణాత్మకపంథాలో నడపగలశక్తి శారదది. కాని చురుకుపాలు తక్కువ శారదలో. విప్లవశక్తికి చేదోడుగా నిర్మాణాత్మకమైన శక్తే వాంఛనీయం. అందుచేతనే నారి

దరిలో భగవత్ప్రేరితమైన ప్రేమాంకురం జరిగింది. ఇక నా సంగతంటావా — రెండు విప్లవశక్తుల చేరికవల్ల ఏ నిర్మాణాత్మకమైన పనులూ చేయలేం. అందువల్లనే నేనేనాడో దూరంగా తొలగిపోయాను సీతారాంనుండి. శారదకు ఆదర్శం ఎప్పుడూ సీతారాం మాత్రమే. మీ పెద్దవాళ్లు మా కోరికను మన్నించాలి పిన్నీ!'

ఈ పిల్ల వాక్చాతురి చూస్తూ శారద తల్లి ఆశ్చర్య పడింది. వాళ్ళ కార్యదీక్షకు ఆమె తనువు పులకించింది. జానకి త్యాగబుద్ధికి మనస్సులోనే ఆశీర్వదించింది. సీతారాం గుణగణాలను వింటుంటే, అదివరలో అతనియందున్న అల సత్వం తొలగిపోయింది. కోటికిరణ ప్రభాసంతో సీతారాం ఒక మహావ్యక్తిగా స్ఫురించాడు. ఆ మహావ్యక్తిత్వం చెంత, శాంత స్వచ్ఛస్ఫటిక ప్రభాభాసురమైన తన ముద్దుల కూతురు శారదను పోల్చిచూచుకొందామె; పార్వతీ పరమేశ్వరులు స్ఫురించారు. ప్రజానీకమంతా ముక్కోటి దేవతలుగా కనిపించారు. ఆ క్షణంలో ఈ ద్వేషం, ఈర్ష్య, ధనం అన్నీ తుచ్ఛాలయినవి ఆమెకు. ఆపవిత్ర స్ఫురణలో, ఆ దివ్యప్రేమ భావనలో ఆమెకు సింహాసనస్థమైన సీతారాములు గోచరించారు. ఆమెజీవితంలో తెలియనిపవిత్రానుభూతి పొందింది. జానకి చెప్పిన ప్రతివాక్యం ఒక దివ్యసందేశంగా భావించిందామె ... ఆమె నలభైఏళ్ళజీవితంలో ఇంతటి అనుభూతి, శరీరక వాంఛలకు అతీతమైన దివ్య ప్రేమానుభూతి అననేమో తెలియదు. భావ స్వాతంత్ర్యం అంటే ఏమిటోకూడ తెలియ దామెకు. ఈ దివ్యదృశ్యం

ముందు ఆమె జీవితం—నిజానికి ఆమె ఒక్క జీవితమేకాదు, చాలామంది జీవితాలను పోల్చిచూచుకొన్నది. కామతృప్తే ఆదర్శం—ఉదరపోషణే ... ముఖ్యోద్దేశం ... పురుషుడనే అహంకారం... స్త్రీకిఅబలననే నిస్సహాయత–ధనకాంక్ష... ధనం కొని తెచ్చే పనికిమాలిన వ్యథ...దర్పమూ ... వీట న్నిటినీ...పవిత్రప్రేమ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, ఆదర్శ జీవితం, లోకకల్యాణం, అనే పవిత్రగానం తుచ్ఛ ప్రేరణ లను తూలికతంచేసినై. రోమాంచమైందామెకు.

"జానకీ నీవొక దివ్యమూర్తివమ్మా." అంటూ కౌగ లించుకొన్నది. ముగ్గురూ పవిత్రానుభూతిని పొందారు. ఈ క్షణంలో శారద, జానకిలకంటే, శారద తల్లి చాలా ఉదాత్తమైనది. ఆమెలో కనుడు కట్టిన సనాతన సురభి ప్రాయాలకన్నిటికీ అతీతురాలు కాగలిగింది. ఎంతో ఆత్మ విమర్శనా పటిమవుంటేగాని ఈ అభిప్రాయా లకు రాలేరు సామాన్యులు. ఇప్పుడామెకు ఏవీ సమస్యలే కావు. ప్రతివిషయమూ నిజమైనదృక్పథంలో చూడగలదు. ఘనీభవించిన సనాతన కట్టుబాట్లు, ధనగర్వం, ఇలాంటి కాలమేఘాలను ఒక్క మెరుపులో చెదరగొట్టగలగడమే ఆమెలోని విశేషం. శారద, జానకిలాంటి వ్యక్తులలో ఈ సనాతన భావాలన్నీ క్రమక్రమంగా లోకపు పోకడలు తెలుసుకొన్నకొలదీ విడిపోయినవి. శారదతల్లి వీటన్ని టిని ఒకప్రచండ విద్యుత్ప్రేరణతో నిర్మూలించగలిగింది. అందుచేతనే ఆమె భావోద్వేగత ప్రశంసమైంది.

ఆ పవిత్ర భావస్ఫూర్తి క్షణికమేమో! ఆ విప్లవజ్యోతి

శారద జీవితంలో ఎలాంటి మార్పు తేగలుగుతుందో చూడాలి!!

కొంతసేపు అవ్యక్తమైన స్తబ్ధతలో మునిగి, ఆ పవిత్రానుభూతినుండి తెప్పరిల్లుకొన్నారు.

"ఇవాళ నిజంగా చాల గొప్ప రోజమ్మా జానకీ! నా శోక తత్వోపదేశం చేశావు. శారద, సీతారాంను ఒకరించటానికి నా అభ్యంతరమేమీ ఉండబోదు" అన్నదామె ప్రకాశంగా.

"ఇక ఎవ్వరి అభ్యంతరాలు కలుగకుండా చూసే బాధ్యతకూడా మీదే పిన్నీ" అన్నది జానకి. ఆనందంతో ఆమె చివాలున లేచి నుంచుని "ఈరోజు నాకూ చాల గొప్పదే, పిన్నీ. ఒక మంచుపర్వతాన్ని కరిగించి సౌమ్య వాహిన్ని దానిగుండా ప్రవహింపచేయగలిగాను" అన్నది తిరిగి ఆమె చేతుల్ని పట్టుకొని ప్రేమతో నొక్కుతూ.

'భగవదేచ్ఛ తల్లీ!' అన్నారామె అచంచల విశ్వాసంతో.

శారద సంతోషానికి మేరలేదు. జానకి రాకముందు తనకంతా వ్యతిరేక వాతావరణమే ఒకగంట క్రితంవరకూ. ఇప్పుడు తన కష్టసుఖాలలో పాలుపంచుకోటానికి భగవత్ప్రేరణవల్ల జానకి దొరికింది. వ్యతిరేక అయిన తల్లితో తన మనసులోని బాధనుకూడా చెప్పుకో వెరచింది తను అంతకుముందు—ఇప్పుడు తన తల్లే తనకోరికలకు అండగా నిలబడింది. శారద, జానకి ఉదాత్త గుణాలకు నివాళులిచ్చింది మనస్సులోనే. ఆమె శారదను చిరపరిచితురాలే

గాని, ఆమె మనోభావాలను ఇంతగా ఎప్పుడూ తెలిసికోని ఉండలేదు శారద. 'ఈ కుంటిబిడ్డను ఒడ్డుకు మళ్ళించగల చుక్కానివి నీవు దొరుకుతావని ఎప్పుడూ అనుకోలేదు చెల్లీ! ఇంతమంచి చెల్లి నిచూచి ఒకప్పుడు ఈర్ష్యకూడా చెందాను. పాపిష్టిదాన్ని, క్షమించు జానకీ' అన్నది శారద.

శారద చేతిని తీసుకొని చుంబించిన జానకి 'నేను వస్తా పిన్నిగారూ!' అంటూ వెళ్ళిపోయింది. 'ఇవాళ్టికి ఇక్కడే ఉండవమ్మా' అని శారద తల్లి బ్రతిమిలాడినా వినలేదు. 'ఇంకోరోజు ఉంటాలే పిన్నీ సెలవలేగా!' అంటూ బయలుదేరింది జానకి.

* * *

సీతారాం చికాకు పడిన మనస్సుతో ఇంటికి వచ్చాడు...

శారద ఏమనుకొన్నదో...అంతగా మనసిచ్చి ఆప్తురాలయిన ఆమెకు వచ్చేప్పుడుకూడా మాటమాత్రం చెప్పకుండా వచ్చాడు తను. తన అదృష్టం ఎలాఉందోగాని... పరీక్షలముందు అన్నీ గొడవలతోనే గడిచిపోయింది ... అందరూ ఆశించినంతగా తను ఉత్తీర్ణుడు కాలేడేమో. కనీసం మామూలుగానైనా ఉత్తీర్ణుడు కాలేకపోయాడు...చూడాలి గీతలో ఎలాఉందో. ఎడతెగని ఆలోచనలతో సతమతమౌతున్నాడు సీతారాం.

అనసూయమ్మగారు తను తమ్ముడింటికి వెళ్ళివచ్చిన సంగతి...తమ్ముడితో సంబంధం...ఎప్పుడు సీతారాంతో చెప్దామా అని ఆతృతగా ఉన్నది...

భోజనం చేస్తున్న కొడుకుతో అన్నది అనసూయమ్మ...'నెలరోజులనుండీ నువ్వెప్పుడొస్తావా అనేరా అబ్బాయ్. మొన్న మామయ్యగారింటికి వెళ్ళొచ్చాను'

సీతారాం స్తంభించిపోయాడు. కొన్ని సంవత్సరాల తరబడినుండీ తెగిపోయిన బంధుత్వం, దగ్గరకు రావడం అకస్మాత్తుగా తల్లి నోటినుండి వినడంతోనే... సీతారాంకు సుందరరామయ్యను మామయ్యగా పరిగణించాలంటేనే అసహ్యం. తండ్రి గుణగణాలను, అలవాట్లను పుణికి పుచ్చుకొన్న సీతారాం తల్లిమాట వినడంతోనే నిలువునా కంపించిపోయాడు. "ధనమదంతో కళ్ళు పొరలుక్రమ్ముకుపోయిన సుందరరామయ్య చివరికి తండ్రి చనిపోయిన తరువాత ఇప్పుడిలా దరిజేరాడా!" అని ఆలోచించాడు సీతారాం.

'నువ్వెందుకు వెళ్ళావమ్మా!...జరిగిన అవమానం చాలకనా' అన్నాడు తమాయించుకుని.

'మొదట నే వెళ్ళలేదురా. అత్తయ్య, రంగడూ ఇద్దరూ ఒక మధ్యాహ్నంనాడు వచ్చారు... తరువాత రమ్మని బలవంతంచేస్తే వెళ్ళక తప్పలేదురా అబ్బాయి. ఎంత ఆప్యాయతగా మాట్లాడారనుకొన్నావ్. మంచి మర్యాద జరిపారనుకో'

'వాళ్ళ ఆప్యాయతకు, మర్యాదకు నువ్వే సంతోషించాలి. ఇదివరకేమయిపోయింది ఈఆప్యాయత? ముందు మనకి బుద్ధిపుండాలి' అన్నాడు కొంచెం కోపంతోనే సీతారాం తమాయించుకోలేక.

'ఎలాగయినా అయినవాళ్ళు అయినవాళ్ళే. ఇదివరకు మాట్లాడలేదని, దూరంగా ఉన్నారని, లోపలవుంచుకొని, ఇప్పుడు వచ్చి మాట్లాడినప్పుడు బెట్టు చేస్తావుట్రా అబ్బాయ్!'

'నువ్వేమైనా చెప్పమ్మా. ఇంతవరకు శత్రుత్వం పూనినవాళ్ళు ఇప్పుడు ముసిలాయన పోయిన ఆర్నెల్లకు వచ్చి మాట్లాడాల్సిన అవసరమేమొచ్చింది? అయినా, నీకూ పోలేదు; మమకారం. నేనున్నట్లయితే చెప్పేవాడ్ని; తలవాచేటట్లు; దరిద్రులు'

'అది కాదురా. ఎంతచెడ్డా మేనమామేగదా. బాగా ఉన్నవాడు. ఇప్పుడు పిల్లనిచ్చి నిన్ను అల్లుడ్ని చేసుకో డానికి సిద్ధంగా ఉన్నాడు వాడు.'

'సిగ్గులేకపోతేసరి, నీకు మతి సరిలేకపోతే నాకు మాత్రం ఉండదేమిటి. గడపత్రొక్కితే 'ఏ మొహంపెట్టు కొని వచ్చావయ్యా...ఇది లక్షాధికారుల కొంపకాదు. ఇంకెక్కడికన్నా ఊరేగు' అని చెప్పి మరీ పంపుతాను. ఇందుకా తల్లీ అంత ప్రేమగా ఇంటికివచ్చి మరీ తీసుకు పోయారు నిన్ను. వెధవబుద్ధిపోలా. ఇంతకీ ఆరాక్షసికి సంబంధం దొరకలేదా ఏమిటి మనపాలిట బడ్డాడు'

తమ్ముడిమీద అమితమైన మమకారంకల అనసూయమ్మ కొడుకుమాటలతో రెచ్చిపోయింది కోపంతో.

'కావాలంటే నీబోటివాళ్ళని వందమందిని తెస్తాడు. ఎవ్వడూ దొరకక్కాదు...మనతో సంబంధం కలుపు కోవాలని ఎప్పటినుండో ఉన్నది వాడికి.'

'వందమందినికాకపోతే లక్షమందిని తెచ్చుకోమను. ఆయనదగ్గర డబ్బుంటే ఉండవచ్చునుగాక. ఆయనకు వశికే దెవ్వరూ ఇక్కడలేరు. ఆయన అక్కర్లా, ఆయన సంబంధం అవసరంలా. వాళ్ళు మనయింటికి రానవసరంలేదుకూడ. నువ్వు ఈమాట చెప్పెయ్. నువ్వు చెప్పలేకపోతే నేను చెప్పగలను.'

'పిచ్చిపట్టుదలలుపోక సమయానుకూలంగా వ్యవహరించాలిరా. నువ్వు రంగమ్మను చేసుకోవాలి. దానికికూడ ఇష్టమేట. ఆస్తి వస్తుంది. లోటుండదు.'

'పిచ్చిమాటలు మాట్లాడకే మరీనూ. నువ్వొరికే కలలు కనబాక. రంగమ్మను లేదు, సుబ్బమ్మను లేదు. ఆస్తి ఎవరికి కావాలి. ఇప్పుడు తిండి తినడంలేదా మనం. తిండికి మొహంవాచినట్లు. ఏమిటి, ఆ దరిద్రపు సంబంధం అనవసరం.'

ఆ రాత్రంతా సీతారాం ఎడతెగని ఆలోచనలలోనే గడిపాడు. అక్కడ శారదకు తనకు మధ్య అకస్మాత్తుగా ఇనుపతెరలు బిగింపబడినయ్. ఆ విషయం ఎంతవరకు సానుకూలపడ్తుందో మనం చెప్పలేకుండా తయారయింది. సెలవలుగదా, అని మన స్తిమితంకోసం ఇలావస్తే ఇక్కడకూడ ఏదోఒక గొడవ. ప్రపంచమంతా స్వార్థంతో నిండిఉంది. మానవుని ప్రతి అణువులోనూ స్వార్థం పురివిప్పి నాట్యం చేస్తున్నది. ఇప్పుడూ ఆ నీచమైన స్వార్థంతోనే సుందరరామయ్య నీతి నిజాయితీ, సిగ్గూ బిడియమూ లేకుండా, తెగిపోయిన బంధుత్వాన్ని కలుపుకో చూస్తున్నాడు. ఆ

కుటుంబానికి తమకు బంధుత్వం కలవడం కలలోసంగతులు. సుందరరామయ్య కూతుర్ని చేసుకోవడం కల్ల ... అమ్మ మాటలు వింటూఉంటే ఆమెకు తమ్ముడితో కలయడం ఇష్టంలాగానే ఉన్నది. అమ్మకు కోపమొచ్చినా సరే, తను వారిపొత్తు అభిలషించడు. కొన్నాళ్ళుపోతే బి. ఏ. సంగతి తేలుతుంది. ఎక్కడైనా ఉద్యోగం చూచుకొంటే; బండి ఒకదారికొస్తుంది. అదృష్టం బాగుంటే శారద తనకు దక్కుతుంది. లేకపోతే తను జీవితాంతం బ్రహ్మచారిగా గడుపుతాడుకాని, వివాహం చేసుకోవడం జరగని విషయం.' అనుకొన్నాడు సీతారాం...

తెల్లారి సీతారాంకు, అనసూయమ్మకు పూర్తిగా ముభావంగా గడిచిందనే చెప్పాలి. సీతారాంనుండి మంచి జవాబును ఆశించిన అనసూయమ్మకూ, అతని ద్వేషమూ, తిరస్కారమూ గ్రహించినమీదట; నిరాశ చెంది, సీతారాం అంటే కోపంగలిగింది. ఆడవాళ్ళు పుట్టింటిమీద మమతానులను వదులుకోలేరు. కొడుకు వారితో సంబంధాన్ని ఇష్టపడకపోవడమేగాకుండా చివరికి ఇష్టమొచ్చినట్లు తూలనాడాడు వారిని. అందుకని అనసూయమ్మ సీతారాంమీద ప్రేమ చూపలేకపోతోంది.

♦ ♦ ♦

సాయంత్రం అయిదుగంటలవుతోంది. సీతారాం పేపరు చూస్తున్నాడు. అనసూయమ్మ ఇంట్లో ఏదోచేస్తోంది. ఇంతలో సుందరరామయ్య దర్పంతో హుందాగా లోపలికొచ్చి 'అక్కయ్యా!' అని అనసూయమ్మను పిలిచాడు.

ఎవరా అని సీతారాం ఇవతలికివచ్చి చూశాడు. సుందరరామయ్య. అతనికళ్లు ఎర్రనై వుగ్రరూపందాల్చినై. అతనిమీద ద్వేషం పెల్లుబికి వచ్చింది. కుత్సితుడు, ధన మదాంధుడు. గర్విష్టి. అతనిమీద ద్వేషంతో సీతారాంకు మాట్లాడడానికికూడా యిష్టపడలా. కాని కోపంపట్టలేక అరిచాడు "ముందు గడపదిగు. ఎందుకు వచ్చావ్!" అని.

సుందరరామయ్య ఇలాంటి పరిస్థితి తటస్థించుతుం దని ఆశించి ఉండడు నిర్విణ్ణుడై అడుగుకదపలేకపోయాడు.

"వెళ్ళవయ్యా! ఎందుకొచ్చావ్. ఇది బీదవాడి కొంప. నీలాంటి డబ్బున్నవాళ్ళు రాగలిగేది కాదు!"

అనసూయమ్మ వచ్చి పరిస్థితిచూచి అచేతనురాలయి పోయింది. "ఏమిట్రా అది. ఎంత మాట పడితే అంత మాటేనా? నువ్వెవరివి వాడ్ని పొమ్మంటానికి."

"నువ్వు మాట్లాడబోకు. నీపని నువ్వు చూచుకో..." అనసూయమ్మతో అని సుందరరామయ్య వైపు చూస్తూ 'మీకూ మాకూ ఎటువంటి సంబంధాలూ లేవు. నువ్వెవరరో, నే నెవరో. ఆ ఆశ వదులుకో. ఈ యింటి గడప త్రొక్కే సాహసం చేయబోకు ఇకముందు. మీరూ మీడబ్బు గంగలో కలవండి పోయి. సిగ్గులేకుండా ఎలా రాగలిగావ్.'

సుందరరామయ్యకు పాతాళానికి అణగారిపోయి నట్లనిపించింది. సీతారాం తండ్రిలాంటి అభిమానస్థుడు కాడనుకొన్నాడు తను. తండ్రికన్న రెండాకులు ఎక్కువే చదివాడు ఇతను. ఈసారి కూతురు పెళ్ళి చేసెయ్యవచ్చును

గదా అని ఆశపడ్డాడు. లోకం కోడైకూస్తోందాయె. అటు, ఎదిగిన పిల్లని ఇంట్లో ఉంచుకొన్నాడోహోయ్! అని... పరువుపోతోంది. సీతారాం అరుపులతో, సుందరరామయ్య ముఖం చిన్నపోయింది. ఈ రభస, దాగినపోయే వాళ్ళం దరూ చూస్తున్నారు. నామోషీ.

సుందరరామయ్య మారుమాట్లాడకుండా తలవంచు కొని ఇంటిదారి పట్టాడు అవమానభారంతో.

అనసూయమ్మలో దుఃఖం, పొంగి పొరలి కట్టలు త్రెంచుకొన్నది—

తరువాత అయిదారురోజులు ఇద్దరికీ మాటలు లేకుం డానే దొర్లిపోయినై.

ఈ ఆరురోజులూ సుందరరామయ్య అవమానంతో వీధి మొహం చూడలేకపోయాడు.

సీతారాం దినచర్య సబ్బుగా జరిగిపోతున్నది. ఎవరి పనులు వారు చేసుకుపోతున్నారు. కాని మాటలు లేవు అనసూయమ్మకూ సీతారాంకు. ఆమెకు కొడుకుమీద అమితమైన కోపంగా ఉన్నది తనమాట పెడచెవిన పెట్టా డని. తను చెప్పినట్లు చేసినట్లయితే బోలెడు ఆస్తి వచ్చేది. ఆమె మనస్సు అంతా, ఆస్తి, డబ్బు; తమ్ముడి కూతురితో కొడుకుపెళ్ళి, వీటిచుట్టూ నిరంతరం పరిభ్రమిస్తున్నది.

ఈ వారంరోజులూ మనస్సు అశాంతితో సతమతమై పోయిన సీతారాంకు ఇంకా ఆ ఊరిలో ఉండబుద్ధి కాలేదు. ఇంట్లోఉన్నా ఎవ్వరూ హృదయం విప్పి నవ్వుతూ మాట్లాడలేదు. అమ్మ శత్రువును చూచినట్లు చూస్తూ,

ముభావంగా ప్రవర్తిస్తున్నది. ఇక్కడ ఇలా చికాకుపడిపేకన్నా ఒకసారి గుంటూరు వెళ్ళి శర్మగారిని, తెలిసినవారిని కలుసుకొనివస్తే బాగుంటుం దనుకొన్నాడు సీతారాం.

వెంటనే ఆ సాయంత్రమే బయలుదేరాడు గుంటూరుకు. అనసూయమ్మ మెదలకుండా ఊరుకొంది మాట్లాడకుండా. సీతారాంకూడా ఏమీ చెప్పలేకపోయాడు.

♦ ♦ ♦

ఇంతవరకు చెప్పి మూర్తిగారు దీర్ఘంగా నిట్టూర్చారు. 'నిద్ర వస్తున్నదా మురళీబాబూ!' అన్నారు మురళివైపు చూస్తూ.

"లేదు బాబుగారూ, చెప్పండి. సీతారాం కథ చాల ఉత్సుకత కలిగిస్తున్నది. కాని మీ ఆరోగ్యం చెడిపోతుందేమో బాబుగారూ!"

"నాదేంటోయ్ ... పగలల్లా నిద్రేగదా. నాకేం కష్టంగాలేదు. నీకే శ్రమ. సీతారాం గాథను ఇహ క్లుప్తంగా ముగిస్తాను మురళీ, విను." మాట్లాడుతుంటే మూర్తిగారి కనుకొలకుల్లో చిక్కని నీరు తళుక్కుమంది.

దూరాన రైలుకూత సన్నగా ధ్వనిస్తోంది. అర్ధరాత్రికూడా రైలున్నదన్నమాట. చెట్లసందులలోనుండి చంద్రుడి అమృత కిరణాలు నేలను చుంబిస్తున్నాయ్. ఇంతలో ఉధృతంగా గాలి వీచింది. గాలికి జాజిమల్లె జలజల లాడింది. గులాబిగుబురు గుబగుబలాడింది.

మూర్తిగారు తిరిగి చెప్పడం మొదలుపెట్టారు.

"కష్టాలు మంచు సంపరలలాంటివి...అకస్మాత్తుగా ఎండరాగానే మాయమవుతాయి. కొన్ని క్లిష్టసమస్యలు కూడ అంతే. అప్పటివరకు వాటి పరిష్కార విధానం తెలియక, ఎంతో మానసిక గ్లానికి గురి అవుతాము. కాని అకస్మాత్తుగా, ఎవరి ప్రమేయం లేకుండా ఆ సమస్యలకు పరిష్కృతి లభించినపుడు మన ఆనందసంద్రానికి చెలియలి కట్టలుండవు."

అలాగే అయింది మన సీతారాం పరిస్థితి, గుంటూరు చేరేదాకా; శారదకు తనకు గల అనుబంధబంధం పటిష్ట మవునో కాదో అనే సమస్య మహామేరు రూపం దాల్చి భయపెట్టింది అతనిని. అప్పటివరకు శారద అతనికి అల భ్యమూ; మృగతృష్ణచందమూ. కాని అతను గుంటూరు చేరి శర్మగారింటికి వెళ్లేటప్పటికి అతనికి అసాధ్యమనిపించిన వన్నీ సులభసాధ్యాలూ, సంతోషవార్తలు అయినై.

సీతారాంను చూస్తూనే శర్మగారన్నారు. "అదీ.. అలాగుండాలి. వెయ్యేళ్లాయుస్సు నీకు సీతారాం. నిన్నటి నుండీ శారద గోలచేస్తోందోయ్, నీ అడ్రసు నగయిరాల కోసం. శారదవాళ్లు ఇక్కడే ఉన్నారు."

అసలు సంగతేమిటో సీతారాంకు బోధపడలా. శారద వాళ్ల స్వగ్రామం వెళ్లివుంటుంది. శర్మగారు వాళ్లిం ట్లోనే ఉన్నదని అంటున్నారు. అంతా అయోమయంగా ఉన్నది. సందిగ్ధంతోనే అన్నాడు సీతారాం, 'శారద వాళ్ళఊరు వెళ్లిందికదా శర్మగారూ!'

శర్మగారు నవ్వుతూ తన డ్రాయింగ్ రూమ్‌లోకి తీసి కొని వెళ్లారు సీతారాంను.

"అప్రను సీతారాం. శారద వాళ్లవూరు వెళ్లింది. మీ యిద్దరు అదృష్టవంతులు. అక్కడ శారద స్నేహితు రాలు, శారద కలిసి అవియిపి బోధించి శారద తల్లి పట్టు దలను సడలించేశారట. శారద సీతారాంను తప్ప యింకెవ్వరినీ వివాహం చేసికోదని, ఒక వేళ మనం వ్యతి రేకులమైతే పిల్ల జీవితాంతం అవివాహితగానే ఉంటుంది గాని; అనవసరంగా మూర్ఖపు పట్టుదలలతో దానిజీవితం నాశనం చేయవద్దని, శారద తల్లి దండ్రితో పోరి మీ వివాహా నికి సుముఖుణ్ణి చేసిందట. మొదట కొన్నిరోజులు గుని సినా చివరికి ఆవిడ బలవంతాన పోరగా పోరగా ఒప్పు కొన్నాడట. వాళ్ళందరూ ఇక్కడకే వచ్చేశారు. మా యింట్లోనే జరుపుకొందాం మీ వివాహం."

♦ ♦ ♦

సీతారాం వచ్చాడని, వివాహానికి సుముఖుడై నాడని, తెలిసి శారద చాల ఆనందించింది. ఆమె ఇప్పుడు పెళ్ళికూతురు. ఆమె యిప్పుడు సీతారాం కంట పడడం లేదు సిగ్గుచేత. సీతారాంకూడ ఈ అకస్మాత్ పరిణా మానికి ఆనందించాడు. తను కలలోకూడ ఆశించని ఈ ఫలితానికి, శారద పట్టుదలకు అచ్చెరువందాడు. ఇంటి వద్ద అమ్మ ఎలాగో ఈ వివాహానికి ఇష్టపడదు. ఆ పెళ్లి దాకా ఆమెకు తెలియకపోతేనే మంచిది అనుకొన్నాడు సీతారాం. శారదతల్లికూడ సీతారాంను ఆప్యాయతతో

పలుకరించి, అప్పుడు జరిగిన అవమానానికి క్షమాపణలు కోరుకుంది.

♦ ♦ ♦

శర్మగారింట్లోనే శారద సీతారాంల వివాహం శుభంగా జరిగిపోయింది. శుభలేఖ ఇంటికికూడ పంపారొకటి. మొదట సీతారాంతల్లి అనసూయమ్మ కొంత జంకేలు పడిపోయినా; తమాయించుకొని ఆమెకూడ కొడుకు వివాహానికి హాజరైంది. ఆమెకుకూడా అన్ని మర్యాదలతో, వివాహం ఏ లోటూ లేకుండా జరిపించారు శర్మగారు. రమణారావుగారు వివాహానికి రాలేదు. మొదట తన మాటలకు తల వూపి చివరికి సీతారాం సంబంధానికి సుముఖురాలయిన శారద తల్లిదండ్రులమీద, ఆయనకు కోప మొచ్చింది. బంతులాటలూ, అలకపాన్పులూ నాక బలీ అప్పగింతలూ వగయిరా లౌకిక కార్యాలన్నీ సక్రమంగా, సరదాగా జరిగిపోయాయి.

♦ ♦ ♦

ఆ రోజు రాత్రి...ఏ రోజు రాత్రికోసంమనిషి లోయూ వ్వాసం అందుకొస్తున్నదాది హృదయం ప్రవ్విళ్ళూరుతూ ఉరకలు వేస్తూ ఉంటుందో,ఏ రాత్రి రెండుపవిత్రాత్మలను దివ్యాను సంభాషం చేస్తుందో, ఏ రాత్రి మానవుని జీవితంలో నూతనోషస్సులను ప్రకాశింపజేస్తుందో...

...ఆ రాత్రి సీతారాం గదిలో పట్టెమంచంపైన పడేసి మధురోహాలలో మైమరచిఉన్నారు.

శారద విసీలకబరీబంధంలో మల్లెలు ముడిచాగు. అనంతాకాశంలోని నీలికాంతుల మధ్య తారకాసముదా యం లా జడలో మల్లెలు మెరవగా, మల్లెల సుగంధ పరిమళాల్లో, తొణుకుతున్న లావణ్య లహ రుల్లో, నునుసిగ్గు దొంతరలలో, తడబాటు అడుగులలో, అల్లసానివారి వరూధినిలా శారద గదిలో ప్రవేశించింది.

సీతారాం లేచివచ్చి శారదకు సుస్వాగతం చెప్పాడు. ఎనుకుగా అనురాగంతో, సిగ్గులో కుంగిపోతున్న ముఖాన్ని పైకెత్తుతున్న సీతారాం పాదాలను స్పృశించి కళ్ళకద్దుకొన్నది శారద.

"ఛా!... ఏమిటి శారదా అది"

"మీరు నా కోటి తపస్సుల ఫలం!"

"నీవు నా భాగ్యదేవతవు శారదా! నా భావి జీవి తానికి మెరుగులు దిద్దడానికి నీవు దోహదం చేయాలి.!"

సీతారాం ఆనందానురాగంలో శారదను అక్కున జేర్చుకొన్నాడు.

"ఈ రోజునుండి నీవు బీదదానివి అయినావు శారదా!"

"అశాశ్వతమయిన ఆ ధనంకన్న, మీ పవిత్ర స్నేహసాంగత్యాలే నాకు కావలసింది. మీరు నాకు లభిం చడం, కోటి ధనరాసులు లభించడంతో సమానం. మీ ఆదర్శాలలో సర్వదా నేను ఏకీభవిస్తాను. మీకు చేయూతనిస్తాను." అన్నది శారద అచంచల విశ్వాసంతో.

శారదతండ్రిగారు కొంత పొలం, డబ్బూ సీతారాంకు కట్నంకింద ఇస్తానన్నా అతను ఒప్పుకోలేదు. శారదకూడ సీతారాంనే సమర్థించింది. శర్మగారుకూడా ఇద్దరికి నచ్చ చెప్పడానికి ప్రయత్నించి విఫలులయ్యారు. శారద తల్లిదండ్రులు కొంచెం బాధపడ్డా, తర్వాత సమాధానపరచుకొన్నారు. సీతారాం స్నేహితులు, ఇతర లెక్చరర్లు, సీతారాం ఆదర్శానికి, శారదతో వివాహానికి మనఃపూర్తిగా అభినందించి, చాల కానుకలు బహూకరించారు.

సీతారాం శారదను తన గ్రామం తీసికెళ్ళే రోజు శారద తండ్రి పక్కకు పిలిచి అన్నాడు.

"చిన్నప్పటినుండీ నిన్ను పువ్వుల్లో పెట్టి పెంచాం తల్లీ! నీ మనఃపూర్తిగా ఈ వివాహమయిందని నాకు తెలుసు. కాని నాకేదో వెలితిగా ఉన్నది. అతనేమో లాంఛనాలు తప్ప ఏమిస్తానన్నా తీసుకోలేదు. నువ్వూ అలాగేఅన్నావు. మరిమీగురించి నాకు బెంగగానేఉంటుంది. నువ్వెలా గడుపుతావో అక్కడ!"

"ఆడపిల్లయిన తరువాత ఒకరింటికి ఎప్పటికయినా వెళ్ళక తప్పదు నాన్నా! నాకేం ఫరవాలేదు. వారేమీ తీసికోలేదని ఏమీ అనుకోబోకండి. నా గురించి మీరు బెంగపెట్టుకోవద్దు నాన్నా! మీ మనస్సు నొప్పించినట్లయితే క్షమించండి మీ కూతుర్ని!"

శారద తండ్రి దుఃఖం ఆపుకోలేక ఉత్తరీయం నోటికి అడ్డం పెట్టుకొని, కన్నీటిని తుడుచుకొన్నాడు. శారద తల్లి

కూడా విచారంతో వున్నా, అంతగా పైకి కనిపించనీయ లేదు. ఎలాగైనా వారు సీతారాం శారదలను భార హృద యాలతో వీడ్కోలు ఇచ్చారు.

♦ ♦ ♦

మామూలుగా రోజులు గడిచిపోతున్నాయి. సుందర రామయ్య, సీతమ్మల లోపాయికారీ వ్యవహారం సానుకూల పడలేదు. సీతారాంకూడ తండ్రి మాదిరిగానే అభిమాన వంతుడని తమను తిరస్కరిస్తాడని వారు ఆశించలేదు. వారి ప్లాను తలక్రిందులయి, రంగడి వివాహ సమస్య సమస్యగానే మిగిలిపోయింది. సీతారాం వివాహం విషయం విని ఆ ఆశను పూర్తిగా వదలుకున్నారు వాళ్ళు.

అనసూయమ్మకు తమ్ముడితో బంధుత్వం దగ్గరకు వచ్చినట్లే వచ్చి, దూరమవడంతో; సీతారాం వ్యవహా రానికి మంటగానే ఉన్నది లోలోపల. తమ్ముడితో సంబంధం కలుపుకొంటే; కొంత ఆస్తి కలిసివస్తుందని; బీదరికానికి స్వస్తిచెప్పి, లోటులేకుండా గడపవచ్చనీ ఆమె ఎంతో ఆశపడింది. తండ్రి అలవాట్లూ, ఆదర్శాలు నర నరానా జీర్ణించుకొని వంటపట్టించుకొనిన సీతారాం వారితో పొత్తుకలుపుకోడానికే ససేమిరా అన్నాడు. పోనీ ఈ చేసుకొనిన సంబంధంకూడా బాగా ఉన్నవాళ్ళే నను కొన్నా; ఒక్కపైసా తీసికోకుండా ఆదర్శం పేరుతో ఉత్త చేతులతో ఇంటికి వచ్చారు. ఈ విషయంలో సీతారాం, శారదలమీద ఆమెకు బాగా కోపంగాఉన్నది. శారదతో ప్రేమతో హృదయం విప్పి మాట్లాడలేకపోతోందామె.

ఆమెకు తెలియకుండానే శారదంటే ఒక రకమయిన అయిష్టత, ఏహ్యత ఆమె మనస్సులో పెరిగిపోతున్నవి. సీతారాం అన్నా సద్భావంలేదామెకు. సీతారాం, శారదలు ఈ విషయాన్ని చూచాయగానన్నా కనిపెట్టలేకపోలేదు. కాని ఎవరికి వారు ఏమీ పట్టనట్లు మెలుగుతున్నారు.

రక్తసంబంధంమీద ఎంత ప్రేమాభిమానాలున్నా, వారిమీద నమ్మకాన్ని పురస్కరించుకొని వారినుండి దేనినైనా ఆశించి ఆశతో ఎదురుచూచి; చివరికి ఏమీ పొందలేక ఆశ నిరాశయితేమాత్రం; ప్రేమాభిమానాలూ, మమతావాత్సల్యాలూ, బంధుత్వం, సమసిపోయి, శత్రుత్వం పెరుగుతుంది. ఇవన్నీ మానవుని సంకీర్ణమైన మనస్సును, నీచమయిన స్వార్థానికి తార్కాణాలు.

♦ ♦ ♦

బి. ఏ; రిజల్టువచ్చినయ్. శీతారాం అనుకున్నట్లే అందరూ ఆశించినంతగా; ఫస్టున రాలేదు. శారదకూడా అలాగే...యిద్దరూ మామూలుగా ఉత్తీర్ణులయారు.

అయినా వారిద్దరి సంతోషానికి మేరలేకపోయింది... శారద ఇంకా బి. ఏ. ని పూర్తిచేయదలచుకోలేదు. సీతారాంకూడా పై ప్రయత్నాలకు పోక; ఎక్కడైనా ఉద్యోగ ప్రయత్నాలు చేద్దామని నిశ్చయించుకొన్నాడు. ఇప్పటికే ఎంతో ఇబ్బందితో ఆ డిగ్రీవరకు నెట్టుకొచ్చాడు తను. ఇప్పుడు శారదకూడ తోడుగాఉన్నది. అసలే అమ్మ; ఆమెయిష్టానికి వ్యతిరేకంగా పెళ్లాడడంతో ప్రతిదానికీ శారదంటే మండిపడుతోంది. తనన్నా అసహ్యించుకొంటున్న

దని తను గ్రహించకపోలేదు. చదువు విషయంలో ఆమె నుంచి సహకారం లభించడం కష్టం. ఇక ఎలాగో చదువు సాగదు. ఇహ మామగారి ఆర్థికసహాయాన్ని ఆశ్రయించడం అంత బుద్ధితక్కువ ఇంకొకటిలేదు. అది తన ఆశయానికి పూర్తిగా విరుద్ధం. అలాగే తనకు చేదోడు వాదోడుగా శారద లభించింది. ఎలాగో ఉద్యోగం సంపాదిస్తే ఎవరి ప్రమేయం లేకుండా తమ భవిష్యత్తును తాము చూచుకో గలరు. అందుకు శారద తన పూర్తి సహకారం లభింప జేస్తుందనడంలో సందేహం లేదు తనకు.

ఈ విషయాన్నే వివరంగా శారదతో మాట్లాడాను సీతారాం. శారద అలాగేనన్నది...

అప్పటినుండీ సీతారాం ప్రతిఉద్యోగానికీ ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు.

ప్రతిరోజూ ఇంట్లో అత్తాకోడళ్ళ మధ్య తగవులు జరుగుతూనే ఉండేవి. చిన్నచిన్న వ్యవహారాలకుకూడా శారదతో తగవుపెట్టుకొని గలభాచేసేది అనసూయమ్మ–సీతారాంనుకూడా వీరిమీదవారిమీద పెట్టిదెప్పుతూండేది ఆమె.

వయస్సు పెరిగినకొద్దీ మానవులకు మనస్సులు వెర్రి తలలు వేస్తాయి కామోలు. సంబంధం ఆమెకు ఇష్టంలేనంత మాత్రాన నవమాసాలు మోసి, పెంచి పెద్దచేసిన ఆమెకు సీతారాం కొడుకు, శారద కోడలు కాలేకపోయారు.

ఇంటెడు చాకిరీ అంతా శారదే చేసినా అన సూయమ్మకు తృప్తిలేదు. భోజనం దగ్గరమాత్రం శారదకు పచ్చిమెతుకులే. శారద సహనానికి మరోపేరు. సీతారాం

ఏమీ చేసే పరిస్థితుల్లో లేడు. విషయం అతను గ్రహిస్తూనే ఉన్నా; శారద తనతో ఎప్పుడూ చెప్పేదికాదు. అన్నీ దిగమింగి ఎంతో ఓర్పుతో మెలిగేది.

కాని కాలం దేనికైనా కలిసి రావాలి. మానవ ప్రయత్నాలకు తోడుగా దైవానుగ్రహంకూడా ఉండాలి. నెలలు గడుస్తున్నా సీతారాం ప్రయత్నాలు ఒకదారికి వచ్చేరోజుమాత్రం రావడంలేదు.

గుంటూరులో ఇద్దరు ముగ్గురు తెలిసినవాళ్ళు ప్రయత్నం చేద్దామని హామీ యిచ్చినా; కార్యరూపంలో ఒక్కటీ సానుకూలపడటంలేదు. సీతారాం ఈ పరిస్థితులలో విచారంగా ఉంటే శారద ధైర్యంచెప్పేది. "ఏమిటండీ... చిన్నపిల్లాడిలా మీరూ అలావుంటే ఎలా. దేనికైనా కాలం ఒనగూడాలికదా!" అని.

ఇంటి పరిస్థితులు; శారద, అనసూయమ్మల మధ్య ఒక నిమిషం పడకపోవడం; చూస్తుంటే, శారదను తీసికొని ఎక్కడైనా దూరంగా వెళ్ళిపోదామనుకొనేవాడు సీతారాం ఒక్కొక్కసారి. కాని యిల్లు కదిలితే క్షణం గడవాలన్నా డబ్బు ఉండాలి. ఎంత అశాంతిగా ఉన్నా యిక్కడ అర్థాకలితోనైనా కాలంచాస్తోంది. అప్పటి సీతారాం పరిస్థితి అరిటాకు ముల్లు సామెతతో సరిపోతుంది. ఎవ్వరికి కోపం వచ్చినా అతనికే నష్టం. సీతారాం వెనకాముందూ ఆలోచించాల్సివచ్చింది...తన కర్తవ్యం ఏమిటో పాలుపోలేదతనికి.

* * *

ఉద్యోగంకోసం సీతారాం చేసిన ప్రయత్నాలలో ఒక్కటీ కలిసిరాలేదు. ఎన్నింటికి దరఖాస్తులు పెట్టుకున్నా ఆ ఖాళీలన్నీ అంతకుముందే భర్తీ చెయ్యబడి, నామకః ఇంటర్వ్యూలుగావడంతో; సీతారాం బి. ఏ. డిగ్రీ అతనికి ఉద్యోగం సంపాదించి పెట్టలేకపోయింది.

తన జీవననిర్వహణకై; ఉదరపోషణానికై అక్కరకు రాని ఈ డిగ్రీచదువు అన్నేళ్లు కష్టించి తను ఎందుకు చదివినట్లు?...అంతడబ్బు ఖర్చయినా; డిగ్రీరాగానే ఉద్యోగం లభిస్తుందనుకోడం వ్యర్థం. ఇటుచూడగా ఇంటి పరిస్థితులు రోజురోజుకూ అర్థంలేనివీ; అశాంతికరంగా తయారవుతున్నాయి. తల్లిదండ్రుల్నీ, మేనమామనీ నెగ్గుకొచ్చి శారద తనను వివాహం చేసుకొన్నదీ, ఈ అశాంతిమయ వాతావరణంలో; సంకీర్ణభావాలమధ్య నలిగి, వ్యర్థ జీవితాన్ని గడపడానికా? ఇప్పటికే నిరుద్యోగంతో చాలా కాలం వృథాగా గడిచిపోయింది. తను ఇప్పుడేం చేయాలి. ఏమిచేయాలన్నా ఏదారీ గోచరించటంలేదు. ఈ ఇంటి పరిస్థితి; నిరుద్యోగ సమస్య సీతారాంకు ఒక తీరని సమస్యే అయిపోయింది.

* * *

యావత్ప్రపంచం యుద్ధపు అగ్నిజ్వాలల్లో దహించుకుపోతోంది. ఫాసిస్టు రాక్షసులు యావత్ప్రపంచాన్ని ఏకఛత్రాధిపత్యంగా ఏలుదామనే మనస్పర్ధతో విజృంభించారు. మిత్రరాజ్యాలకు, సామ్రాజ్యవాదులకు మధ్య తీవ్రసంఘర్షణ చెలరేగుతున్నది.

జపాను రాజ్యాధినేత, యిటలీ ముసోలినీ, జర్మన్ నాజీ నియంత హిట్లర్ ఏకమయినారు. మిగతా ప్రపంచం ఏకమయింది వారి ఆట కట్టించడానికి.

ఆ నాజీ వ్యతిరేక యుద్ధంలో మన భారతీయుల్ని కూడా పాల్గొనమని బ్రిటిష్ ప్రభుత్వం కోరింది.

"ఈ బ్రిటిష్‌వాళ్లు మన దేశంనుండి వెళ్ళిపోవాలి. జపానువాళ్ళు మన దేశంలో ప్రవేశిస్తే వాళ్ళపని మనం చూడగలం. ఏ పరాయివాణ్ణీ మన నేలమీద సహించం. మా భారతీయుల అనుమతి లేనిదే భారతదేశాన్ని యుద్ధాలోకి ఈడ్వటం నిప్పులో చలగాటం. మాకు స్వాతంత్రం కావాలి. మిత్రరాజ్యాలుచేసే యుద్ధంలో ఇండియా స్వాతంత్ర ప్రతిపత్తిలో మాత్రమే పాల్గొనగలము" అని నినాదాలు చేస్తూ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించి యుద్ధంలో పాల్గొనడానికి ససేమిరా అన్నారు మనవాళ్ళు. అయినా, కూటికిలేనివాళ్ళు రోజులు భారంగా దొర్లించలేక; అటు ఉద్యోగాలు ఏవీదొరక్క తప్పనిసరిగా చేరుతున్నారు. బ్రిటిష్‌ప్రభుత్వం కూడా; ఈ ఫాసిస్ట్ వ్యతిరేక యుద్ధం పూర్తి కాగానే మన స్వాతంత్రం విషయం ఆలోచిస్తామని హామీ ఇవ్వడంతో, భారతీయ యువకులుకూడా యుద్ధంలో చేరుతున్నారు. సైన్యంలో చేరటానికి ప్రతి వారినికీ పిలుగా; పట్టణాలలో రిక్రూటింగ్ ఆఫీసులు నెలకొల్పారు.

సీతారాం ఆలోచనలు ఈ విషయంవైపుకు మళ్ళినై. ఇంటిదగ్గర ఈ గొడవలలో మునిగి, ఉద్యోగం లేకుండా బాధ

పడకన్నా యుద్ధంలో జేరితే; పరిస్థితులు కొంత మెరుగుపడవచ్చు. తను సెలెక్టుకావడం అంత కష్టమైన విషయం కాదు. ఆ అనుమానంమాత్రం లేదు తనకు. యుద్ధంలో జేరడానికి కావలసిన యోగ్యతలుకూడా సరిపోతాయ్. తనది బలిష్టమైన శరీరం. యుద్ధంలో జేరితే డబ్బుబాధ తప్పుతుంది. ఇంటికి డబ్బు పంపుతుంటే; పోట్లాటలు, కలతలు వాటంతటవే సర్దుకుపోతాయ్. శారదను విడిచి కొన్నాళ్ళపాటు వియోగభారం అనుభవించాలి. శారద ప్రేమించి పెళ్ళిచేసుకొన్నందుకు కొన్నాళ్ళుకూడా ఆనందం అనుభవించకుండా కష్టాలలో, పడని వాళ్ళల్లో, వదలి ప్రవాసంలోనికి వెళ్ళిపోవాలి తను. పరిస్థితుల సెదిరించి తనను పొందినందుకు శారదకు సుఖశాంతులు లేవు. కాని తప్పదు. పరిస్థితులు అలాంటివి. అప్రయోజకుడైన కొడుకు చివరికి తల్లికికూడ పరమశత్రువు క్రింద జమే. చెప్పితే శారద వెళ్ళనివ్వదు. జేరిన తరువాత యుద్ధం ఎన్నాళ్ళుంటుందో చెప్పడం కష్టం. ఇంటి పరిస్థితులు, ఉండటానికి వీలులేనివిగా మారినప్పుడు, ఎన్నాళ్ళయినా, అక్కడే ఉండడం తప్పదు. ఇన్ని ఆలోచించి సీతారాం చివరికి మిలిటరీలో జేరడానికి నిశ్చయించుకొన్నాడు.

♦ ♦ ♦

మరునాడే సీతారాం వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు.

ఆ రాత్రి... తెల్లవారితే శారదనువదలి తనుదూరంగా వెళ్ళిపోతాడు కొన్నాళ్ళపాటు. పనీపాటా అయినతరువాత

శారద వచ్చింది. ఇదివరకటి శారదకు, ఇప్పటి శారదకు తేడా కనిపెట్టలేకపోలేదు సీతారాం. ఆమె వదనంలో విషాదచ్ఛాయలు అలుముకొన్నాయి. చిక్కి శల్యమై ఉన్నది.

శారద గర్భవతి. యిటువంటి పరిస్థితులలో ఆమెను వదలి వెళ్ళడానికి సీతారాంకు మనస్కరించలేదు. కాని పరిస్థితుల ప్రాబల్యంవల్ల వెళ్ళక తప్పదుకూడ.

శారద దగ్గరకు వచ్చింది.

"నన్ను పెళ్ళాడి చాలా కష్టాలు పడ్తున్నావు శారదా...కదూ!" అన్నాడు సీతారాం ఆమె చేతుల్ని పట్టుకొని ఉద్రేకంతో, విచారంతో.

"ఏమిటండీ మీరనేది. ఎలాగో ఉన్నారు మీరు... ఎప్పుడూ ఆ ఆలోచనలేనా?" విచారపు నవ్వు ఆమె పెదవులపై లాస్యంచేసింది కొంతసేపు. తిరిగి శారద అన్నది. "మీరు నాకళ్ళముందుంటే చాలు. ఇవన్నీ కష్టాలుటండీ నాకు. నా హృదయాన్ని అర్పించిన మీరు; నాకు దక్కారు. అంతేచాలు. నాకు ఇంకా లోటేమిటి? ఇక డబ్బంటారా?...అది ఇవాళుంటుంది, రేపు పోతుంది. దాని దేముంది. నేను ఎంత భయానక హాలాహలాన్నయినా అమృతప్రాయంగా చవిచూస్తాను" అన్నది శారద సజల నయనాలతో రుద్ధకంఠంతో.

సీతారాం తిరిగి రెట్టించాడు. "చూడు శారదా... నిజంగా దాయకుండా చెప్పు. నన్ను కట్టుకొని ఏమి సుఖ పడ్డావు నీవు? ఎంత బాధపడ్తున్నావో. బహుశః నా స్థితి

యింత హీనమవుతుందని అనుకొని వుండవు. జీవితాంతం యిలాగే మన జీవితం బాధలతో గడపాల్సివుంటే, నన్ను కట్టుకొనినందుకు పశ్చాత్తాప పడతావేమోకూడా. చూస్తుంటే అదృష్టం నన్ను వరించేటట్లు,కనుచూపు మేరలో కూడా కనబడటంలేదు.

శారద నిర్మల నేత్రాంచలాల్లో కన్నీరు ఉబికి వచ్చింది. అదాటున కూర్చుని సీతారాం పాదద్వయాన్ని తన చేతులతో స్పృశిస్తూ, విషాదమూర్తి అయి అన్నది. "నాకేం బాధగా లేదండీ. మీ పరిస్థితులు, స్థితిగతులూ మొదటే పూర్తిగా తెలుసు నాకు. ఇంతకన్నా హీనంగా నీచంగా ఉన్నా, అవన్నీ మీకోసం తప్పక సహిస్తాను. నాకు మీ అచంచల ప్రేమానురాగాలు కావాలి, అంతే. జీవితాంతం మీరన్నట్లుగా బాధామయజీవితాన్నే గడపాల్సివస్తే, దానికికూడా నా నిశ్చయం అచంచలమయినదే. కాని మన జీవితం చివరివరకూ ఇదే స్థాయిలో ఉంటుందని మాత్రం నేను అనను. మంచి రోజులు వచ్చి తీరుతయ్ మనకు. మనంకూడా ఆనందడోలికలలో వూగిసలాడుతాము. ... అలా ఆశించాలి మరి!..." శారద ఉదాత్తగుణానికి, ఓర్పుకు లోలోనే జోహారు లర్పించాడు సీతారాం.

శారదను ఊరడించి, అక్కున జేర్చుకొన్నాడు సీతారాం; భవిష్యత్ వియోగాన్ని తలచుకొని లోలోనే నీరు కారిపోతూ, "ప్రేమానురాగాలను ధనపుసంచులతో

బేరీఖు వేయకుండా నిర్మల నిష్కల్మష ప్రేమను ప్రస న్నించే తన శారద ఉత్తమోత్తమురాలు!"

శారద దృఢమనోగత భావాలను, దీక్షాపటిమను, ఆశావాదిత్వానికి మనస్సులో సీతారాం నివాళు లర్పించు కొన్నాడు.

శారద తనతో, తన ప్రయత్నాలతో సహక రిస్తుంది. తన కెటువంటి అనుమానం లేదు. ఇక జీవిత పథాన్ని తీర్చిదిద్దుకోడానికి, మార్గాన్వేషణ చేయవలసింది తనే.

మానవుడి హృదయంలో ఎన్ని ఓటములు చవి చూసినా, ఆశ అనేది లేశమంతైనా ఏమూలో ఆ మూల తప్పకుండా ఉంటుంది. సీతారాంకుకూడా ఆ ఆశాలేశం మనోఅంతరాళంలో ఎక్కడో స్పందిస్తోంది. "మంచి రోజులు వస్తాయి నాకు కూడ" అనుకొన్నాడు సీతారాం దృఢంగా.

* * *

తెనాలిలో ఏదో పని వున్నదని చెప్పి గుండె దిటవు చేసుకొని బయలుదేరినా, సీతారాంను బాధ వేధిస్తూనే ఉన్నది. శారదకు కనిపించకుండా సంచీలో రెండే గుడలు వుంచుకొన్నాడు.

వచ్చేముందు ఎంత నిగ్రహించుకొన్నా ఆగక కళ్ళల్లో నీళ్ళు పొంగువారినై సీతారాంకు ... కాని... బెంబేలు పడకూడదు. తన అదృష్టంలో ఇలా వ్రాసి వున్నప్పుడు ఎలాగో అలా సుఖజీవితానికి మార్గాన్వేషణ

చేయాలిగాని, భీరువై జీవితాంతం అశాంతితో గడపడం ఎలా? కొన్నాళ్ళిలా కష్టపడి, రాటుదేలితేగాని, సుఖ ప్రాప్తికాదు. "వేదాంతి ప్రవచించినట్లు జడతలో నుండే సృష్టి ప్రభవించిందట. అలాగే సుఖంకూడా కష్టంలో నుండే ఉద్భవించింది. కష్టాలు అనుభవించని; సంపూర్ణ మయిన సుఖానికి పరిపూర్ణతలేదు" ఇలా సమాధానపరచు కొన్నాడు సీతారాం.

సీతారాం బెజవాడ చేరాడు. బెజవాడలో మిలిటరీ రిక్రూటింగ్ ఆఫీసున్నది.

రిక్రూటింగ్ ఆఫీసులో తనలాంటి యువకులే చాల మంది బారులో నుంచొనివున్నారు. వారి వదనాలల్లో అనిర్వచనీయమయిన ఏదో ఆనందం, తృప్తి ద్యోతకమవు తున్నాయి. వారి దృఢ తేజోపూర్ణమయిన శరీరాల్లో వేడి యువకరక్తం ఉరకలు పెట్తోంది. అందరూ సంతోషంతో హుషారుగా ఏవేవో మాట్లాడుకొంటున్నారు.

సీతారాం విచారగ్రస్తమయిన వదనం వారిని చూడ గానే ఉత్సాహాంకురాలతో తేజరిల్లింది. ఆ వాతావరణంలో సీతారాం ఇంటివద్ద అనుబంధాన్ని తాత్కాలికంగా మరచేపోగలిగాడు. ఉత్తప్త హృదయం గుసుగుంతో తృప్తితో ఊరట చెందింది.

సీతారాం ఆఫీసరును కలిశాడు. ఏవేవో పరీక్షలు జరిగినవి. అంతా సవ్యంగానే ఉన్నది. మర్నాడు పదిగం లకు వ్రాత పరీక్షకు హాజరుకమ్మన్నారు.

ఆ రాత్రి తనదగ్గరనున్న కొద్దిపైకంతో ఒక లాడ్జిలో బసచేశాడు సీతారాం.

పరీక్షకు పదిహేనుమంది వచ్చారు. అందరూ తన లాగానే గ్రాడ్యుయేట్స్. కూటికి పనికిరాని డిగ్రీ, యువకుల్ని దేశాంతరాలు పంపుతున్నది. ఎందుకో అందుకు పని కొచ్చింది. సంతోషించాలి మరి. ఎందుకూ పనికిరాని ఈ డిగ్రీ కొరకే నానా అగచాట్లూ పడడం, ఆస్తుల్ని అమ్ముకోవడం. చివరికి అన్నేళ్ళు నెట్టుకొస్తే అంత డబ్బు పోసి సంపాదించిన డిగ్రీ ఫ్రేము కట్టి గోడకు తగిలించ డానికి తప్ప ఎందుకు పనికిరాదు. విద్యకు అంత విలువ ఉన్నది మరి. ఆర్జించిన విద్యాబుద్ధులకు; భవిష్యజ్జీవితానికి పొత్తుకుదరదు. విద్యావ్యవస్థ అంత బలహీనంగా వుంది. మేధావులకు ప్రోత్సాహ సహకారాలు లేవు. అంత చదివీ చివరికి కూటికోసం దేశాలు తిరగాల్సిందే.

పరీక్ష సీతారాంకు అంత కష్టమనిపించలేదు. సీతారాం ఇంగ్లీషు ఉచ్చారణకు, కమాండర్ ఆశ్చర్య పోయాడు.

సాయంత్రంకల్లా పరీక్షాఫలితం చెప్పారు. సీతా రాంతోబాటు నలుగురు ప్యాసయ్యారు.

అయిదుగురినీ వేర్వేరు రెజిమెంట్లకు పంపారు. సీతారాం, నారాయణ అనే మరొక అభ్యర్థి ఫిరోజ్ పూర్‌లో జాయినవ్వాలి.

ఆఫీసార్డరు తీసికొనేటప్పుడు సీతారాంకు నారా తో పరిచయమైంది...

ఫిరోజ్ పూర్ వరకూ ఫ్రీ రైల్వే పాసు ఇచ్చారు... వారికి. కమాండర్ కరచాలనం చేసి; భుజం తట్టూ "విష్ యూ బెస్టు ఆఫ్ లక్ ఫ్రెండ్స్!" అన్నాడు.

"మీ పేరు సీతారాం కదండీ!" నారాయణ మాట్లాడించాడు.

"అవునండీ. నారాయణ మీరేనా? ఫిరోజ్ పూర్ వస్తున్నారన్న మాట. బాగుంది. కంపెనీ దొరికింది. టీడియస్ జర్నీ అండీ మరీనీ"

"అదృష్టం కొద్దీ మనం ఒకే చోటికి వెళ్తున్నాం వేర్వేరు చోట్లకు విసిరి వేయబడకుండా...భగవత్పేరణ. మన ఈ పరిచయం ప్రాణస్నేహంగా జీవితాంతం నిలచిపోవాలి"

నారాయణ కూడా చక్కగా ఆప్యాయతగా మాట్లాడాడు.

"నిజమే. మనం వెళ్ళేది కాని దేశాలకు. మన స్నేహం, సహకారం మనల్ని ఎన్నో ఒడుదుడుకులనుండి కాపాడు తుంది. మీ ఉద్దేశ్యంతో ఏకీభవిస్తాను"

కొద్దిపరిచయంతోనే సీతారాం, నారాయణ స్నేహితు లయ్యారు. కొందరి స్నేహాలు అలాగే జరుగు తుంటయ్. కలిసిన కొద్దిక్షణాల్లోనే ఒకరినొకరు క్షుణ్ణంగా అర్థం చేసికోవడం జరుగుతుంది. ఏదో అజ్ఞాతమైన శక్తి వారిద్దర్నీ ఒకచోట కూడుస్తుంది. అదంతా జన్మాంతరానుబంధాల ప్రభావం.

"నారాయణ తల్లిదండ్రులు చిన్నప్పుడే ఎప్పుడో పోయారుట. దగ్గర బంధువు లెవ్వరో ఒకాయన తనను

పెంచుతానని నమ్మకంగా మాటయిచ్చి ఉన్న ఆ స్తిఅంతా తనపేర వ్రాయించుకొన్నాడట. తండ్రిపోయిన తరువాత ఆయన అజమాయిషీలోనే స్కూలుఫైనల్ వరకూ చదివాడట. తరువాత ఆయన్న తానిక చదివించలేననీ, ఇప్పటికే ఎంతో ఇబ్బందిపడి చదివించాననీ నిష్కర్షగా చెప్పివేయడంతో, నారాయణ తనమార్గం తను చూచుకోవాల్సి వచ్చిందట.

ఆ స్తి చేజిక్కింది. పుర్రెకు పుట్టెడు బుద్ధులు. నారాయణకు వేరే నిదర్శనాలు, సాక్ష్యాలు లేక, గత్యంతరంలేక, ఆ స్తిని వదలి, చందాలు ప్రోగుచేసుకొని, బి. యే. వరకూ చదివాడట. ఎక్కడ ఎన్ని విధాలుగా ప్రయత్నించినా, ఉద్యోగం దొరకక; నిరుద్యోగంతో బాధపడి మగ్గి చచ్చేకన్నా; సైన్యంలో చేరడం ఉత్తమమనిపించి ఇలా వచ్చేశాడట."

నారాయణ తన విషయమంతా సీతారాంతో చెప్పాడు. తనలాంటి విషాదజీవే తనమిత్రుడుకూడ అనుకొన్నాడు సీతారాం.

ఆ రాత్రే ఇద్దరూ ఫిరోజ్‌పూర్‌కు బయలుదేరారు.

— — —

సితారాం, నారాయణ ఫిరోజ్‌పూర్ చేరారు ... కమాండర్ ఒక ఇంగ్లీషు యువకుడు. పేరు లెఫ్టినెంట్ కమాండర్ జేమ్స్. వీరిద్దర్నీచూచి జేమ్స్ చాలా సంతోషించాడు. భుజం తట్టూ "మీలాంటి యువకులు ఇంకా సైన్యంలో చేరాలి. అప్పుడే ఈ నాజీ కుక్కల్ని తరిమి

వేయగలుగుతాము మనం" అన్నాడు. "మీరు ధైర్యంతో, ఉత్సాహంతో ముందుకు వచ్చినందుకు చాల సంతోషం" అన్నాడు మళ్ళీ—యిద్దరితో కరచాలనం చేస్తూ.

వాతావరణం తామెన్నడూ చూడనిదీ, అంతా క్రొత్తగా ఉన్నది. సీతారాం, నారాయణలను, స్టోర్సులో వేశారు. అయినా మామూలుగా సిపాయిలతోబాటు కవాతులు, రైఫిల్ ఆపరేషన్ అన్నీ యథావిధిగా ఉండేవి. అన్నీ టైం ప్రకారం జరగాలి. కమాండర్స గొంతులు చించుకొని అరుపులూ, తోటి సిపాయిల హుషారయిన సంభాషణలూ, అక్కడి నూతనపరిసరాలు, వాతావరణం—ఉల్లాసకరంగా ఉండేది వారికి.

నారాయణకు సంగీతమంటే చాలాయిష్టం. అతను వచ్చేటప్పుడు తనతోపాటు తన మాండొలిన్ తెచ్చుకున్నాడు. మాండొలిన్ వాయించడం ప్రావీణ్యమున్నదతనికి. కొద్దిరోజులలోనే అతను మాండొలిన్ వాయించగలడని సిపాయిలకు, ఆఫీసర్లకు తెలిసింది. సాయంసమయాల్లో; అతని పాటలను వినడానికి సీతారాం నారాయణల టెంటు దగ్గరకు అంతా వచ్చేవారు. మాండొలిన్మూలంగా నారాయణ అందరికీ సుపరిచితుడైనాడు. తీరిక వేళల్లో అందరికీ కాలక్షేపం నారాయణ మాండొలినే.

సీతారాం, నారాయణ ఇద్దరూ ఒకే స్టోరులో వుండడంతో; వారి స్నేహం రోజురోజుకూ పటిష్టమవుతున్నది. టెంటుకూడా ఒకటే. ఇద్దరూ అన్నదమ్ములలాగా మెలుగు

తున్నారు. చూచేవాళ్ళుకూడా అన్నదమ్ములనే అనుకొనే వారు వారిద్దర్నీ.

సీతారాం ఫిరోజ్‌పూర్‌లో డ్యూటీలో జేరిన తరువాత, ఇంటికి ఉత్తరం వ్రాశాడు. శారదపేరుతో ఇంకో ఉత్తరంకూడ విడిగా వేశాడు. ఇంటి పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకొనే ఇలా ఇల్లువదిలి చెప్పకుండా రావాల్సివచ్చిందని; కులాసాగా వున్నాననీ అంతా సవివరంగా వ్రాశాడు. సీతారాంకు డ్యూటీ టైములో, ఇంటిసంగతులు ఆలోచించి, విచారించేందుకు సమయం దొరికేదికాదు. తరువాతకూడా స్నేహితులతో కాలక్షేపంచేస్తూ అక్కడి వాతావరణంలో పూర్తిగా లీనమైనాడు అతను.

*　　　*　　　*

సీతారాం తెనాలి వెళ్తున్నానని చెప్పివెళ్ళి నాలుగు రోజులయింది. మొదట ఏదో పనివుండి ఆగిపోయాడేమోలే అనుకొన్నారు అనసూయమ్మ, శారద.

కాని రోజులు దొర్లిపోతున్నా సీతారాంజాడ తెలియకపోవడంతో కలవరపడ్డారు ఇద్దరూ.

"వాడేమన్నా వెళ్ళేముందు నీకు చెప్పాడా ఏమిటే ఎక్కడికి వెళ్తున్నదీనూ" భృకుటి ముడిపెట్టూ అడిగింది శారదను అనసూయమ్మ.

"తెనాలి వెళ్తున్నానని చెప్పారు..."

"మహా చెప్పొచ్చావులే. ఆ సంగతి నాకూ తెలుసు. తెనాలి అని నాకూ చెప్పాడు. కానీ నాలుగురోజులయింది. తెనాలిలో ఇన్నాళ్లు రాచకార్య మేమేడిసింది వాడికి?.

అజాపజా లేదు. అందుకని గుట్టుగా నీతో ఏమైనా ఏడిచా డేమోనని" విరుచుకుపడ్డది అనసూయమ్మ.

"అంతకన్నా నాకు ఏమీ తెలియదు" మెదలకుండా తనపనిలో తను నిమగ్నురాలయింది శారద.

"పాపం! ఏమీ తెలియదమ్మా నీకు. నంగనాచివి. అంత చెప్పకుండా ఉన్నాడా. ఏమీ తెలియకనే నీవైపు త్రిప్పుకొన్నావా నుంచుపెట్టి? సిగ్గులేకపోతేసరి." మూతి మెటికలు విరిచింది అనసూయమ్మ కసితో.

*          *          *

సీతారాం వెళ్ళి పదిరోజులయింది. మర్నాడు వస్తానన్నతను పదిరోజులయినా అయిపులేదు. అనసూయ మ్మకు శారదమీద అనుమానంగా ఉన్నది, ఏమైనా తెలుసునేమోనని. కాని సీతారాం ఆమెకూ ఏమీ చెప్ప లేదు. అనసూయమ్మ కెంత తెలుసో, ఆమెకూ అంతే తెలుసు. కాని అనుమానంతో అనసూయమ్మ, శారదతో ప్రతిరోజూ క్రమం తప్పకుండా తగవు వేసుకొంటూ తిట్టూనే ఉన్నది.

శారద కిన్నమ్మడం లేదు. ఆమెకూ ఏమీ పాలు పోవడంలేదు. తనతో కూడ మరునాటికల్లా తిరిగివస్తానన్నాడు. మరి ఎందుకు రానట్లు? శారద ఆలోచనలు పరిపరివిధాల పోయినై.

"తనను విడిచి ఎటన్నా శాశ్వతంగా వెళ్ళిపోయా డేమో సీతారాం" ఈ ఆలోచనతో శారద నిలువునా కంపించిపోయింది. ఝంఝూమారుతంలోని ఎండిన చింతా

కులా చలించిపోయింది. కాని ఆమె, గుండె దిటవు చేసు కున్నది. "కాదు! సీతారాం అలా ఎన్నటికీ చేయడు. ఆయన అలాంటి భీరువు కాదు. భీరువే అయితే తన తల్లికి అయిష్టమయిన వివాహం చేసుకొనేవాడే కాదు. సీతారాం తప్పక తిరిగివస్తారు! ఏవో అనుకొని అడ్డంకులు కలిగి వుంటాయ్" శారద తన చంచలమయిన మనస్సును తగు రీతి సమాధానపరచుకొన్నది.

♦ ♦ ♦

పదకొండో రోజు సీతారాం వ్రాసిన ఉత్తరాలు రెండూ వచ్చినై. టపా వచ్చేటప్పటికి శారద లోపల ఎక్కడో పనిచేస్తున్నది. అనసూయమ్మ రెండు వుత్త రాలూ తీసికొని చదువుకొన్నది. శారదకు వ్రాసిన ఉత్తరం దాచి తన పేర వచ్చిన వుత్తరంతో శారదదగ్గరకు వెళ్ళి అన్నది, "ఇదిగో తల్లీ, ఇన్నాళ్ళికి ఇల్లు జ్ఞాపక మొచ్చింది వాడికి. ఉత్తరం వ్రాశాడు" అంటూ కవరు చించి, చదివింది బిగ్గరగా.

అమ్మకు,

నేను ప్రస్తుతం ఫిరోజ్‌పూర్‌లో ఉంటున్నాను. ఇంటి పరిస్థితులను దృష్టిలో ఉంచుకొనే ఇలా మీ అందర్నీ విడిచి ఇంతదూరం రావాల్సివచ్చింది. మిలిటరీలో చేరాను.

ఇదివరకు అమ్మకు నేనంటే అమితమయిన ప్రేమ అనుకొనేవాడిని. కాని ఇప్పుడు తెలుసుకోగలిగాను; తల్లి కూడా తన సంతానాన్ని అసహ్యించుకొనగలుగుతుందని.

అప్రయోజకుడయిన కొడుకును తల్లికూడా గౌరవించలేదు. అది మన విషయంలో ప్రత్యక్షంగా ఋజువయింది. మాతృ మమత, మమకారాలకు అతీతమయిన ఆర్థిక సమస్యతో సతమతమవుతున్న మన ఇంటి పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, కొంతయినా మెరుగుబడకపోవనే ఉద్దేశ్యంతో ఇలా వచ్చాను. శారదను జాగ్రత్తగా చూస్తూవుండు. ప్రతి నెలా డబ్బు పంపుతాను. శారదను విచారించవద్దని చెప్పు...ఉంటా.

సీతారాం.

విషయం తెలియగానే శారద దుఃఖం ఆపుకోలేక పోయింది. వెళ్ళి గదిలో దిండులో తలదూర్చుకొని నిశ్శబ్దంగా రోదించింది. అనసూయమ్మ మండిపడింది సీతారాం ఉత్తరం ధోరణికి.

ఆ మంటమీద శారదను నాలుగూ దులిపింది అనసూయమ్మ. శారదమాత్రం కిమ్మనలేదు. "సీతారాం తనను ఒంటరిదాన్ని చేసి వెళ్ళి యుద్ధంలో చేరాడు. యుద్ధంలో చేరితే, అదెప్పుడు అయిపోతుందో ఎవరికీ తెలియదు. అప్పటివరకూ సీతారాం రావడంమాత్రం పడదు. తనంటే అత్తయ్యకు అసలే పడదు. అయినా తప్పదు. ఎలాగో అలా ధైర్యంతో పరిస్థితుల్ని ఎదుర్కోవాలి. ఆ ధైర్యం సీతారాం నేర్పిందే తనకు."

అనసూయమ్మ మాత్రం లోలోపల సంతోషించింది. ఇకనుండీ నెలనెలా డబ్బు పంపిస్తాడు కదా అని.

శారద అంటే మండిపడుతుంది. ప్రతివిషయానికి పోట్లాడు తుంది.

♦ ♦ ♦

సీతారాం తను వ్రాసిన ఉత్తరాలకు జవాబులకోసం ఎదురుచూచాడు. వారంకల్లా అనసూయమ్మ దగ్గరనుండి జవాబువచ్చింది. శారద ఉత్తరం రాలేదు! 'శారద ఉత్తరం ఎందుకు రాయలేదబ్బా' అనుకొన్నాడు సీతారాం. తల్లిమీద అనుమానం వెయ్యకపోలేదు. కాని రెండు మూడు రోజు లలో వస్తుందేమోనని సమాధానపరచుకొన్నాడు.

సీతారాం తల్లి ఉత్తరానికి అసహ్యించుకొన్నాడు. తనేమయినాడో అని భయపడిందట. తన ఉత్తరం చూడ గానే ప్రాణాలు లేచివచ్చినయ్యట. తన జీతం గురించి, ఇతర సంగతులనుగురించి తెలుసుకోవాలని ఉన్నదట.

కానీ, అంత సుదీర్ఘమయిన ఉత్తరంలోనూ, ప్రతి అక్షరమూ, డబ్బుగురించే తప్ప, ఒక్క ముక్కగూడా, శారదగురించి లేదని తెలిసి బాధపడ్డాడు. శారద ప్రస్తావన లేదసలు.

"శారద!, తన జీవన సుఖదుఃఖాల భాగస్వామి! తన ప్రాణంలో ప్రాణం అయిన ఆమె అంటే అమ్మకు అంత ఆజన్మశత్రుత్వమెందుకు?! మనుషులు దూరంగా ఉంటే ఆప్యాయతలు ఇనుమడిస్తాయనే విషయం లోకవిదితం. కానీ తన తల్లి వ్రాసిన ఉత్తరంలో తన క్షేమసమాచా రాలు తెలుసుకొనే ఆతృతకన్న, తన జీతంమీద ఆప్యాయత, గౌరవం ఎక్కువగా ప్రతిబింబించినై"

సీతారాం ఆ రోజల్లా అన్యమనస్కతతో విచారంగా గడిపాడు.

నారాయణ హుషారుగా పలకరించినా అతని ఉత్సాహాన్ని తను పంచుకోలేకపోయాడు.

*　　*　　*

సీతారాం ఫిరోజ్‌పూరు వాతావరణానికి అలవాటు పడుతున్నాడు మెల్లిగా. కొత్తల్లో అక్కడి వాతావరణమూ, తనకు అపరిచితులయిన స్నేహితులు, వింత ఉద్యోగమూ, ఎలాగో వున్నా, రోజులు గడుస్తున్నకొద్దీ బాగానే వున్నది.

ప్రతిరోజూ శారద ఉత్తరంకోసం ఎదురు చూచేవాడు సీతారాం. కాని, రోజులు గడుస్తున్నకొద్దీ ఆశ నిరాశే అయింది. సీతారాంకు అనుమానం కలిగింది; తను వ్రాసిన ఉత్తరం శారదకు సవ్యంగా అందిందా అని. ఉత్తరం అంది ఉండదు. అమ్మ మాయంచేసి ఉంటుంది. శారదంటే అసలే గిట్టదు. అందుకని తను ఏమివ్రాసినా లాభంలేదు. శారదకు అందుతుందని నమ్మకంలేదు.

సీతారాం రాత్రిపూట, చాలా ప్రొద్దుపోయేవరకూ, తన భావిజీవితంగురించీ, శారదగురించీ ఆలోచనలతో గడిపేవాడు. తనను శత్రువుక్రింద జమకట్టే తల్లి చేతుల్లో శారద నెగ్గుకు రాగలుగుతుందా అని అనుమానంగా ఉంది అతనికి. ఒక్కోసారి శారదనలా వదిలి ఎందుకు వచ్చానా అనుకొని బాధపడేవాడు. తనను నమ్ముకొని, ఎన్నో అడ్డంకుల్ని తొలగించుకొని వచ్చిన శారదను ఒంటరిదాన్ని చేసి రావడం పొరపాటేనేమోనని మదనపడేవాడు.

కాని ఏం లాభం?! చేరిన తరువాత బయటపడడం అసంభవం. ఎలాగైనా ఓర్పుతో కొన్నాళ్లు గడిపితే, తర్వాత తను శారద దగ్గరకు వెళ్తాడు. అప్పుడు తమ జీవితం సుఖమయం అవుతుంది. రాబోయే సుఖజీవితంకోసం ప్రస్తుతం తను కొంత ఇబ్బంది పడడం తప్పదు.

*　　*　　*

ప్రతినెలా సీతారాం ఇంటికి డబ్బు పంపేవాడు. అనసూయమ్మకూడా అతిశయించిన అనురాగాలతో ఉత్తరం వ్రాస్తూనే ఉన్నది. డబ్బుకు, ఆప్యాయతకు అవినాభావ సంబంధం.

అదంతా డబ్బు ప్రభావం. డబ్బు! అసంభవాన్ని సంభవంగా మార్చేశక్తి దానికి ఒక్కదానికే ఉన్నది.

శారదనుండి మాత్రం ఉత్తరం లేదు. ప్రతినెలా డబ్బు పంపుతూ, కొంత శారదకుకూడా యివ్వమని వ్రాసేవాడు సీతారాం. అదికూడా ఇస్తున్నదో లేదో భగవంతుడికే తెలియాలి. శారద ఎన్ని ఇబ్బందులు పడుతున్నదో, ఏమో.

*　　*　　*

అనసూయమ్మలో మార్పేమీ లేదు. సీతారాం పంపిన డబ్బులో శారదకేమీ యివ్వడంలేదు. శారద ఎన్నిసార్లు అడిగినా, సీతారాం అడ్రసుమాత్రం యివ్వలేదు. శారద అంటే రోజురోజుకూ, శతృత్వం, ఏహ్యాభావం పెరిగిపోతోంది ఆమెలో — ఆమెల్లో కొడుకన్నా, కోడలన్నా అయిష్టత; కొడుకు పంపేడబ్బు, అంటే అమితమైన ప్రేమ.

సీతారాం వెళ్ళి అప్పుడే ఆరు నెలలయింది. ఇలా సీతారాం మిలిటరీలో చేరాడని ఎలాగో తెలిసింది శారద తల్లిదండ్రులకు. ఒకరోజున శారద తండ్రి వచ్చాడు శారదను తీసుకెళ్తానంటూ. అనసూయమ్మ సరిగ్గా మాట్లాడలేదు. ఉంటే ఎక్కడ ఆస్తులు తరిగిపోతాయోనన్నట్లు మొహం ముడుచుకొనే ఉన్నది.

శారద మాత్రం, ఇంటికిరానని స్పష్టంగా చెప్పింది తండ్రితో. కష్టమో, నిష్ఠూరమో తను అత్తగారింట్లోనే ఉంటానని, అయినా తనకు హాయిగానే గడుస్తున్నదని కూడ చెప్పింది.

కాని శారద తండ్రికి అనుమానంగానే ఉన్నది అనసూయమ్మ వ్యవహారం పరికిస్తే. ఒకరోజు కూతురి కోసం వచ్చిన వియ్యంకుణ్ణే మర్యాదచేయని ఆమె కూతుర్ని ఎన్నిబాధలు పెట్టోందోనని. ఆయన లోలోపల చాల బాధపడ్డాడు. భారహృదయంతో ఇంటికి తిరిగి వచ్చేశాడు ఆరాత్రే.

♦ ♦ ♦

ఒక సంవత్సరమయింది సీతారాం మిలిటరీలో చేరి. నారాయణను, అతన్ని ఫిరోజ్‌పూర్‌లోనే ఉంచారు ఇన్నాళ్ళు ఎక్కడికీ పంపకుండా. క్రమబద్ధమైన కార్యక్రమాలవల్ల; పుష్టికరమైన ఆహారంవల్ల; కాయకష్టం మూలంగానూ సీతారాం ఎర్రగా, దృఢంగా మారాడు. స్వతహాగా అతను బలిష్టుడు. ఇప్పుడు మరీని. ఇంటికివస్తే గుర్తుపట్టనంతగా మారిపోయాడు.

నారాయణకూడ సీతారాం స్నేహితంలో చాల మారిపోయాడు. చేరిన క్రొత్తల్లో ఎప్పుడూ ఆలోచనలతో గడిపే నారాయణ యిప్పుడు హుషారుగా ఉంటున్నాడు. తనలా సంతోషంగా ఉండడానికి కారణం సీతారాం అంటాడు నారాయణ. వారిద్దరి స్నేహసంబంధం ఎడ తెగని బంధంగా మారింది.

♦ ♦ ♦

సీతారాం పదిహేనురోజులు సెలవు పెట్టాడు యింటికి వద్దామని. శారదను ఒంటరిదాన్ని జేసివచ్చేసి సంవత్సరం దాటింది ... ఎలావుందో? తను అలా చెప్పాచేయకుండా వచ్చిసందుకు ఏమనుకున్నదో? తనను తప్పక అర్థం చేసికొంటుంది. అమ్మకు శారదకు అసలేపడదు. ఇన్నాళ్లు శారద ఎన్ని ఇబ్బందులు పడ్డదో? అమ్మకు శారదఅంటే ఎంత అయిష్టత ఏర్పడిందంటే...చివరికి శారద ప్రసవమైన సంగతి కూడా వ్రాయలేదు. చిన్నారి పాపో, బాబో పుట్టి ఉంటారు.

చివరికి ఈ సంగతికూడ వ్రాయలేని కఠినాత్మురాలయింది అమ్మ. ఈ సంగతులన్నీ నిలదీసి అడగాలి.

ఎన్నో ఆలోచనలతో ఇంటికి చేరాడు సీతారాం.

అనసూయమ్మ ఆప్యాయతతో ఎదురొచ్చింది. సీతారాం ఆశ్చర్యపడలేదు. శారద ఆనందం అర్ణవమైంది. అయినా సీతారాం శారద వదనంలో విషాదాన్ని, విచారపు నీలినీడల్ని గుర్తించగలిగాడు. శారద చంకలో బాబు! బాబు ముఖంలో కళాకాంతులు లేవు. శారద ఆరోగ్యం

కూడా పూర్తిగా చెడిపోయివుంది. సంవత్సరం క్రిందటి శారదకు, ఇప్పటి శారదకు బోలెడు వ్యత్యాసం.

అనసూయమ్మ ప్రవర్తన పరీక్షించిన సీతారాం శారద అంటే సద్భావం ఆమెకు యింకా కలగకపోగా; ద్వేషం రోజురోజుకూ ఎక్కువవుతున్నదని మాత్రం గ్రహించాడు.

అనసూయమ్మ ఆప్యాయతతో మాట్లాడింది. వెంటనే ఉత్తరాల సంగతి అడిగేద్దామనుకొన్న సీతారాం కొంచెం తటపటాయించాడు. తొందరపడకూడదనుకొన్నాడు.

సీతారాం రాత్రిభోజనాలయినతరువాత శారదతో అన్నాడు. "ఉత్తరాలకు ఒక్క జవాబు వ్రాయలేదేమిటి శారదా!"

శారద నిర్ఘాంతపోయింది. తేరుకొని అన్నది, "మీరు అసలు ఒక్క ఉత్తరం వ్రాయలేదు నాకు. అత్తగార్నడిగితే; నేను వ్రాస్తున్నాగదా. నువ్వుగూడ ఎందుకులే అన్నారు."

సీతారాం అనుకున్నట్టే అయింది. ఇది అమ్మపనే. శారద ఉత్తరాలన్నీ అందకుండాచేసి; శారద సమాచారం ఒక్కటీ తనకు తెలుపకుండా; నాటకమాడింది.

"అదికాదు శారదా. అమ్మకు వ్రాసిన ప్రతి ఉత్తరంతోనూ నీకూ విడిగా వ్రాశాను. నిజంగా"

"ఏమో; ఒక్కటీ అందలేదండీ" తలవంచుకునే అన్నది శారద.

సీతారాం కోపం ఆపుకోలేకపోయాడు. వెంటనే

అనసూయమ్మ దగ్గరకెళ్ళి అడిగాడు. "శారదకి వ్రాసిన ఉత్తరాలు ఏంచేశావమ్మా!"

"ఏం ఉత్తరాలురా. నాకు వ్రాసినవి అందినయి. యింకేం ఉత్తరాలు రాలేదే?!"

"నీకు వ్రాసిన వాటితోబాటు శారదకుకూడ ప్రతిసారీ ఉత్తరం వ్రాశాను. ఒకటి అందకపోతేపోవచ్చు, అన్నీ అందకపోవడం అబద్ధం. అదేం చేసింది నిన్ను. అదంటే నీకు అంత ద్వేషం దేనికి?"

"అను నాయనా, అను. నువ్వుకూడా నన్నే అను. ఉత్తరాలు వస్తే నేనేంతింటానా వాటిని. చివరికిమీరిద్దరూ ఒకటే."

"శారదకు డబ్బు యివ్వమని వ్రాసినిగదా. అదీ అలాగే చేశావ్. ఒక్కపైసా ఇవ్వకపోగా; చూడు శారదను, బాబును; ఎల్లా ఉన్నారో. తిండికూడ సరిగ్గా పెడుతున్నావో లేదో. నువ్విలాగ మారిపోతావని నే..."

"ఏమయింది నీకు. నామీద పోట్లాటకు వచ్చావ్. అదేమన్నా యిపీ అపీ కల్పించి పంపించిందా ఏమిటి? డబ్బు నేనేమన్నా తిన్నానా. ఇంటిక్రిందే ఖర్చయింది. దానికి ప్రత్యేకంగా యివ్వడమేమిటి..."

"నువ్వేమన్నయినా చెప్పు. పెద్దదానివవుతున్నకొద్దీ నీకు మరీ బొత్తిగా మతి క్షీణిస్తున్నది. ఎప్పుడూ తగవులూ, గొడవలూ...నీ కూతురులాగా చూచుకోవాల్సిందిపోయి! ఛీ!" సీతారాం విసుగ్గా వచ్చేశాడు.

శారద కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగినై. "ఎందుకు అడిగారండీ ఆమెను. నేను చెప్పానని అనుకొంటారేమో!"

"నువ్వు అంత మెత్తగా ఉండడంవల్లనే ఆమె అలా ఆడుతోంది శారదా. నిజంగా అమ్మ చేసిన పనే. ఉత్తరాలు అన్నీ దాచింది ఆమే. నీ దగ్గరనుండి ఉత్తరాలు రాకపోతే, ఎంత బాధ పడ్డానో. ఉత్తరం వ్రాయడం ఎదురుచూడడం విసిగిపోయాను సంవత్సరమూ!"

"పోనీలెండి. యిప్పుడుమాత్రం నాకేమయింది. సుఖంగానే ఉన్నాను. మీరక్కడ సంతోషంగా ఉంటే అంతేచాలు. మీ రాకకోసం నిరీక్షిస్తూవుంటాను."

"ఎందుకు శారదా. నువ్వెన్ని అబద్ధాలు చెప్పినా నాకు అసలు విషయం తెలుసు. నిన్ను నువ్వు ఎందుకు మోసం చేసుకుంటావ్. యిక్కడ ఉంటే నీకెలాగు సుఖం లేదు. నన్ను ప్రేమించినందుకు, నీకు సుఖపడే గీతలేదు. నిన్ను సుఖపెట్టలేకపోతున్నాను. అనుకొన్నది ఒకటీ, జరిగేది ఒకటీ అవుతున్నది. నీకు ఏది మంచిది అని తోస్తే అని చెయ్యి. నేను వచ్చేవరకు, మీ యింటికి వెళ్ళేట్లయితే ...ఛీ... నేను చెప్పలేను. నానోటితో అనలేను. నిన్ను సుఖపెట్టలేని నిర్భాగ్యుణ్ణి..."

శారద సీతారాం పాదాలను తాకుతూ... కన్నీరు చెక్కిళ్ళను ఆర్ద్రము చేయగా అన్నది, "అలా మీరే బెంబేలుపడితే ఎలా చెప్పండి. నాకిక్కడ ఏలోటూ లేదు. హాయిగా ఉన్నది. అన్నివందలమైళ్ళదూరంలో ఉన్నా, మీ సుఖంకోసం ఎల్లప్పుడూ దేముణ్ణి ప్రార్థిస్తుంటాను.

మీరు సుఖంగా తిరిగి రావాలి. అప్పటివరకూ యిక్కడే అత్తగారితో ఉంటాను. ఎక్కడికీ వెళ్ళను. మనం దురదృష్ట వంతులమని ఎందుకనుకోవాలి. అలా ఎన్నటికీ జరుగదు. ముందున్నవన్నీ మనకు మంచిరోజులే. చూస్తూఉండండి."

♦ ♦ ♦

పదిహేనురోజులూ యిట్టే గడిచినై ... బాబుకు మందులు కొనిఇచ్చి; శారదకు కొంత డబ్బు అవసరాలకు యిచ్చాడు సీతారాం. శారదకు ధైర్యం చెప్పి; సీతారాం ఫిరోజ్‌పూర్ తిరిగి వచ్చేశాడు.

♦ ♦ ♦

డ్యూటీలో చేరినా సీతారాం యింటి ఆలోచనల తోనే ఎప్పుడూ విచారంగా ఉండేవాడు. శారద ఓర్పు, సహనమూ, శాంతము, తన భావిజీవిత నిర్మాణానికి పునాదులు. ఆమె ధైర్యము, ఆశావాదిత్వమే తిరిగి తనకు భవిష్యత్తుపై ఆశను రేకెత్తించింది. ఆరోజు శారద ధైర్యం చెప్పకపోయినట్లయితే, తను ఇంకా బెంబేలుపడి, పిరికివాడైపోయేవాడు. అయినా శారద, సుఖపడటంలేదన్న విషయం యథార్థం. తనూ, తన భవిష్యత్తిలా ఉంటుందని ఎన్నడూ ఊహించలేదు. క్లాసువస్తుందని, తర్వాత, ఏదైనా వీలుంటే చదవడమో, లేక ఉద్యోగంలో చేరడమో చేయవచ్చునని అనుకొన్నాడు. కానీ అన్నీ తారుమారై పోయినై. శారద తనదిగావడంమాత్రం తన అదృష్టం. కానీ ఆమెకు అన్నీ కష్టాలే. చిన్నప్పటినుండీ అల్లారుముద్దుగా పెరిగిన శారద, యిన్నికష్టాలు పడవలసి ఉన్నది.

అయినా, ఆమెకు విచారమన్న మాటలేదు; మంచిరోజులు తప్పక వస్తాయన్న ధైర్యం...పైగా.

నారాయణ, సీతారాంను విచారంనుండి మళ్ళించాలని ఎన్నో ప్రయత్నాలు చేసేవాడు. కారణం ఏమిటని అడిగినా సీతారాం ఒక్కసంగతీ అతనితో చెప్పలేదు ఎన్నడూ.

యిటు సీతారాం వచ్చేసినప్పటినుండీ అనసూయమ్మ శారదను తిట్టడం; సాధించడం ఎక్కువైంది. ఉత్తరాల విషయం, డబ్బువిషయం శారదే కావాలని చెప్పి సీతారాంను పురికొల్పిందని వాదన. శారదమాత్రం ఏదానికీ జవాబు యిచ్చేదికాదు. చిన్నారిబాబును, బాబులో సీతారాం పోలికలను చూచుకొంటూ; శాంతంగా గడుపుతోంది; ఒక విధమైన నిర్లిప్తతను అలవరచుకొన్నది.

సీతారాం యింటికి ఉత్తరం వ్రాశాడు మళ్ళీ. శారదకుకూడా విడిగా వ్రాశాడు. జవాబు ఈసారన్నా వస్తుందేమోనని ఆశ ...

యింతలో సీతారాంకు మరికొంత బాధావహమైన వార్త చేరింది. వాళ్ళ రెజిమెంట్ కొన్నాళ్ళపాటు మలయాలో పనిచేయాలట. ఆర్డరొచ్చింది. వారం రోజులలో బయలుదేరాలి ... యిప్పుడే శారదను అన్యాయంచేసి, ఒంటరిదాన్ని చేసి యింతదూరం వచ్చాడు. ఇప్పుడు మన దేశమనన్నా ఒక రకమైన సంతృప్తి మెదులుతోంది. మలయా మన దేశం కాదు. మన ప్రజ, మన భాష కాదు.

అదలా ఉంచి శారదకు యింకా దూరమైపోతున్నాను. అని సీతారాంకు దిగులు, విచారం ద్విగుణీకృతమైనయ్...

ఒకవైపు క్రొత్త ప్రదేశాన్ని, క్రొత్త ప్రజను, సరి క్రొత్త వాతావరణాన్ని చూసి ఆనందించపోతున్నానునే ఉత్సుకతకూడా ఉండకపోలేదు. మరోవైపు తన జీవిత భాగ స్వామినినుండి యింకా దూరంగా, అతి దూర తీరాలకు నెట్టివేయబడుతున్నాననే దిగులు అతని హృదయాన్ని కద లించివేస్తూంది ... కాని వేరు గత్యంతరం లేదు. కర్త వ్యాన్ని నిర్వహించి తీరాలి.

శారద మూర్తీభవించిన విషాదంతో అతనిఎదుట నుంచొని, 'నిన్ను ప్రేమించి హృదయాన్ని అర్పించినందు కిదేనా ప్రతిఫలం?' అన్నట్లు అతని కళ్ళముందు ఆమె మూర్తి లీలగా తారట్లాడింది.

కాని అతను ఏమీ చేయగలిగే స్థితిలో లేడు. ఆవే దనా కడలికి వారధి కట్టి, తాత్కాలికోపశమనం కలిగించు కొని ప్రయాణపు తయార్లలో లీనమయ్యాడు సీతారాం అందరితోపాటు.

♦ ♦ ♦

ఈ వారంరోజులూ ఎలా గడచినయ్యో, ప్రయా ణపు తయార్లలో ఏమీ తెలియలేదు. తీరా బయలుదేరే వేళ్ళకి యింటినుండి ఉత్తరం రాలేదని జ్ఞాపక మొచ్చింది సీతారాంకు.

తను యిలా మలయా వెళ్తున్నట్లుమాత్రం, బయలుదేరే

ముందు యింటికి ఉత్తరం వేశాడు. తరువాత భారహృదయంతో సీతారాం అందరితోబాటు కలకత్తా జేరాడు.

కలకత్తాలో ఓడ ఎక్కేముందు 'క్రొత్త దేశానికి వెళ్ళబోతున్నాం. ఫ్రెండ్స్ బాగా ఎంజాయ్ చెయ్యండి' అన్నాడు జేమ్స్ నవ్వుతూ సిపాయిలనందర్నీ ఉద్దేశించి.

సీతారాం ఓడ ప్రయాణంలో బాగా ఆనందించగలిగాడు. గొప్ప అనుభూతి, ఆ మహార్ణవపు మహోన్నత తరంగాలు, శరీరాన్ని పులకింపజేసే చల్లని సముద్రపుగాలి, సూర్యోదయ సూర్యాస్తమయ సమయాల సముద్రపు అగాథాల్లో ప్రతిఫలించే వింత రంగులు, రాత్రిపూట అంబరంలో సంబరంతో మెరసిపోయే చందమామ, నక్షత్రాల విన్యాసం; వింతవింత అనుభూతులతో, వింత లోకాల్లో తేలిపోయాడు అంతా.

రాత్రిపూట నడిసముద్రంలో డెక్ మీద అంతా నారాయణ మాండొలిన్ వింటూ చల్లని గాలికి మైమరుస్తూ ఆనందించారు.

♦ ♦ ♦

మలయా చేరినతరువాత సీతారాంకు అంతా ఏదో గాఢ సుషుప్తిలో కలలు గన్నట్లు అనిపించింది. మన భాష మన లోకం కాదుమరి. ప్రజల వేషభాషలు, పరిసరాలు, వాతావరణం, అంతా క్రొత్తగా భిన్నంగా వున్నవి.

అప్పటికి సీతారాంవాళ్ళు మలయావచ్చి నాలుగు రోజులయింది. సీతారాం నారాయణలను మరల స్టోరులోనే ఉంచారు. స్టోరులో అప్పుడప్పుడూ కొంచెం విశ్రాంతి

దొరుకుతూఉంటుంది. సీతారాం నారాయణ సాయంత్రం పూట ఒకరోజున అలా షికారుకు వెళ్ళారు. అలా నాలుగు వీధులూ చూసివస్తూంటే అచ్చటి కూరలమార్కెట్టు కన పడింది. అక్కడ ఎలాంటి కూరలుంటయ్యోనసే ఉత్సుక తతో లోపల కెళ్ళారు యిద్దరూ. అక్కడక్కడా కూర లున్నా, ఎక్కువగా నీటిపాములు, చచ్చినకప్ప కళేబరాలు వేలాడదీయబడి ఉన్నయ్. అవికూడ వారి భోజనాదులలో ఒక భాగమేనట. సీతారాం నారాయణల ఆశ్చర్యానికి మేరలేకపోయింది. తెగ నవ్వుకొన్నారు; అచ్చటి భోజన పదార్థాలగురించి, యితర వింత ఆచార వ్యవహారాదుల గురించి చూచి, కొంత చెప్పగా విని.

సీతారాం యింటికి ఉత్తరం వ్రాశాడు. ఇంటికి డబ్బు పంపే ఏర్పాటుకూడ చేయబడింది. సీతారాం శారదనుగురించి, పిల్లవాడిగురించి విచారిస్తున్నా; మలయా చేరిన తర్వాత, ఉద్యోగ వ్యవహారాలలోనూ; స్నేహితుల ఆటపాటల్లోనూ, ఆనందంగా పాల్గొంటున్నాడు.

♦ ♦ ♦

మలయాంలో కింగ్స ఎవెన్యూలో ఇండియన్ కల్చ. రల్ అసోసియేషన్ ఉన్నది. కింగ్సఎవెన్యూలోనే, ఎక్కువ మంది భారతీయులున్నారు; ప్రతివారమో; ప్రతిపదిహేను రోజులకో అసోసియేషన్ తరఫున; నృత్యగాన చిత్రకళాది ప్రదర్శనలు అచ్చట జరపబడి, ప్రత్యేకించి భారతీయులనే కాకుండా, వేలాది భారతీయేతరులనుకూడ ఆకర్షిస్తూ

ఉంటయ్. అక్కడ, ఎవ్వరైనాసరే, వారివారి ప్రావీణ్యత లను ప్రదర్శించవచ్చు.

సీతారాం వాళ్ళ రెజిమెంట్ కింగ్స్ ఎవెన్యూకు దగ్గరగానే ఉన్నది.

ఒకరోజు సాయంత్రం సీతారాం, నారాయణ, మరి కొందరు సిపాయిలు, ఆ థియేటరులో ఏదో ప్రదర్శన ఉన్నదంటే వెళ్ళారు.

ప్రదర్శనకు వచ్చిన వారిలో చాలమంది భారతీయు లున్నారు. చాలరోజుల తరువాత మన వాతావరణం కని పించడంతో; సీతారాం వాళ్ళకు ప్రాణం లేచివచ్చినట్ల యింది. కావాలని స్వయంగా పరిచయం చేసికొని వీరితో వారితో కొంతసేపు సంతోషంగా మాట్లాడుకొన్నారు. ఆరోజు ప్రోగ్రాములలో ముఖ్యమైనది...మిస్టర్ జిమ్ ఎండ్ కంపెనీ మ్యూజిక్ ప్రదర్శన.

మిస్టర్ జిమ్ అండ్ కంపెనీ మలయాలో వందలాది పాశ్చాత్య సంగీత ప్రదర్శనలిచ్చి గొప్పపేరు సంపాదిం చారు. వారు అప్పుడప్పుడూ ఇక్కడికికూడ వచ్చి ప్రద ర్శన లిస్తూ ఉంటారు.

ఆరోజు నారాయణ తన మాండొలిన్ తెచ్చు కున్నాడు వచ్చేటప్పుడు; వీలుదొరికితే తనుకూడా తనకు వచ్చినది ప్రదర్శించవచ్చునని.

సీతారాంవాళ్ళకు పరిచయమైన భారతీయులలో డాక్టర్ శర్మగారు ముఖ్యులు. ముఖ్యంగా ఆంధ్రుడవడం

వలన ఆయన సీతారాం నారాయణలకు అతి సన్నిహితుడు కాగలిగాడు.

డాక్టరుగారిది విశాఖపట్టణం. తల్లి చిన్నప్పుడెప్పుడో చనిపోగా, తండ్రే పెంచి పెద్దచేశారట. బోలెడంత ఆస్తి ఉండేది. ఈయన ఒక్కరే కొడుకు. శర్మగారు మెడిసిన్ చదవడానికి ఇంగ్లండు వెళ్ళారు. అక్కడ చదువులో ఉండగానే; తండ్రికూడ హఠాత్తుగా పోయారట. శర్మగారు అక్కడే పరిచయమైన ఒక ఆంగ్లేయ యువతిని వివాహం చేసికొని, తరువాత మలయా వచ్చి స్థిరపడిపోయారట.

డాక్టరు శర్మగారు కల్చరల్ అసోసియేషన్ కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొంటూ ఉంటారు. ఆయనకు సంగీతమన్నా; నృత్యమన్నా చాలయిష్టం.

ఆయన సహాయంవల్లనే నారాయణ మాండొలిన్ వాయించడానికి అనుమతి సంపాదించారు.

మిస్టర్ జిమ్ వాళ్ళ ప్రదర్శన తరువాత, డాక్టరు శర్మగారే స్వయంగా స్టేజిమీద నారాయణను ప్రేక్షకులకు పరిచయంచేసి; మాండొలిన్ వాయిస్తాడని చెప్పారు.

నారాయణ ప్రావీణ్యతకు అందరూ ముగ్ధులయినారు. జిమ్‌బృందంతోసహా నారాయణను ప్రశంసించి అతనికి పరిచయస్తులయినారు. నారాయణ ప్రతిభను; అతని చాతుర్యాన్ని చూచి డాక్టర్ శర్మగారుకూడ గర్వపడ్డారు.

చివరికి అందరూ విడిపోయేప్పుడు శర్మగారు, సీతారాం నారాయణలను మర్నాడు సాయంత్రం తన యింటికి

రావలసిందిగా కోరాడు. తన బంగాళా కింగ్స్ ఎవెన్యూకి దగ్గరేనని గుర్తులు చెప్తూ; మరునాడు సాయంత్రం వారికోసం ఎదురుచూస్తూ ఉంటానన్నాడు.

డాక్టరుగారి ఆనందానికి మేరలేదు. తన దేశం, తన మనుషులు. అందులో పాతిక సంవత్సరాలక్రితం మెసలిన వాతావరణం. ఆయన ఉత్సాహం వర్ణనాతీతం. సీతారాం నారాయణల పరిచయంతో వచ్చిన మార్పయిది.

♦ ♦ ♦

సీతారాం వాళ్ళు మర్నాడు శర్మగారింటికి వెళ్ళే టప్పటికి ఆయన వీరికోసమే ఎదురు చూస్తున్నాడు. వాళ్ళ డాబాకూడా చక్కగా అందంగా ఉంది. చుట్టూ ప్రహరీ, లోపల చక్కని తోట. వీరిని చూస్తూనే నవ్వుతూ లేచి వచ్చి సీతారాం భుజాలు కుదిలించివేస్తూ; "యిప్పుడే అను కొంటున్నా; తప్పకుండా వస్తారని ... చాలసంతోషం, కూర్చోండి...అమ్మాయ్" అంటూ హడావుడిగా లోపలి కెళ్ళాడు.

కొన్ని నిమిషాల తరువాత శర్మగారితో, భార్య, ఇద్దరు అమ్మాయిలు వచ్చారు. శర్మగారే అన్నారు. 'వీరే మా అమ్మాయిలు. పెద్దమ్మాయి మేరీ, రెండవది లూసీ. మా ఆవిడ విక్టోరియా..."

"వీరి పేరు సీతారాం, వీరు నారాయణ. మిలిటరీ స్టోర్స్‌లో పనిచేస్తున్నారు. మనదేశంనుంచి వచ్చారు. నారాయణ మాండొలిన్ బాగా వాయిస్తారు." అంటూ శర్మగారే పరిచయంచేశారు.

సీతారాం నారాయణ నమస్కరించారు. మిసెస్ శర్మ, మేరీ, లూసీలు చాలా సంతోషించారు. శర్మగారే చెప్పారు లూసీకి సంగీతమన్నా, సినిమాలన్నా తెగపిచ్చి అని. అలాగే లూసీ ఆనందానికి అవధులేకపోయింది, నారాయణ మాండొలిన్ వాయిస్తాడని తెలియగానే. మిసెస్ శర్మ, మేరీ, లూసీలకు తెలుగు కూడ, అంతబాగా రాకపోయినా, కొంతవచ్చు. అర్థంచేసికోగలుగుతారు. శర్మగారే పట్టుబట్టి నేర్పారట. మేరీ లూసీలుకూడా వస్త్రధారణతప్ప, చూడడానికి తెలుగువారి మాదిరిగానే కనిపిస్తారు. శర్మగారి పోలికలొచ్చినయ్ వాళ్ళకి.

కొంతతడవు అందరూ తోటలో కూర్చుని సంతోషంతో కబుర్లు చెప్పుకున్నారు. మలయా విశేషాలూ అక్కడి ప్రజల ఆచారవ్యవహారాలు; అన్ని మిసెస్‌శర్మ, మేరీ, లూసీలు వివరించి చెప్పారు.

తరువాత లైట్‌రిఫ్రెష్‌మెంట్ తీసికొని, సీతారాం, నారాయణ టైము కావడంతో వారివద్ద సెలవు పుచ్చుకొని వచ్చేశారు.

సీతారాం వాళ్ళు వచ్చేటప్పుడు మేరీ, లూసీలు వారిని తరచు వస్తూపోతూ ఉండమని కోరారు.

♦ ♦ ♦

"నీకు నిద్రరాకపోతే, త్వరగా ముగిస్తానోయ్ మురళీ. నీ నిద్ర చెడగొట్టా నివాళ" ఎటోచూస్తూ అన్నారు మూర్తిగారు.

"ఫరవాలేదు బాబుగారూ. యింతవరకు చెప్పి మానేస్తారా ... వింటాను చెప్పండి"

"అయితే టూకీగా చెప్తాను మురళీ, నాకూ ఆయాసంగా ఉన్నది. విను."

రోజులు గడుస్తున్నకొద్దీ సీతారాం నారాయణలకు డాక్టర్ శర్మగారి కుటుంబానికీ సన్నిహితత్వం ఎక్కువయింది.

సమయం దొరికినప్పుడల్లా సాయంత్రం వేళల్లో సీతారాం నారాయణ తరచుగా డాక్టరింటికి వెళ్ళి ప్రొద్దు పుచ్చేవారు. అక్కడ గడిపినంతసేపూ, యింటివద్ద వున్నట్లుగా ఉండేది వారికి. కాని దేశంలో కొంతగాకపోతే కొంతయినా తెలుగు మాట్లాడేవాళ్ళు దొరికారు మరి.

సీతారాం నారాయణలంటే డాక్టరు శర్మగారు కూడా అమితమైన అభిమానం చూపేవారు.

నారాయణ, లూసీలకు స్నేహంకలిసింది. కారణం లూసీ సంగీతాభిమాని. నారాయణ మాండొలిన్ తరచు వింటూ మెచ్చుకొంటూ ఉండేది. యిద్దరూ వారింటికి వెళ్ళినా, నారాయణ లూసీ ఒక జట్టు. వారి మాటలు వారి అభిప్రాయాలే వేరు. నవ్వుతూ త్రుళ్ళుతూ కబుర్లు చెప్పుకొనేవారు. లూసీ అతి చలాకీ అమ్మాయి. ఎప్పుడు చూచినా నవ్వుముఖంతో కిలకిలానవ్వుతూ ఉండేది. నారాయణను ప్రతి సంగీతపార్టీకి తీసికెళ్ళి చూపించి, అందరికీ పరిచయంచేసేది. క్లబ్బులకు తీసికెళ్ళేది. కొన్నిచోట్ల నారాయణ మాండొలిన్ వాయించేవాడు.

రోజ్ మేరీ మాత్రం ఎప్పుడూ నిర్మలంగా, ప్రశాంతంగా ఉండేది. ఆమెకు సాహిత్యాభిలాష ఎక్కువ. ఎప్పుడూ ఏదో పుస్తకం ఆమె చేతులో ఉండేది. సీతారాం మేరీని చాల అభిమానించేవాడు. ఆమె పద్ధతులనూ, ఆమె అలవాట్లనూ మెచ్చుకొనేవాడు. వారు తరుచుగా ఏ పుస్తకం మీదో చర్చచేస్తూ, వారివారి అభిప్రాయాలు తెలుపుకొనేవారు.

డాక్టరుగారు, సీతారాం, మేరీ కూర్చున్నారంటే వారి మాటలలో, ప్రస్తుతం టౌనులో ప్రదర్శింపబడే సినిమా దగ్గరనుండి రాజకీయాలు, పెద్ద పెద్ద గ్రంథ విమర్శలు...ఒకటేమిటి...వారి ఆలోచనలు ప్రపంచాన్ని చుట్టివచ్చేవి.

ఒకొక్కరోజున నారాయణ, లూసీలు కూడ వీరితో కలిసేవారు. ఆరోజు నారాయణ మాండొలిన్ మాత్రమే ముఖ్యమైన కార్యక్రమం. మరో చర్చ ఉండేదికాదు.

సాయంసమయాల్లో నారాయణ లూసీ బీచ్‌కి వెళ్ళేవారు డాక్టరుగారి కారులో. లూసీ డ్రైవ్ చేసేది.

రోజురోజుకూ నారాయణ లూసీల స్నేహితం వింత పరిణామాలు దాల్చింది. లూసీ నారాయణ సాన్నిధ్యం కోసం పరితపించేది. అతను లేనిదే క్షణంకూడా గడపలేక పోయేదామె. నారాయణే ఆమె సర్వస్వం.

మలయావచ్చిన తరువాతకూడా అనసూయమ్మకు ప్రభుత్వం డబ్బు పంపుతూనే వున్నది. సీతారాంకు ఉత్త

రాలు రావడంలేదు. శారదనుండిగూడ ఉత్తరాల జాడలేదు.

సీతారాంకు ఈ విషయంలో బాధగాఉన్నా గుండె దిటవు చేసికొని కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. రాబోతా యనుకొనే మంచి రోజులను తలచుకొని ఆనందిస్తూ మధు రూహాలతో గడిపేవాడు.

అతని మనోవికారాలను, విచారాలను తాత్కాలి కంగానైనా మరువగలగడానికి ముఖ్యమైన కారణం డాక్టరు శర్మగారి కుటుంబపు మంచితనమూ, ముఖ్యంగా రోజ్ మేరీ సాంగత్యము. ఒక్కొక్కరోజున మేరీతో మాట్లాడుతున్నా సీతారాం దీర్ఘాలోచనల్లో ఉండేవాడు. మేరీ అతని ఉదాసీ నతకు కారణం గ్రహించడానికి ఎన్నోవిధాలుగా ప్రయ త్నించేది. సీతారాం విచారంతో ఉంటే ఆమె భరించలేక పోయేది. ఒక్కొక్కరోజున ఉండలేక ఆమే అడిగేది, "ఏమిటి సీతారాం, అలా వున్నావ్. సంగతేమిటి చెప్పవా ?" అని గోముగా.

సీతారాం మాత్రం ఆ ప్రశ్నతో ఉలిక్కిపడేవాడు. ముఖకవళికలను మార్చుకొని; ఇంకో ప్రస్తావన తెచ్చి ఆసంగతి మరపించేవాడు.

మేరీ సీతారాంను ఆలోచనవలయాలనుండి మళ్ళిం చాలని, సంతోషపెట్టాలని ప్రయత్నించేది.

సంవత్సరన్నర అయింది సీతారాం నారాయణ మలయావచ్చి. నారాయణ లూసీల స్నేహం యినుమడించి

పరస్పరం ప్రేమగా మారింది. వారి ప్రేమ సామ్రాజ్యానికి నారాయణ మహారాజు. లూసీ పట్టమహిషి.

సీతారాం, మేరీల స్నేహితంకూడా యినుమడించినా సీతారాం కుటుంబ పరిస్థితులేవీ ఆమెకు తెలియదు.

* * *

ఒకరోజున సాయంత్రం సీతారాం, మేరీ, డాక్టర్ గారు, కల్చరల్ క్లబ్బులో ఏదో ప్రదర్శన జరుగుతుంటే వెళ్ళారు. లూసీకి అలాంటివంటే యిష్టంలేదు. ఆరోజు నారాయణకూడా స్టోర్సులోనే ఏదో పనుండి ఆగిపోయాడు.

నారాయణ ఆఫీసుపని పూర్తిచేసికొని డాక్టర్ గారింటికి వచ్చేటప్పటికి, చిరుచీకటి అప్పుడే ప్రపంచాన్నావరిస్తోంది. నారాయణ ఏదో మధురాలోచనలలో లోనికెళ్ళాడు.

కుడివైపుననే లూసీగది ఉన్నది. లూసీ కిటికీ ప్రక్కనే బెడ్ పై పడుకొని, కిటికీగుండా నీలాకాశాన్ని, అప్పుడే ప్రభవించి ప్రభాసించే చందురుణ్ణి చూచి పరవశమైపోతోంది.

లూసీని చూడగానే నారాయణ మనస్సు పులకించింది. చప్పుడు చేయకుండా మెల్లిగా వెళ్ళి కళ్ళుమూశాడు నారాయణ. అతని హస్తస్పర్శకు లూసీ ఉలిక్కిపడింది. తెలుసుకొని; నవ్వుతూ; ఎరగనట్లు అన్నది "అబ్బ - ఎవరూ !"

నారాయణ జవాబు చెప్పలేదు.

"అబ్బ - ఎవరు బాబూ"

"చెప్పారో చూతాం"

"అబ్బ ఎవరో తెలియడంలేదు బాబూ, భయమేస్తోంది"

"అబ్బో... ఏం తెలియదు బుజ్జిపాపాయివి. నువ్వు చెప్పకపోతే నేను చెప్తాను. మరి నాకేమిస్తావ్"

"ముందు ఎవరో చెప్పితే"

నారాయణ పట్టువిడువలేదు.

"ఈ రాణీ కళ్ళుమూయడానికి ఒక్కడికే అర్హత ఉన్నది. అలాంటప్పుడు ఎవరో వేరే చెప్పనవసరంలేదు." కళ్ళు మూసిఉంచే అరచేతులతో లూసీ బుగ్గల్ని మెత్తగా మెల్లగా స్పర్శించాడు నారాయణ.

"నేను చెప్పలేను బాబూ, మీరే చెప్పండి. నాకు సిగ్గేస్తుంది"

"మరి చెప్పినందుకు బహుమానం ?"

"అదికూడా మీరే కోరుకోండి"

"అలాగా, సరే... నేనెవరో తెలుసా–నీ హృదయ సామ్రాజ్యాధిపతిని. లూసీ మహారాణీ ప్రేమ సామ్రాజ్యైక చక్రవర్తిని–నారాయణను"

కళ్ళు తెరచి నారాయణ లూసీ కళ్ళల్లోకి చూశాడు. లూసీ పద్మంలాంటి వదనంలో సిగ్గు దొంతరలు ముంచుకొచ్చినయ్.

సిగ్గునభినయించే ఆమె మోమునుచూచి, కిటికీగుండా దొంగచూపులు చూస్తున్న రేడు సిగ్గుపడ్డాడు—

"ఎందుకో... సిగ్గు"

కళ్ళల్లో కళ్ళుకలిపి త్రాగేసేటట్లు చూస్తూ నారాయణ కాంక్షతో ఆమెను తన వైపుకు త్రిప్పుకొన్నాడు...

లూసీ, నారాయణ, తన్మయత్వంలో, మధురానందంలో, పరిసరాలు, తనువులు మరిచి ఏకమైనారు.

*　　　　*　　　　*

జరిగినది తలచుకొనేటప్పటికి లూసీ ముఖపద్మం వడలి పేలవమయింది - జరిగినది తలచుకొని నారాయణ కూడా భయపడ్డాడు.

లూసీ వణకిపోయింది. భయపడుతున్న లూసీని చూస్తూ అన్నాడు నారాయణ-భయపడుతున్నావా లూసీ"

"నాన్నగార్కి తెలిస్తే-"

"నిజమే డాక్టర్ గార్కి తెలిస్తే!... ద్రోహినని, మోసగాడినని... యిప్పటివరకు తనపైనున్న గౌరవం, సద్భావం... మంటగలిసి పోతాయ్."నారాయణ కంపించిపోయాడు. కాని ధైర్యంతో అన్నాడు. "భయపడకు లూసీ, ఏమీ కాదులే... డాక్టర్ గారితో నేను మాట్లాడుతాను. నువ్వేమీ అధైర్యపడబోకు"

లూసీకి ధైర్యంచెప్పి తప్పుకువచ్చాడేకాని నారాయణ మనస్సుకు శాంతిలేకపోయింది.

తను పొట్టపోసుకోవడానికి మిలిటరీలో చేరడమేమిటి? యిలా కానిదేశం రావడమేమిటి? డాక్టర్ గారికుటుంబంతో స్నేహమేర్పడి, లూసీతో ప్రేమబంధం కలవడమేమిటి ? ఆ క్షణంలో తను, వెనుకా ముందూ ఆలోచించలేకపోయాడు. పర్యవసానం ఆలోచించకుండా విచక్షణాజ్ఞాన

శూన్యతతో, ఆ క్షణిక వ్యామోహానికి, బలహీనతకు లోబడిపోయారు. ఇప్పుడు లూసీ సంగతేమిటి. ప్రస్తుతం తెలియకపోయినా; కొన్నాళ్ళకన్నా డాక్టరుగారికి, భార్యకు అందరికీ తెలియకపోదు. లూసీ తనమీద గంపెడు ఆశలతో, కలలుగంటూ ఉంటుంది. ఆమె ఎంత భయపడ్తోందో ఈ విషయంలో. తనుమాత్రం శర్మగారిదగ్గరకు వెళ్ళి ఎలా తలెత్తుకు మాట్లాడగలుగుతాడు...నారాయణకంతా అయోమయంగా తోచింది.

ఏమీ చేయడానికి తోచక, మర్నాడు మామూలుగా నారాయణ శర్మగారింటికెళ్ళలేదు.

వారం గడిచింది. సాయంత్రమవుతోంది. సీతారాం డాక్టరుగారింటికి వెళ్ళేప్పటికి, డాక్టర్ గారు, మేరీ, డాక్టర్ గారి భార్య ఎవరో తెలిసిన ఫ్రెండ్స్ ఇంటికి వెళ్ళారట. లూసీమాత్రం సోఫాలో కూర్చుని ఉంది.

సీతారాంను చూస్తూనే గౌరవభావంతో లేచి నుంచోంది. లూసీకి సీతారాం అంటే అమితమైన గౌరవ ప్రపత్తులు. లూసీ ముఖకమలం వడలిపోయి నిర్జీవంగా ఉన్నది. కళ్ళు ఉబ్బి, అప్పటివరకూ ఏడ్చినట్లుగా ప్రస్ఫుటంగా కనుపించింది. సీతారాంకుకూడా అనుమానం వేసింది లూసీని చూడగానే. అంతకుముందు ఎన్నడూ అంత ఉదాసీనంగా లూసీ ఉండనేలేదు. లూసీ ఎల్లప్పుడూ చలాకీగా నవ్వుతూ తుళ్ళుతూ, క్లబ్బులకు, షికార్లకు, నారాయణతో కలిసి తిరుగుతూ ఉండేది.

సందిగ్ధంతో లోపలికడుగు పెడ్తూనే'రా అన్నయ్యా, కూర్చో అలా" అన్నది తలవంచుకొంటూనే.

"నాన్నగారూ వాళ్ళూ ఏరమ్మా."

"లేరన్నయ్యా...జార్జిటవున్‌లో నాన్న స్నేహితు డొకాయన ఉన్నారు. అంతా అక్కడికి కెళ్ళారు. నాన్నగా రన్నారుకూడా, సీతారాం అన్నయ్య వస్తారేమో, వస్తే ఇలా ఉండలేకపోయినందుకు క్షమించమని చెప్పమన్నారు."

"ఫరవాలేదమ్మా...అయ్యో యింతమాత్రానికే... నువ్వు అలా ఉన్నావేం?!."

ఆ ప్రశ్నతో లూసీ ముఖం విచారంతో నల్ల బడింది. దుఃఖం ఆపుకోలేక చేతులు అడ్డంపెట్టుకొని ఏడ్చింది.

"అయ్యో చెల్లీ. అదేమిటి. ఎలాగో ఉంటే అడి గాను కాని...క్షమించు. నాన్నా, మేరీ వస్తే నే నొచ్చా నని చెప్పు. రేపు కలుస్తా మళ్ళీ" సీతారాం లేచాడు వెళ్ళ డానికి.

లూసీ తలెత్తి శీతారాంను చూచింది...ఆమెవదనం నిర్వేదావృతమై వర్షించబోయే మేఘశకలంలా ఉన్నది.

"అన్నయ్యా" ఏదో చెప్పబోయింది లూసీ.

శీతారాం ఆగి...వెనక్కితిరిగి "ఏమిటమ్మా... చెప్పు...ఏదో దాస్తున్నావ్...ఫరవాలా ... అన్నయ్య నేగా చెప్పు." అన్నాడు అనునయంగా.

లూసీ జరిగినది చెప్పడానికి సిగ్గుపడినా, చివరి కెలాగో చెప్పింది శీతారాంకు.

శీతారాం ఉలిక్కిపడ్డాడు. నారాయణ, లూసీల స్నేహితం యిలాంటి క్రొత్తపుంతలు తొక్కుతుందని ఎన్నడూ అతను అనుకోలేదు. నారాయణ అలాంటివాడు కాదే. అయినా యౌవ్వనం అలాంటిది. పాలపొంగులాగా అకస్మాత్తుగా ఎలాంటి పనినయినా చేయిస్తుంది. అప్పటికి గానీ శీతారాంకు జ్ఞాపకం రాలేదు. నారాయణ వారం నుండీ డాక్టర్‌గారింటికి రానడంలేదని. యిప్పుడు అర్థమయింది. నారాయణ తనతో రాకపోవడంలోగల కారణం, అంతరార్థం.

"ఛెల్లీ ... తప్పు మానవసహజం. పొరపాట్లు అందరూ చేస్తూ ఉంటారు. వాటిని మెళుకువతో దిద్దుకోవడంలోనే ఉన్నది గొప్పదనం. యివాళ నారాయణను అడుగుతాను ఈ విషయంలో. వాడిని అడిగేముందు నిన్ను కూడా ఒకటి అడగతలచుకొన్నాను. నారాయణను వివాహం చేసికోడం నీ కిష్టమేనా?"

లూసీ సమ్మతించినట్లు తలఊపింది. సిగ్గుతో తల వంచుకొనే...అప్పటికిగాని లూసీకి ధైర్యంచిక్కలేదు. శీతారాం ఊరడించినతరువాత తృప్తిగా గాలి పీల్చుకొన్నది—

♦ ♦ ♦

రాత్రి పదిగంటలు కావస్తోంది. టెంబ్‌లో క్రొవ్వొత్తి కాలుతూ, కాంతిని చుట్టూ విరజిమ్ముతోంది. నారాయణ ఏదో ఆలోచిస్తూ పడుకొన్నాడు. శీతారాం కూడా ప్రస్తావన ఎలా తేవాలా అని సందేహిస్తున్నాడు.

బయట సెంట్రీల బూట్ల చప్పుడు – ఆ నీరవనిస్తబ్ధతలో ధ్వనిస్తున్నాయ్. చల్లటిగాలికి ఒళ్ళు జలదరిస్తోంది. పుచ్చ పువ్వులాంటి స్వచ్ఛమైన వెన్నెల ప్రపంచాన్ని ఆవ రించింది.

"ఏమిట్రా నారాయణా! అలా ఉన్నావేంరా!"

నారాయణ శీతారాం ప్రశ్నకు ఆలోచననుండి తేరుకొని ఉలిక్కిపడ్డాడు. మళ్ళీ శీతారాం అడిగాడు. ఇవాళ లూసీ నిన్ను అడిగింది. వారంనుండీ కనిపించడంలేదని యిదవుతోన్నది పాపం!"

నారాయణ అదిరిపోయాడు. విషయం శీతారాంకు తెలియలేదుకదా అని. జవాబు ఏమీ చెప్పలేక స్తబ్దుగా ఉండిపోయాడు.

"అసలు సంగతికూడ తెలిసింది. అనుకోకుండా ఎన్నోతప్పులు జరుగుతుంటయ్. ధైర్యంతో పరిష్కరించు కోవాలిగాని, విచారిస్తే ఏం లాభంరా ?"

నారాయణ తలవంచుకొన్నాడు.

"లూసీ నాకు అన్నీ చెప్పింది. ఆమె ఎంత భయ పడుతున్నదో చెప్పలేను. వారంనుండీ నువ్వు కనిపించటం లేదట. బెంబేలుపడి, క్రుళ్ళి క్రుళ్ళి ఏడుస్తున్నది. ఇటు చూడరా. నావైపు చూడు !"

నారాయణ తలెత్తి శీతారాం వైపు భారంగా, సిగ్గుతో చూచాడు.

"నిజమేనా ?!"

నారాయణ ఒప్పుకొన్నాడు. దిగ్గునలేచి సీతారాం

చేతులుపట్టుకొని అన్నాడు. "నాకేం శోచనుండా ఉందిరా. పొరపాటు జరిగింది. ఇప్పుడు నీ సహాయంకావాలి. ఎలా చెప్పాలా అని సంకోచిస్తుంటే, నువ్వే దారిచూపావ్."

"లూసీ దుఃఖం చూస్తూంటే, నేను భరించలేక పోయాను. అమాయకురాల్ని నట్టేట్లో ముంచడం మంచిది కాదు. నిన్నొకటి అడుగుతాను. కాదు, అర్థిస్తాను. ఒప్పుకొంటావా ?"

"ఆఁ"

"లూసీని పెళ్ళిచేసుకో. గొడవవుండదు."

"........"

"ఏం... ఏమిటీ ఆలోచన"

"ఏంలేదురా మరి..."

"ఊఁ మరి..."

"ఎలారా... పెళ్ళి చేసుకోడం. మనదేశం కాదు, మనవాళ్ళుకాదు. శర్మగారు మనవారయినా... వర్ణ సంకరం...నామనసొప్పడంలేదురా, క్షమించు."

"ఎందుకు ఒప్పదు... ఒప్పి తీరాలి. క్షమాపణలు-అభయాలతో నువ్వుచేసిన తప్పుడుపని ఒప్పు ఎలాగవుతుంది. నువ్వు లూసీని వివాహమాడితీరాలి. మనవాళ్ళు కాదు, సంకరం అంటావ్ కాదూ, మనవాళ్ళు, మనభాష, ఆమెను పూసుకుని తిరిగినప్పుడు, వళ్ళుతెలియని ఉద్రేకంలో నీ క్రూరకాంక్షలకు బలిచేసినప్పుడు ఏమైనయ్ ? మీ యిద్దరి వివాహానికి యిలాంటి అర్థంలేని వ్యర్థమైన అభ్యంతరాలు పనికిరావు. యిద్దరూ మనసిచ్చి పుచ్చు

కొన్నారు. నీకూ ఎవ్వరూ లేరు. కాని దేశంలో ఒక గౌరవనీయుణ్ణి అవమానపరచి, నీవు నగుబాట్లు పాల్పడేకన్నా; నిరభ్యంతరంగా లూసీని వివాహం చేసుకో. శర్మగారికి తెలిస్తే పరిస్థితులెలామారుతాయో చెప్పడంకష్టం. నేనన్నీ ఆలోచించే ఈ సలహా యిస్తున్నాను. నీకూ ఆలోచనాశక్తి ఉన్నది. ఆలోచించి నీ అభిప్రాయంచెప్పు. లూసీతో నీ వివాహం అనివార్యం, ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా, అటుపై నీ యిష్టం. నే చెప్పిందేదో చెప్పాను." కోపం వచ్చినా, సానునయంగానే అన్నాడు సీతారాం.

"మరి శర్మగారు వప్పుకోవాలిగదా. ఎలారా..."

"ముందు నీవు సరేనను. మిగతావి సానుకూలపరిచే బాధ్యత నాది. సరేనా... నువ్వేమీ సంకోచించాల్సిన అవసరంలేదు. లూసీగురించి నీకు బాగా తెలుసునుగదా. క్షణక్షణానికి, అభ్యుదయాన్ని, ఆధునికతను సంతరించుకొంటున్న ఈ సమాజంలో ఈ వివాహానికెలాంటి అభ్యంతరం, అడ్డంకి ఉండబోవు. అందరికీ సమ్మతమే అవుతుంది. శర్మగారితో నేను మాట్లాడగలను."

నారాయణ ఒప్పుకొన్నాడు.

నారాయణ హృదయమూ తేలికపడ్డది. యిటు శీతారాంకూడా తృప్తిగా గాలి పీల్చాడు తన ప్రయత్నము ఫలించినదని.

◆ ◆ ◆

స్టోర్సులో పని పూర్తిచేసికొని, జేమ్సు అనుమతి తీసికొని సాయంత్రం డాక్టరుగారింటికి వెళ్లాడు శీతారాం.

డాక్టరుగారు కోటలోకూర్చుని ఏదో ఆలోచిస్తూ, ఆకాశంలోకి చూస్తున్నారు. డాక్టరుగారి భార్యకూడా యింకో కుర్చీలో కూర్చుని, అల్లుకుంటోంది. శీతారాంను చూస్తూనే శర్మగారు, యింకోకుర్చీ చూపిస్తూ, "రావోయ్ శీతారాం, ఇలారా... కూర్చో" అన్నారు.

"ఊం... ఏమిటోయ్ సంగతులు ?"

"ఏమీ లేదండీ... మిమ్మల్ని ఒకటి అడుగుదామని వచ్చాను. చాలరోజులనుండి నా మనస్సులో మెదులుతోంది. కాని మీరేమనుకొంటారోఅని..."

"ఛా... అదేమిటి నాయనా... నేనేమనుకొంటాను. మీకూ, మా కుటుంబానికీ ఏదో పూర్వజన్మ సుకృతంవల్ల యింతిగట్టి స్నేహమేర్పడింది. సంతోషం. ఎందుకు సంకోచం. చెప్పు శీతారాం–"

"ఏం లేదండీ... మా నారాయణ, మీ లూసీని వివాహమాడటం మీకభ్యంతరం కాదనుకొంటాను."

డాక్టరు శర్మగారి సంతోషానికి అంతులేకపోయింది. అమాంతంలేచి సీతారాం చేయిపట్టుకొని లేపుతూ గాఢంగా కావిలించుకొన్నారు. మిసెస్ శర్మగారి ఆనందానికి హద్దులు లేకపోయినయ్.

"ఆహా ! ఎంతటి శుభవార్త... ఇవాళ మరపురాని సుదినం. ఇదటయ్యా సంకోచిస్తున్నావ్ అడగడానికి. భలేవాడివే. నారాయణకేసుయ్యా నిక్షేపం. నారాయణను నాఅల్లుడు జేసుకోడం నాకెంతో సంతోషం. అమ్మాయ్

లూసీ యిలారా... శీతారాం అన్నయ్య ఎలాంటి వార్త తెచ్చాడో చూడు..."

"నాకూ సంతోషంగా ఉన్నదండీ... ఈ అడిగేపని నారాయణ నాకు ఒప్పజెప్పాడు. తనే అడగడానికి సిగ్గు పడ్డాడు పెళ్ళికొడుకుగారు. నాకు తప్పదుగదా. స్నేహితుడి పెళ్ళి సంబంధం నా ద్వారా ఖాయపడిందంటే నాకూ సంతోషం..."

"చూడు సీతారాం. లూసీపెళ్ళి నాకిష్టమే. లూసీ ఉన్నది చూడు ... చిన్నపిల్ల. పెద్దది రోజ్ వివాహం కాకుండా, లూసీకి చెయ్యడం బాగుండదు. ఈవిషయం పెద్దమ్మాయ్‌తో మాట్లాడి చెప్తాను రేపు. కలిసివస్తే ఇద్దరి వివాహాలూ ఒక్కసారే చేద్దాం."

సీతారాం ఆనందం ఆర్ణవమే అయింది. డాక్టరు యింతత్వరగా ఒప్పుకొంటారని కలలోకూడ అనుకోలే దతను. ఈ ఉద్దేశ్యం వారికీ మనస్సులో ఉండి ఉంటుంది. లేకపోతే ఇంత త్వరగా పరిష్కారం కాకపోను.

"మేరీ, లూసీ లేరాండి ఇంట్లో!"

"అయ్యో; నామతి చూశావా. ఇందాక సంతోషంలో లూసీని కేకవేశాను. అది ఉంటేగా. షికారుకు వెళ్ళినట్లున్నది. కారు తీసికెళ్ళింది. మేరీ గదిలో చదువు కొంటూంది. ఇంతకుముందే అడిగింది మిమ్మల్ని."

సీతారాం వెళ్ళేటప్పటికి మేరీ సోఫాలో కూర్చుని ఏదో నవల చదువుకొంటున్నది.

సీతారాంను చూస్తూనే ఉత్సాహంతో, పుస్తకాన్ని ప్రక్కనపెట్టి, నమస్కారంచేస్తూ "రండి సీతారాం, కూర్చోండి" అన్నది లేచినుంచొని.

మేరీ ఆరోజు ఎందుకో హుషారుగా ఉన్నది. "ఏమిటి మేరీ చదువుతున్నావ్. నాన్నా అమ్మగారేమో తోటలో కూర్చున్నారు. నీవేమో ఇక్కడ పుస్తకంలో మునిగి పోయావ్. ఇక లూసీ ఎక్కడికెళ్ళింది?"

"లూసీ పైకెళ్ళింది. రండి. ఇలా కూర్చోండి. మీతో ముఖ్యవిషయ మొకటి మాట్లాడాలి."

లూసీ విషయమేమయినా తెలిసిపోయిందేమో ననుకొన్నాడు సీతారాం. సీతారాం సోఫాలో కూర్చున్నాడు. మేరీ అతనిప్రక్కనే కూర్చుంటూ అదొకవిధంగా సిగ్గుతో నవ్వుతూ అతని మొహంలోకి చూసింది.

"ఏమిటి మేరీ ముఖ్యవిషయం!"

మేరీకి సీతారాం అడుగుతున్నకొద్దీ సిగ్గు విపరీతమైంది. ఎలాచెప్పాలో తెలియక తికమకపడుతూ సందేహించింది.

"చెప్పు. మేరీ ... ఏవిషయం ... ఏదన్నా పుస్తకం గురించా?"

"అదికాదు సీతారాం. పుస్తకం కానేకాదు, టాపిక్ కొత్తది. మిమ్మల్ని ఒకటి అడుగుతాను. చెప్పండి. రెండేళ్ళనుండి స్నేహంచేశాము. మన యిద్దరి భావాలూ, ఉద్దేశాలూ ఒకటే కూడా. ఎందుకో మీరంటే ప్రత్యేకమైన అభిమానం కలిగింది. మిమ్ము మనస్ఫూర్తిగా ప్రేమించాను.

నన్ను మీరు వివాహమాడడానికి ఎలాంటి అభ్యంతరం ఉండదనుకొంటాను" తలవంచుకొనే అన్నది మేరీ.

సీతారాం అదిరిపోయాడు. అతనికంతా అయోమయంగా తోచింది. స్తంభీభూతుడై క్షణకాలం అచేతనుడై మేరీ వదనంలోకిచూస్తూ ఉండిపోయాడు.

మేరీని తను వివాహమాడాలా. యిన్నాళ్ళూ ఆమె తనను అదేదృష్టితో స్నేహం చేసిందన్నమాట. తాని న్నాళ్ళూ ఆమెను ఒక సోదరిగా భావిస్తున్నాడేగాని, ఎలాంటి కుత్సితపు దృష్టితోనూ స్నేహంచేయలేదు. మేరీకి అలాంటి ఉద్దేశ్యాలూ కలగడానికి తానే తనకు తెలియకుండా దోహదం చేసినట్లయితే తనపాపానికి నిష్కృతి లేదు.

సీతారాం ముఖతీవ్రతనుచూసి మేరీ భయపడిపోయింది. తను కనిన కలలన్నీ భస్మీభూతమై పోతాయేమోనని అనుమానించిందామె.

"క్షమించు చెల్లీ!"

చెల్లీ!! ... తను ఎవరినైతే పెళ్ళాడి జీవితాంతం వారి పాదసేవచేసి తరిద్దామనుకొన్నదో — వారే 'సోదరీ' అని సంబోధన! మేరీ భీతహరిణిలా విలవిలలాడిపోయింది.

"అవును చెల్లీ - నేను వివాహితుణ్ణి. నా భార్య, తల్లి, బిడ్డ, అక్కలు మాదేశంలో ఉన్నారు. ఈసంగతి నీకు చెప్పాల్సిన సందర్భం ఇంతవరకు రాలేదు. నీ మనస్సులో అలాంటి ఉద్దేశ్యాలుద్భవించడానికి కారణం నేనే అయితే నా పాపానికి ఫలితం అనుభవిస్తాను. నా మనోమందిరంలో

నువ్వూ లూసీ దేవతాతుల్యులు మేరీ! నిన్నెప్పుడూ అలాంటి వికృతపు దృష్టితో చూడలేదు. మీరిద్దరూ నా సోదరీ సమానులు."

మేరీ దుఃఖానికి మేరలేదు. ఆమె మనస్సులో తీవ్ర సంచలనం చెలరేగింది. కొన్నిక్షణాలు ఇద్దరిమధ్యా నీరవ నిశ్శబ్దత అలుముకుంది. మేరీ అదాటున లేచి సీతారాం పాదాలను స్పృశిస్తూ అన్నది.

"క్షమించు అన్నయ్యా, ఇందులో నీతప్పేమీ లేదు. నా మనోబలహీనతకు ప్రాయశ్చిత్తం చేసుకొంటాను. నన్ను నువ్వు క్షమించకపోతే నాకు మనశ్శాంతి ఉండదు."

"మనోవికారాలు మానవులకు సహజమే. క్షమా పణలు దేనికి మేరీ. నీవు నా చెల్లెలివి. ఇకమీదకూడ నామీద గౌరవం, స్నేహం యిలాగే ఉంటాయ్ గదూ! లేక రేపటినుండీ నాతో మాట్లాడడం మానేస్తావా?! ఈ కానిదేశంలో నేను ఈ కాస్తన్నా సంతోషంగా ఉండ గలుగుతున్నానంటే మీ కుటుంబమూ, నీ సాంగత్యమే కారణం మేరీ"

"ఛ—అలా ఎన్నటికీ జరగదు అన్నాయ్! మీ మనస్సుకు తీరని బాధను కలిగించాను. మన స్నేహం ఇలాగే శాశ్వతంగా ఉండాలి. ఈ సంఘటనతో విచ్ఛిత్తి జరగడం హాస్యాస్పదం. మీరే ఇక ఇక్కడికి రావడం మాను కొంటారేమో. అలా జరుగగూడదు. అనుకొన్నవన్నీ జరిగిననాడు మానవుడు దేవుడే అవుతాడు. ఆశనిరాశల

సమ్మిశ్రితమే జీవితం" మేరీ అన్నది కన్నీటిని తుడుచుకుంటూ.

"అదేమిటి?! వేదాంతంలో కొచ్చావ్ నువ్వు. అలా నిరాశపడడం మంచిదికాదు మేరీ. మనిద్దరిమధ్య జరిగిన ఈ సంఘటనను తేలికగాతీసికొని మరచిపోవాలి... వస్తా. మా జేమ్స్ గోలపెడ్తాడు."

♦ ♦ ♦

తరువాత నాలుగురోజులు డాక్టరుగారింటికి వెళ్ళడం పడలేదు సీతారాంకు.

సీతారాం వెళ్ళేప్పటికి, ఆయనా, భార్య తోటలో కూర్చుని ఏదో మాట్లాడుకొంటున్నారు. సీతారాంను చూస్తూనే ఇద్దరూ, సంతోషంతో ఆహ్వానించారు.

"మరి రిజల్ట్ ఏమిటి? తేల్చారా"

"లూసీ వివాహం ఈ నెలలోనే సీతారాం ... నారాయణ కనిపించడంలేదే ... సిగ్గుపడుతున్నాడా పెళ్ళికొడుకు."

"మేరీ సంగతి ... ఏంచేశారు..."

"మేరీగురించి నీకు తెలుసుగదా. దాని భావాలే వేరుబాబూ. తను పెళ్ళిచేసుకోదట. జీవితాంతం బ్రహ్మచారిణిగానే ఉంటుందిట" అన్నారు నవ్వుతూ శర్మగారు. సీతారాం మనస్సు కలుక్కుమంది.

ఆయన ఆ విషయాన్ని నవ్వుతూ తేలికగా తీసికొన్నారేగాని, మేరీ అలాంటి కఠోరనియమాన్ని పూనుకో

డానికి వెనుక ఎంత విషాద గాథ ఉన్నదో ఆయనకు తెలియదు.

సీతారాం చాల బాధపడ్డాడు. ఆమె నిర్ణయానికి తనే కారణమయినట్లు. వీరితో స్నేహమే ఇన్ని అనర్థాలకి మూలంగా మారింది. తనను తప్పు అర్థంచేసికొని, నిరాకరింపబడి, ఇప్పుడు ఆజన్మబ్రహ్మచారిణిగా ఉండిపోతానంటోంది మేరీ. పిచ్చిపిల్ల.

మేరీ సోఫాలో కూర్చుని స్టాకింగ్స్ అల్లుతోంది. సీతారాం రావడంతోనే, లేనినవ్వు తెచ్చిపెట్టుకొని ఆహ్వానించింది. ఆమె కళ్లు ఉబ్బిపోయి భారంగా ఉన్నయ్. రాత్రంతా నిద్రలేదని తెలుస్తూనే ఉన్నది ప్రస్ఫుటంగా.

"ఏమిటి చెల్లీ. అంత కఠోర నియమాన్ని అమలు పరచబోతున్నావట"

"నిజమే, అబద్ధమేమీ లేదు అందులో..."

"నీకు అది భావ్యమేనా ... జీవితంతో చెలగాటం ఆడుతున్నావు మేరీ. జీవితంలో ఒకవంతు గడవలేదు. నీ జీవితానికి ఎలాంటి అసౌఖ్యం చేకూరినా, ఆ పాపంఅంతా నాకు చుట్టుకుంటుంది. దయచేసి నీ పట్టుదలను నాకోసం వదిలెయ్...మేరీ!!"

"నా నిశ్చయం మారదు అన్నయ్యా. నీ తప్పులేదు. బాధపడకు. రాత్రంతా ఆలోచించే ఈ నిశ్చయానికి వచ్చాను" మేరీ ఖచ్చితంగా చెప్పింది తన మనో నిశ్చయాన్ని.

భారంగా నిట్టూర్చాడు సీతారాం ఇక తను చేయ గలిగింది లేక.

ఆ రాత్రల్లా సీతారాంకు మనశ్శాంతి లేకపోయింది. మేరీ జీవితం అలాగావడానికి, ఆమె అంత కఠోర నియమాన్ని అవలంబించడానికి, తను ఎంతవరకు కారకుడు? తను ఏ విధంగానూ కావాలని ఉద్రేకపరచలేదు. తన స్నేహితాన్ని అపార్థంచేసుకొని, జీవితాన్ని చేజేతులా పాడుచేసుకొంటూంది. తన తప్పేంలేదు ఇందులో. శారదకు తను ఏ విధమయిన అన్యాయమూ చేయలేదు. తను ఇన్నికష్టాలుపడి, ఇన్ని వేలమైళ్ళు వచ్చింది, అంతా శారద కోసమే,...ఎలాగో సమాధానపరచుకొన్నాడు.

♦ ♦ ♦

నారాయణ, లూసీల వివాహం ఆడంబరంగా జరిగింది. డాక్టరుగారి స్నేహితులు, నారాయణ,సీతారాంల స్నేహితులు, విలువయిన బహుమతులు తెచ్చారు పెళ్ళికి. సీతారాంకూడా నారాయణకు, లూసీకి చక్కని ప్రెజెంటేషన్స తెచ్చియిచ్చాడు.

వివాహమయినకొన్నాళ్ళకి ఒకరోజున సీతారాంతో అన్నది లూసీ "నీవు నాకుచేసిన ఈ సహాయానికి జీవితాంతమూ ఋణపడివుంటాను అన్నయ్యా. నీ ఋణం ఎలా తీర్చుకొంటానో" అన్నది సజల నయనాలతో.

"అయ్యో లూసీ, అదేమిటి. కన్నీళ్ళుకూడానా...ఛీ ...తప్పు. ఇది నా కర్తవ్యం చెల్లీ. నా చెల్లెలుకోసం ఆమాత్రం చేయడం ఏమంత గొప్పకాదులే. ఇప్పుడు

నారాయణ నీ చేతుల్లోకి వచ్చాడుగా. చెవులు మెలిపెట్టు అల్లరిపిల్లాడు మరీనూ" అన్నాడు సీతారాం.

లూసీ కపోలాలు సిగ్గుతో ఎర్రబడి గులాబిరేకులే అయినై.

♦ ♦ ♦

నాజీ రాక్షసులు, మిత్రరాజ్యాల మధ్య ఘోర సంఘర్షణ తగ్గుముఖం పట్టింది. హిరోషిమాలో అమెరికా వాళ్లు బాంబులుకురిపించారు. సర్వంనాశనమయింది.ఆకాశా న్నంటే హర్మ్యాలు, కుప్పలుగాకూలి తీరని నష్టం సంభ వించింది. లక్షలాది జనం ఆ వినాశకారి విషాగ్నికీలల్లో దహించుకుపోయారు. వేలాది ప్రజలు అంగవిహీనులయి వికృతంగా మారి అంతులేని వింతజబ్బుల పాలయ్యారు. నాజీహంతకులు పట్టుబడ్డారు. హిట్లరు నియంత రాక్షస కృత్యాలకు, అతని అనుచరుల హంతక చర్యలకు ఆట కట్టింది. మన మిత్రరాజ్యాలు ఐదారేళ్ళ ఘోర సంగ్రామా నంతరం హాయిగా గాలి పీల్చారు. మిత్రరాజ్యాలదే గెలు పయింది.

సీతారాంవాళ్ళ రెజిమెంట్ మళ్ళీ ఇండియాకు తరలించబడింది. డాక్టరు శర్మగారు, కుటుంబంతో బాటుగా ఇండియాకు వచ్చేశారు. నారాయణ అల్లుడైనప్పటినుండీ తన ప్రయత్నంలో తను ఉన్నారాయన. అందులో మాతృ దేశంమీద, మాతృదేవతమీద ప్రేమలేనివారెవరు?! డాక్టరుగారుకూడ సీతారాంవాళ్ళతో బాటు మనదేశం వచ్చేశారు.

ఇళ్ళకు వెళ్ళదలచిన సైనికులందర్నీ డీమోబులైజ్ చేశారు.

తను అప్పుడప్పుడూ కూడబెట్టినదీ, వచ్చేటప్పుడు మిలిటరీ అధికారులు యిచ్చినదీ అంతాకలిపి పదివేలు దాకా సీతారాంవద్ద ఉన్నై. తన కష్టాలు గట్టెక్కినయ్ అనుకొన్నాడు. శారదను ఎప్పుడు చూద్దామా, బాబును ఎప్పుడు అక్కున జేర్చుకొందామా అని ఆతని హృదయం ఆతృతతో, ఆనందంతో పరవళ్లు త్రొక్కింది.

ఆరోజు ఇల్లువదలి వచ్చేనాటిరాత్రి—శారద అన్న "మంచిరోజులు వచ్చి తీరుతై మనకు. మనంకూడ ఆనంద డోలికలలో ఊగిసలాడుతాము. అలా ఆశించాలి మరి"... "ఎంతటి భయానక హాలాహలాన్నయినా అమృత ప్రాయంగా చవిచూస్తాను." అన్న వాక్యాలు సీతారాం మనస్సులో మెదిలినై.

తనెంతమాత్రం ప్రయోజకుడైనా అదంతా శారద అచంచలమైన ఓర్పు, దీక్ష ప్రభావమే. అనుకొన్నాడు సీతారాం తన మనోంతరాళంలో.

యింటికి వెళ్ళి శారదను అక్కున జేర్చుకొని "శారదా! హాలాహలాన్నయినా అమృతప్రాయంగా స్వీకరించే ఓర్పు, మంచితనమూ, నీవద్ద ఉన్నై, ఆ అపారమైన ఓర్పు, సహనమే, మనకు మంచిరోజుల్ని తెచ్చినై. మన జీవితం ఏమాత్రం సుఖపడ్డా అంతా నీ మహిమే. కాబట్టి తీసుకో బహుమానం." అని ఏదయినా మంచి బహుమానం యివ్వాలి. బాబుకు అయిదేళ్ళు వచ్చిఉంటాయ్. తనను

గుర్తుపట్టడు. ఎవరో క్రొత్తవాణ్ణి చూసినట్లు చూస్తాడు. "ఎవరో కాదురా, మీ నాన్నగారురా బాబూ!" అని శారద చెప్పి బాబును తనదగ్గరకు పంపుతుంటే ఎంత ఆనందంగా ఉంటుంది. అమ్మ తన మనస్తత్వాన్ని మార్చుకోనే ఉంటుంది. శారదకు అమ్మకు ఎలాంటి కలతలు, పోట్లాటలు ఉండిఉండవు. ఏవేవో ఆలోచనలు సాగుతున్నయ్ సీతారాం మనస్సులో.

విడిపోయేముందు సీతారాంను పంపడానికి డాక్టరు గారు, భార్యా, మేరీ, లూసీ, నారాయణ స్టేషను కొచ్చారు.

"అన్నయ్యకు ఎంత సంతోషంగా ఉన్నదో! వదిన దగ్గరకు ఎప్పుడెళ్ళి వాల్దామా అని ఉన్నది" లూసీ కిలకిలా నవ్వింది.

అంతా నవ్వారు. ఇప్పుడు లూసీ, మేరీ ఇద్దరూ చక్కగా తెలుగు మాట్లాడుతున్నారు. సీతారాం నారాయణల స్నేహంతో తెలుగు నేర్చుకోగలిగారు. పూర్వం శర్మగారే బలవంతాన నేర్పేవారు. లేకపోతే ఇంగ్లీషే. అంతా మాట్లాడుకోడం.

"వెళ్ళి క్షేమాలతో ఉత్తరం వ్రాయకోయ్. తర్వాత ఒకసారి అమ్మాయ్ని, బాబుని తీసికొనిరా, నాకు యిక్కడే చాలమంది తెలిసినవాళ్ళున్నారు. అల్లుడూ నేనూ జాయింట్‌గా ఏదయినా వ్యాపారం పెట్టాం. తర్వాత నేను అన్ని వివరాలతో వ్రాస్తాలే."

"తప్పకుండా రావాలి అన్నయ్యా! వదినను,

బాబును తీసికొనిరావాలి" నేరికి దుఃఖం పొంగిపొరలి వచ్చింది.

డాక్టర్ కుటుంబం, నారాయణ, సీతారాంకు భార హృదయాలతో వీడ్కోలు యిచ్చారు.

*   *   *

ఈ నాలుగైదేళ్ళల్లో, ఊరు ఏమీ మార్పు చెంద లేదు.

ఇంటికి చేరడంతోనే అనసూయమ్మ ఎదురై సంతోషంతో ఉక్కిరిబిక్కిరైంది. పెద్దక్క కూతుళ్ళూ కొడుకులూ, చుట్టేశారు మామయ్య వచ్చాడని. యిప్పుడు వీరంతా యిక్కడెందుకున్నారో సీతారాంకు అర్థంకాలేదు. అనసూయమ్మ యివీ అవీ అడిగింది ఆత్రంగా. కాని శారద, బాబు మాత్రం కనుపించలేదు సీతారాంకు.

చివరికి ఆతృత అణచుకోలేక సీతారాం అడిగేశాడు అనసూయమ్మను.

"శారద ఏదమ్మా!"

"కానీరా. అంతా చెప్తాను. ఇప్పుడేనా రావడం."

పిల్లలు బిక్కుబిక్కుమంటూ ఎక్కడివాళ్ళక్కడ జారుకున్నారు. అనసూయమ్మ మొహం వివర్ణమయింది. ఆమె కూడా తప్పించుకుని లోపలికి వెళ్ళబోయింది.

సీతారాంకు ఆతృతతో, అనుమానం జత జేరింది. కోపం పెల్లుబికింది. అమ్మ మనస్సు మార్చుకోలేదు. ఏదో జరిగి ఉంటుంది. పోట్లాడి యింటికి పంపేసి ఉంటుంది.

వెంటనే ఉద్రేకంతో పోబోతున్న అనసూయమ్మ రెక్క పట్టుకొని ఆపుజేశాడు.

"ఏది? శారద ఏది చెప్పు?" సీతారాం కళ్లు నిప్పులు చెరుగుతున్నాయ్. ముఖం భయంకరంగా ఉన్నది. అనసూయమ్మ స్తంభించిపోయింది. సీతారాం ఆకృతిని, కోపాన్ని చూసి. అతని కళ్ళల్లోకి భయంగా, బెదురుగా చూస్తూ ఉండిపోయింది.

"ఊఁ చెప్పు! శారదా బాబూ ఏరి?" కుదిలించి వేశాడు అనసూయమ్మను.

"లేదు..."

"ఎక్కడికెళ్ళిందో చెప్పు నసబెట్టక"

"లేదు...చచ్చిపోయి రెండేళ్ళయింది."

సీతారాం హృదయం బ్రద్దలయింది. అతని ఆశాహార్మ్యాలన్నీ నేలకూలినై. అంతా అయోమయంగా తోచింది. అనసూయమ్మ చెంప ఛణేల్‌మంది.

వెనుకాముందూ చూడలేదు. అనసూయమ్మ రెక్క వదలకుండానే తేరుకొని అన్నాడు.

"ఎందుకు చచ్చిపోవాల్సి వచ్చింది. నిజం దాచావో నువ్వూ దానిదగ్గరకే వెళ్తావ్. చంపేస్తాను."

"అందరూ ఎలాచస్తారో అలాగే చచ్చిపోయింది."

"ఏమయిందో వివరంగా చెప్పు ... అడ్డదిడ్డపు సమాధానాలు చెప్పక"

"జబ్బుచేసింది."

"బాబుకూడా జబ్బుచేసిందా? వాడేడీ"

ఇంతలో బాబే అటుగా వచ్చాడు. అయిదేళ్ళ కుర్రాడు. వంట్లో సత్తువలేదు. కళాకాంతులు లేవు, చిక్కిపోయి ఉన్నాడు. సరయిన గుడ్డలుకూడా లేవు. సీతారాం హృదయం తరుక్కుపోయింది. అమాంతం వెళ్ళి వాణ్ణి ఎత్తుకొని హృదయానికి హత్తుకొన్నాడు.

బాబు ఉక్కిరిబిక్కిరై పోయాడు. ఆకాస్త వాత్సల్యానికే తబ్బిబ్బైపోయాడు. ఇంతవరకు ఒక్కసారికూడా అంతప్రేమను చవిచూసి ఉండడు!

తిరిగి అనసూయమ్మను నిలదీసి అడిగాడు.

"డబ్బు వస్తోందికదా. మందులు ఎందు కిప్పించ లేదు?"

"ఆకాస్తడబ్బు ఎన్నింటికి వస్తుంది. పెద్దది నెక్లెసు చేయించుకొన్నదా..."

"ఛూ!... సిగ్గుండాలి – జబ్బుచేసి ఒకవైపు చచ్చిపోతుంటే మందులు ముందా, అలంకారానికి నెక్లెసు ముందా... సిగ్గులేదూ!" ఎడాపెడా మళ్ళీకొట్టాడు అనసూయమ్మను.

మనస్సు వికలమయిపోగా, బాబును తీసికొని అలా కాలవగట్టుకు పోయాడు సీతారాం.

రంగయ్యపంతులు కలిశాడు. రంగయ్య సీతారాం వాళ్ళ పొలం కౌలుకుతీసుకొన్నాడు. సీతారాం తండ్రి పోయినప్పటినుండి, రంగయ్యే ఆ ఒక ఎకరాన్ని పండిస్తున్నాడు. అన్నిసంగతులూ సీతారాంకు రంగయ్యపంతులే చెప్పాడు... అనసూయమ్మ సరిగ్గా అన్నం అదీ పెట్టేది కాదుట. శారదను కొట్టేదట ఎప్పుడుపడితే అప్పుడు. సగం ఆమె కొట్టడంవల్ల, పెట్టేబాధలకే, జబ్బుచేసిం దంటాడు రంగయ్య. మందులిప్పించవమ్మా, యిదెక్కడి శతృత్వం, కోడల్ని అలా బాధలు పెట్టావా అని అంటే ఎదురు అతని మీదకే పోట్లాట కొచ్చిందట..."మందులు ఎక్కడినుండి వస్తయ్ — డబ్బులేదు — మాకు చేతకాదు" అనేదట.

శారద చనిపోయిన తరువాత అనసూయమ్మను తిట్టనివాళ్ళు లేరట ... అన్నీ వివరంగా చెప్పి కంట తడి పెట్టాడు రంగయ్య.

సీతారాం భవిష్య దాలోచనలన్నీ చెల్లాచెదురై పోయినై. అత నెవరికోసం దేశాలుతిరిగి డబ్బు సంపాదించుకొచ్చాడో, వారు శాశ్వతంగా దూరమైపోయారు. "యిక ఆపిల్లాడ్నికూడ ఆరాక్షసి హస్తాల్లోపెడ్తే ఎప్పుడో ఒకప్పుడు వాడుకూడ శారద దగ్గరకే వెళ్తాడు. నాబాబును అలా ఎన్నటికీ అన్యాయంచెయ్యను. ఈ నరరూప రక్కసులకు

దూరంగా వాడిని తీసికొని వెళ్ళిపోతాను.” అనుకొన్నాడతను.

“శారదమ్మ జబ్బులో ఉండగా ఆమె తల్లీ దండ్రీ యిద్దరూ వచ్చారు బాబూ! అనసూయమ్మగోరు వారితో మాట్లాడితేనా బాబూ! రాగానే పోట్లాటవేసుకు కూచ్చున్నారు. శారదమ్మను తీసికెళ్తానంటే ససేమిరా వీలులేదంటుంది. శారదమ్మగోరు కూడ, “నే నిక్కడే ఉంటాను. ఎక్కడికీ రాను. మీరు వెళ్ళండి” అని చెప్పేశారు. ఎన్ని కష్టాలుపెట్టినాతొణకలేదు బాబూ. మాలక్ష్మి. మీరొచ్చేదాకా ఆయింట్లోనే ఉండాలని పట్టుదల.”

సీతారాం దుఃఖం ఆపుకోలేక పైకి ఏడ్చేడు ... రంగయ్య బాబునుతీసికొని సముదాయించాడు... “ఇక్కడ ఉంటే నాబాబుకూడా దక్కడు రంగయ్యా, బాబును తీసికొని ఎటన్నా వెళ్ళిపోతాను...”

“చిన్నప్పుడు మిమ్మల్ని చూస్తుంటే; మాబాబు కలక్టేరు అవుతాడని అనుకొనేవాడ్ని బాబూ. బాబుగారూ అలాగే అనేవారు. మీ అదృష్టం యిలా ఉంటుందని అనుకోలేదు. మనం ఏదో సాధించాలని అనుకొంటూ ఉంటాంగాని, విధిగీసిన గీటుదాటి ఒక పొర్లుకూడ దాటలేం బాబూ. అనసూయమ్మగోరు మీ రేదో డబ్బుతెస్తారని ఆశపడ్తోంది. జాగ్రత్తపడండి. లేకపోతే మీతోబాటు బాబు

కూడ పనికిరాకుండా పోతారు. నిరాశపడకుండా బాబును తీసికొని ఎటన్నా పొండి బాబూ!" రంగయ్య ఏడుస్తూనే చెప్పాడు; తన కళ్ళముందే సంసారం యిలా విచ్ఛిన్నం చెందడంచూసి; అతనిమనస్సు తరుక్కుపోయింది.

సీతారాందగ్గర డబ్బు ఎంత ఉందో తెలిసికోవాలని ఎన్నో ప్లానులు వేసింది అనసూయమ్మ. సీతారాం నానా తిట్లూతిట్టాడు. ఒక్క చిల్లిగవ్వ యివ్వనుపొమ్మన్నాడు. "నేనెంత పాపం చేసుకొంటేనో నువ్వు నాతల్లివైనావు. నువ్వు మనుష్యులలో పుట్టవలసినదానివి కావు – రాక్షస అంశ ఉన్నది; అందుక నే అది చస్తున్నా పట్టనట్టు ఊరుకో గలిగావు. మీపాపానికి పరిహారం చెల్లించుకొనేరోజు తప్ప కుండా వస్తుంది. ఇకముందు నీకూనాకూ ఎటువంటి సంబంధం ఉండబోదు..." అని చెప్పి బాబును తీసికొని సీతారాం వచ్చేశాడా ఊరునుండి.

సీతారాంను, అతనిచేతిలోని ఎముకల గూడయిన బాబునుచూసి నారాయణ నిర్ఘాంతపోయాడు. సీతారాం కూడా సరిగ్గా తిండీ, నిదురలేక బికారిలా ఉన్నాడు. డాక్టరు గారూ వాళ్ళు సీతారాం పరిస్థితిని చూసి అచేతను లయినారు.

"ఏమిటి మూర్తీ! – ఏమిటీ వాలకం?" అన్నాడు నారాయణ సీతారాంనుపట్టి కుదిలించివేస్తూ.

సీతారాం అంతా చెప్పాడు... డాక్టర్ ఫామిలీ, నారాయణ, పడ్డబాధ వర్ణనాతీతం.

"ఈ నాబాబు భవిష్యత్తును నీవు తీర్చిదిద్దాలిరా!" అన్నాడు సీతారాం భారహృదయంతో గాద్గదికంగా.

నారాయణ సరే నన్నాడు.

"లూసీ...ఆరోజు...నీ ఋణాన్నిలా తీర్చుకోగల నన్నయ్యా. అన్నావు కదూ...ఇదిగో—నా బాబును ఒక మనిషిగా జేసి...నీ కోరిక తీర్చుకో...వాడి బాధ్యత నీదే."

లూసీ దుఃఖం ఆపుకోలేకపోయింది. రోజ్ మేరీ పరిస్థితి చెప్పలేము. సీతారాం, బాబును వదిలేసి ఎటన్నా దేశాలపాలవుతాడేమోనని భయపడింది. "బాబునువదిలేసి ఎటువెళ్తారు...ఇక్కడే ఉండాలి మీరు..."

"నా మనసేం బాగోలేదు మేరీ. నీవనుకొన్నట్లు నేనేమీ అలాచేయనులే.అయినా నేను ఉండి ఏమీ అనుభవించాల్సింది లేదు. అంతా జరిగిపోయింది."

మేరీ అదిరిపోయింది. "అలా జరుగగూడదు. మీరు ఉండాలి. మీ బాబును అనాథను చేయడం భావ్యంకాదు సీతారాం!"

"నేనేమీ ప్రాణత్యాగంచేయను మేరీ. నా మనస్సు బాగోలేదు. మనశ్శాంతికోసం దేశాలు తిరిగివస్తాను,అంతే"

సీతారాం వాగ్దానం చేశాడు. ఎవరూ సీతారాంను ఆప లేకపోయారు.

తరువాత సీతారాం అందరిదగ్గర సెలవుదీసికొని, తనవద్దఉన్న డబ్బంతా నారాయణకిచ్చి, కొంత డబ్బుతో వచ్చేశాడు.

నారాయణ బాబును ఆదరిస్తాడనీ, వాడికి లోటు లేకుండా పోషణభారం వహిస్తాడని దృఢవిశ్వాసం సీతా రాంకు వున్నది.

నిశ్చింతగా, సీతారాం దేశమంతా సంచారం చేశాడు. పుణ్యక్షేత్రా లన్నిటినీ సందర్శించాడు. కొన్నేళ్ళ తరబడి నారాయణ, బాబును వదలి తిరిగి చివరకు ఒక చోట స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు...నారాయణకూడ సీతారాం ప్రాణస్నేహితుడు. మాటతప్పేవాడు కాడు. బాబును స్వంతకొడుకులా పెంచి ప్రయోజకుడిగా చేశాడు. ఇప్పటికీ బాబుకి తండ్రి ఉన్నాడని, నారాయణ తండ్రి కాడని తెలియదు. సీతారాంకూడ ఆ విషయం తెలియ కుండా దూరంగా వుంటున్నాడు. బాబు జీవితం చెడిపో కుండా; వృద్ధిలోకి వచ్చాడని సీతారాంకు అపరిమితమైన తృప్తి. అతనికి కావలసింది అదే. అకస్మాత్తుగా రహస్యాన్ని చెప్పి తిరిగి కల్లోలం రేపడం సీతారాం కిష్టంలేదు"

మూర్తిగారు చెప్పడం ఆపి మురళి ముఖంలోకి చూశారు. "ఇదే మురళీ! నా స్నేహితుడి గాథ. వాడి జీవితం అలా నాశనమయింది. బాధను అణచుకోలేక నీకు చెప్పా బాబూ. అది నీ రచనల్లో ఇమిడ్చి, ఈ విషాద భయంకర జీవితాన్ని ప్రజలకు పరిచయం చెయ్యి"

మురళి ఆగలేకపోయాడు. ఆతృత అణచుకోలేక... మూర్తిగారి చేతులు పట్టుకొంటూ అన్నాడు. "వాళ్ళెక్కడున్నారో చెప్పండి. అలాంటి లోకాతీతుడైన నారాయణనూ, సీతారాంగారి బాబును కలుస్తాను. సీతారాం గార్నికూడ కలవాలనిఉంది. నాకాభాగ్యం కలిగించండి, నామీద దయవుంచి"అన్నాడు మురళీకృష్ణ భావావేశంతో.

మూర్తిగారు చిరునవ్వు నవ్వారు. "చెప్తాను బాబూ! ఆవిషయం యావత్తూ చెప్పాలనే నిన్నింత అర్థరాత్రివరకూ నిద్రలేకుండా కూర్చోబెట్టాను...విను...సీతారాం, నారాయణ, బాబూ, మేరీ, లూసీ అంతా యిప్పుడు ఈ నా కుటీరంలోనే ఉన్నారోయ్..."

మురళికి ఏమీ పాలుబోలేదు. "నాకేం అర్థం గాకుండా ఉంది. వివరంగా చెప్పండి బాబుగారూ!" అన్నాడు మురళి ఆతృతతో.

"అవునోయ్. శీతారాం, నారాయణ అంతా ఇక్కడే ఉన్నారు. ఆ శీతారాం నేనేనోయ్. నువ్వేనోయ్ నా

బాబువి" అన్నారు మూర్తిగారు మురళిని హృదయాన చేర్చుకొంటూ.

శీతారాం, మూర్తిగారు ఒకరేనని తెలియగానే మురళి స్తంభించిపోయాడు. కూర్చున్నచోట భూమి విచ్చి పోయి రసాతలానికి కృంగిపోతున్నట్లు భయంకరమైన అనుభూతిని పొందాడు. ఎదురుగా పర్ణశాలలా మూర్తిగారి ముచ్చటయిన కుటీరం, చుట్టూ ఆహ్లాదకరమైనతోట, సుందర ప్రకృతి లావణ్యం. ఏమీ కనుపించలేదతనికి. అంతా శూన్యం. పూర్ణచంద్రుని కిరణస్రోతస్విని, పిల్లయేటి ముహుర్ముహురావం, వాటన్నిటికీ అతీతుడై చేష్టలుడిగి స్తంభీభూతుడైపోయాడు మురళి.

"నాన్నగారూ!" అని పెద్దపెట్టున అరుస్తూ ఆయన పాదాలమీద పడిపోయాడు మురళి.

సీతారాంగారు, సంతోష విచారాలు మిళితంకాగా, గాద్గదికంగా; కొన్ని సంవత్సరాల అనంతరం, పుత్ర పరిష్వంగ సుఖాన్ననుభవిస్తూ... కొంతతడవు తననుతానే మరచిపోయారు.

"అవునుబాబూ...నేను నీ తండ్రినే. ఆ అభాగ్యుడ్ని నేనే నాన్నా!... యిప్పటివరకు మీతల్లిగా నిన్ను పెంచి వాత్సల్యామృతంతో పెద్దచేసిన ఆమె అరుణాదేవికాదు...

ఆనాటి లూసీ బాబూ! మీనాన్నగా నిన్నింతటివాణ్ని చేసిన ఆయన నా ప్రాణమిత్రుడు నారాయణ రా!... ఈ నా కుటీరంలో నాతోబాటు ఉంటూ అజన్మ బ్రహ్మచారిణిగా కఠోరనియమాన్ని పుచ్చుకున్న ఈ కరుణాదేవి ఆనాటి భగ్న ప్రణయిని రోజ్ మేరీ బాబూ! ఆనాటి రోజ్ మేరీ లూసీలకు ఈనాటి ఈ త్యాగమూర్తులు అరుణా కరుణా దేవీలకు ఏమీ సాపత్యంలేదు తండ్రీ. అంతా నీకోసం పేర్లు మార్చుకొని అజ్ఞాతంగా ఉండాల్సివచ్చింది. భవిష్యత్తులో ఇలాంటిరోజు వస్తుందనే ముందు చూపుతోనే ఇలా చేశాను. రోజ్ మేరీ, నేను యిక్కడ అజ్ఞాతంలో నివాసం ఏర్పరచుకొన్న తదనంతరం, తాను నామీద తన అచంచలమైన భక్తితత్పరతలకు, అభిమానానికి తార్కాణంగా నాకు సపర్యలుచేస్తూ నాతోనే ఉంటూ వచ్చింది. ఆమె జీవితం యిలా అధోగతి పాలుగావడం నామూలంగానే. డాక్టర్ గారూ, భార్య అకస్మాత్తుగా పదేళ్ళక్రితం హృద్రోగంతో మరణించారు."

సీతారాం తేరుకొనేలోపలే గలభాకు అంతా లేచారు. జరిగినదంతా తెలిసికొన్నారు.

"అవును బాబూ! మీనాన్న ఆయనే. ఆయనకోరిక ప్రకారం నిన్ను పెంచే బాధ్యత నేను తీసికొన్నాను. మీ తల్లి అరుణకాదు. ఆమె ఎన్నడో మానవుల కఠోర అంత

త్మలకు వికృత చేష్టలకు బలి అయిపోయింది. ఈమె ఆనాడు మలయాలో వివాహమాడిన లూసీయే. పెంచి పెద్దచేసింది మేమైనా, నీవు యిప్పుడు సంతోషపెట్టాల్సింది, ఈ మీ నాన్నను. ఆయనకోసం మీ అమ్మ రూపంలో సేవలు చేస్తున్న కరుణాదేవిని. ఆమే ఆనాటి రోజ్ మేరీ మురళీ!...” అన్నారు రాజశేఖరం ఉరఫ్ నారాయణ గారు.

మురళి ఆయన పాదద్వయంపై వాలిపోయాడు. ఆయనమీద భక్తి ప్రపత్తులతో ఉబికివచ్చిన కన్నీటి కడలిలో, ఆయన పాదయుగ్మాన్ని క్షాళనం చేశాడు మురళి.

అతనికి అత్యంత ఆప్తులయిన మేరీ లూసీల వదనాలలో శుభ్రజ్యోత్స్నలు ప్రతిఫలించినవి. నారాయణగారు మురళిని లేవనెత్తి ఆప్యాయతతో తల నిమిరారు.

మురళి స్తబ్ధుడై అందరివైపు ఆనందంతో, అమాయకంగా చూస్తూ నిల్చుండిపోయాడు.

రేరేడు శీతలకిరణపుంజంతో మురళి హృది పులకించింది... పిల్లయేఱు ఆ నిశ్శబ్ద నిశీథంలో మధురగానాన్నాలాపించింది. ఎక్కడో చెట్ల గుబుర్లలోని కోయిల కలకలనాదం మృదులమధురంగా దిక్కులు వ్యాపించింది. మాధవీలత చిరుపవనానికి పులకించి జలజలలాడింది. ముద్దగులాబి, మల్లె పొదలు మధుర పరిమళాన్ని వెదజల్లుతూ సంతోషంతో ఒళ్ళు విరుచుకున్నై.

—o—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B198 |
| పుస్తకం పేరు | మమత మానవత |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 197 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4,196 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munitha |
| పేజీలు విడదీసినది | munitha |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |